ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో

అనర్ఘ రత్నం - 11

చివరకు మిగిలేది-2

"అన్నీ ప్రశ్నలే - సమాధానం లేదు.
ఎందుకు? ఎక్కడ? ఎప్పుడు? ఎట్లా?
అందుకా? ఎవరు? ఏది? ఏవి? ఎన్ని?

........................................

చుట్టూ నవ్వులు, మధ్యలో ఏడుపు; అంతటా ఆనందం, లోపల ంద్రంలో బాధ; అంతటా వెలుగు, మధ్య చీకటి: పైనా కిందా, డమా కుడీ దైవం - మధ్య మృగం. అన్నీ పోయాయి. అంతా యింది. చివరికి మిగిలింది తను!"

*　　　　*　　　　*

కథానాయకుడు దయానిధి సర్కారు జిల్లాల వాతావరణంలో మనలేడు. అనేక అనుభవాలు అతన్ని ఏకాకిని చేస్తాయి. రాయల మలో మరో జీవితం ప్రారంభిస్తాడు. అదృష్టవశాత్తు అతనికి భాగ్యం స్తుంది. స్థిమిత పడుతుండగానే మళ్ళా, పూర్వపు అనుభవాలు క్తులు అతన్ని చుట్టుముట్టుతాయి. ప్రేమ రాహిత్య ప్రవాహంలో పడి తాడు. ప్రాణాలతో బైటపడి, మరో చోట మరో జీవితం సాగించ నికి వెళ్ళిపోతాడు....

# చివరకు మిగిలేది

యం. శేషాచలం అండ్ కో
మచిలీపట్నం. మద్రాసు. సికింద్రాబాదు




137

Modern Classics - 11

# CHIVARAKU MIGILEDI - Part 2

By

BUCHI BABU

Publishers:

M. SESHACHALAM & CO.

First Published: 1952

Emesco Pocket Books-

First Print:

August, 1970

Printers:

Sri Kala Printers

Madras-33.

Cover Design:

Bapu

Distributors:

ANDHRA PRADESH BOOK DISTRIBUTORS

Rashtrapathi Road, Secunderabad

Rs. 2/-






137

# 4

# చప్పుడు చెయ్యని సంకెళ్లు

ఎనిమిది మాసాలు గడచినై. సంక్రాంతికి రమ్మనమని మామగారు ఆహ్వానించారుగాని, దయానిధి, చివరి సంవత్సరం పరీక్షలు దగ్గర పడుతున్నై, చదువుకోవాలి, రాకపోయినందుకు క్షమించమని వ్రాశాడు. ఒకసారి మాధవయ్యగారు, ఏదో పనిమీద పట్నం వొచ్చి, తీరికలేక అల్లుడుని కలుసుకోకుండానే మరునాడు తిరిగి వెళ్ళిపొయ్యారు. అది జరిగిన నెలరోజులకి మాధవయ్యగారు అల్లుడుకి వొందరూపాయిలు మనియార్డరు చేశారు. ఎందుకు చేసినట్లో అతనికి అర్థంకాక, ఆ మనియార్డరు తిరగగొట్టాడు. మామగారు, తన తాహతుకు తగినట్లు పంపగలననీ, అచ్చట్లు, ముచ్చట్లు కేవలం డబ్బులోనే లేవనీ, ఐతా యిప్పటి యువకులంతా అదో రకం మనుషులనీ కాస్తంత చిరాకు ప్రకటిస్తూ యింగ్లీషులో పెద్ద వుత్తరం వ్రాశాడు. దానికి, నేటి యువకులు మాయమర్మం తెలీని వాళ్ళనీ, స్వాతంత్ర్యాన్ని, ముఖ్యంగా ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ఎక్కువగా కాంక్షించడంవల్ల, బానిసత్వానికి అలవాటు పడిన వాళ్ళకి బాధకలగడం తప్పదనీ జవాబు వ్రాశాడు. ఆ వుత్తరం ధోరణి మాధవయ్యగారికి అర్థంకాలేదు. నవ్వుకుని భార్యకి చదివి వినిపించాడు; ఆవిడ 'మా అల్లుడు ఉత్తరాలు చాలా బాగా రాస్తా' డని, యిరుగు పొరుగుతో చెప్పుకుని సంతోషించింది. మాధవయ్యగారు ఆవుత్తరాన్ని, ఏదో సందర్భంలో,

స్పెన్సర్ చుట్టలపెట్టి పోలీసు సూపరింటెండెంట్ గారికి ఐహూక రించి, చదివి వినిపించారుట. ఆయన నవ్వి "ఈ స్వాతంత్ర్యం అనే జబ్బు తొందర్లో వొదిలిపోతుంది, కార్యం చేసెయ్యండి" అని సలహా యిచ్చాడు. నాలుగు నెలల్లో ముహూర్తం స్థిరపరచి, మాధవయ్య గారు, అల్లుడికి తెలియబరిచాడు. 1936 మార్చికి అతని పరీక్షలు పూర్తయ్యాయి; ఏప్రిల్ 13న ముహూర్తం. ఆహ్వానాలు అవీ పంపి, పెద్ద గందరగోళం లేకుండా, కార్యం జరిపించమని, నిధి వుత్తరం వ్రాశాడు. ఇది 'అడంగుల సరదా' సమయంకాబట్టి, వారందరికీ తెలియజెయ్యక తప్పదనీ, యథావిధిగా తంతంగా జరగాల్సిందే'నని మాధవయ్యగారు జవాబు వ్రాశాడు. నిధి, తన బంధువులనీ స్నేహితు లనీ ఎవ్వరినీ ఆహ్వానించలేదు. కార్యం అంటే సంకెళ్లు తగిలించడం అన్న 'రాజా' మాటలు జ్ఞాపకాని కొచ్చాయి. రెండు తలుపులూ ఎవరో బైట గొళ్లెం పెడతారు: అదే సంకెళ్ళు చప్పుడు చెయ్యడం అంటే. ఐతే లోపలతలుపు, మొదట ఎవరు గడియ పెడతారు? స్వతంత్రాన్ని పోగొట్టుకుని బానిసయ్యేటందుకు ఎవరు ఎక్కువ వుబ లాటపడుతున్నారో, వాళ్లు! సంకెళ్లు చప్పుడు చెయ్యకూడదు అని నిశ్చయించుకున్నాడు, నిధి.

ఫ్లాస్కులో టీ, సిగరెట్టుటిన్ను, ఎలక్ట్రిక్ దీపం తీసెయ్యడం, అవలించడం, పుస్తకం ముయ్యడం,—మార్చి గడచిపోయింది. అప్పు డప్పుడు, ఉత్తర ధ్రువంలో వుండగా చదువుకున్న వుత్తరంలా, 'సీనూ' దగ్గరనుంచో, 'రాజా' దగ్గరనుంచో వొచ్చిన ఉత్తరాలు చదివి నవ్వుకొని మళ్లా పుస్తకం తిరగెయ్యడం,— ఏప్రిల్ రానే వచ్చింది. మూడో తేదీని, దశరథరామయ్యగారి వద్దనుంచి మని యార్డరూ, వుత్తరం వచ్చాయి. ఆ వుత్తరంలో ఏడెకరాలు భూమి అమ్మవల్సి వచ్చినట్లుంది. ప్రాక్టీస్ ప్రారంభించే నిమిత్తం, రెండు వేలు బాంక్‌లో వేసి, మిగత సొమ్ముతో చేసిన అప్పులన్నీ తీర్చివేశా రుట. ఇంక మూడెకరాల ఆస్తిమాత్రం మిగిలింది. వేసంగికి, : ట వాణ్ణి తీసుకొని బెంగుళూరు వెడుతున్నాననీ, కార్యం అవగానే ఇందిరని బెంగుళూరు తీసుకురమ్మని వ్రాశారు. నాలుగో తేదీన పోస్టులో 'సీనూ' దగ్గరనుండి, వొకపార్సెలు, కవరు వచ్చాయి.

ఆ పార్సెలు విప్పితే; పుస్తకం వుంది. అది హేవ్‌లాక్ ఎల్లిస్, వ్రాసిన, "స్టడీస్ ఇన్ ది సైకాలజి ఆఫ్ సెక్సు" రెండో భాగం. ఉత్తరం యిది :

"నువ్వు దాచినా మహా దాగదు లేవోయ్. వివాహానికి కూడా రాలేకపొయ్యాను. ఈసారేనా వొద్దామనుకుంటే నువ్వు రమ్మని మనేనా వ్రాయలేదుగా. అందుచేత, సమయోచితం అనుకుని వో పుస్తకం పంపుకుంటున్నా.

అన్నట్లు చెప్పడం మరిచిపొయ్యాను. నా పెండ్లి సంబంధం కూడా కుదిరేటట్లుగా వుంది. గోవిందరావనీ, వో తాసిల్దార్— ఆయన కూతురు సుశీలని—బాగానే వుంటుందిలే. బాగంటే ఎక్కడికి—కళ్ళజోడు తీసేస్తే మనిషి సంసారపక్షమే, చదువుకున్నపిల్ల భాయిూ అందుచేత పదిమందీ నా వెనకాల నిలబడితేగాని, మనం తట్టుకోలేం. నా పెళ్ళికి నిన్ను రప్పించేటందుకు, యీ పుస్తకం గాలం లా వేశానని అనుకోకుసుమా."

శ్రీనివాసరావు, తన ఆరోగ్యం విషయం వ్రాయనందుకు నిధి విచారించాడు. ఐనా పరీక్షాఫలితాలు యింకా రాలేదుగా!

ఐదోతారీఖున రాజభూషణం దగ్గరనుంచి వొచ్చిన వుత్తరంలో యిల్లా వుంది :

"మనం ఎన్నిసార్లు కలుసుకుని మాట్లాడుకున్నా, ఒక విషయం నీతో చెప్పడానికి భయపడ్డాను, పైగా నీకు జ్ఞాపకం వుందా, వెనక నీతో 'అదేం కర్మమో, మన రహస్యాలని మన స్నేహితులతో చెప్పుకోం' అని అన్నాను. అందుచేత నీ దగ్గర దాచేటందుకు వీల్లేదు. ముఖాముఖీని చెప్పేటందుకు ధైర్యం చాలక వుత్తరం వ్రాస్తున్నాను.

ఆనాడు మనం ఆశ్రమాన్నుంచి యింటికి వొచ్చాక, ఆ రాత్రి వూరేగింపులో, సుశీల నన్ను ప్రేమించినట్లు నాకు అనుమానం కలిగింది. నాలో ఏం చూసిందో నా కర్థం కాలేదు. ఆశ్రమంలో తాలవగట్టున, సుశీలతో నేను చాలా సేపు ప్రసంగించటం జరిగింది. నవ్వేసమయంలో సుశీల కదిపింది; నేను కరిగిపొయ్యాను. దానికి కొంతవరకూ, ఆ సమయం, ఆ వాతావరణం కారణం అనుకుంటా. మళ్ళా, ఆమెలోనూ, నాలోనూ సమానంగా ఏవీ లేవు. మే మిద్దరం,

ఉత్తర దక్షిణ ధ్రువాలం. ఇంచుమించు ప్రతివిషయంలోనూ మాకు అభిప్రాయభేదం తోచింది. ఒకవేళ మాఅన్యోన్య ఆకర్షణ కారణం అదేనేమో! మన పుస్తకాల సంపర్కానికీ, జీవితంలో యధార్థాల్ని ఎదుర్కొన్నప్పటి ప్రవర్తనకీ సంబంధంలేదు కాబోలు. పెండ్లిని గూర్చి నా అభిప్రాయం మార్చుకోవల్సి వొచ్చిందంటే నువ్వు నవ్వుతావని తెలుసు.

నీ విషయం సుశీల చాలాసేపు ప్రస్తావించింది. నువ్వు దొంగవంట, వొక్క ముక్కలో. నీ కసలు నీతి లేదంది; నీకు కోమలితో, నాగుమణితో, అమృతం అంట ఎవరో, ఆమెతో సంబంధం వుందట. నువ్వు అందరినీ ఆకర్షించి, ఆట వొస్తువులుగా వాడుకుని, నవ్వి, మరిచిపోతావుట, సుశీల మాత్రం నీ నాటకం కనుక్కొని, నిన్ను దూరంగా వుంచిందట. అసలా లక్షణం మీ వంశంలోనే వుందిట. ఇన్ని చెప్పి, 'గట్టిగా పట్టుబడితే అతన్ని వివాహం చేసుకునే దాన్నేమో' అన్నది. ఇవేవీ నిజంకావని నాకు తెల్సు. కాని సుశీల మెప్పు పొందాలన్న అభిలాష వుండబట్టి, నేను వీటిని ఖండించి, తీవ్రంగా వాదించ లేదు. సత్యాన్ని స్వార్థంకోసం త్యాగచేసినందుకు నేను పశ్చాత్త పడనవుతున్నాను. కాని ఏం లాభం! పశ్చాత్తాపమే పాపిని ప్రోత్సహిస్తుంది కాబట్టి, నాకు పశ్చాత్తాపంలో నమ్మకంలేదని నీ కెల్లానూ తెలుసు. అక్కడికీ సుశీలతో అన్నాను: 'దయానిధి ఎవ్వరినీ నొప్పించలేదు; అందరినీ ప్రేమించి సంతోష పెట్టడం అతని నైజం; నిన్నూ ప్రేమించి సంతోషపెట్టాడేమో! తనకోసం త్యాగం చేసిన పురుషుణ్ణి స్త్రీ ఎప్పుడూ క్షమించదు, అందుకనే నీ కతడంటే అంత మంట' అన్నాను. ఎందుకో విచారంతో కళ్లు తడిసినై. కళ్ళని తుడుచుకుంది. అప్పుడు నేను భుజంమీద చెయ్యివేసి సముదాయించటం జరిగింది, సుశీల అయిష్టం చూపలేదు; మౌనం అంగీకారం అనుకున్నా. స్త్రీలు ప్రేమించడం సంభవం అని వొప్పుగుంటున్నా. సుశీల నన్ను ప్రేమించడం–అనే మిరకిల్ జరిగింది. మిత్రుడవు కాబట్టి దాచకుండా మనసులో సంగతులన్నీ చెప్పి వేశాను, నేను సుశీలను పెండ్లి చేసుకోవడం మంచిదంటావా? తిరుగు టపాలో జవాబుకోసం నిరీక్షిస్తూ వుంటాను."

అదీ ఉత్తరం. ఈ ఉత్తరంలోని ముఖ్యమైన విషయాలు దయానిధికి ఆశ్చర్యం కలుగచెయ్యలేదు. అతన్ని బాధ పెట్టినవాక్యం ఒక్కటుంది;- 'అసలీ లక్షణం మీ వంశంలోనే వుంది-అంది' అన్నది. వెనకటి విషయాలు జ్ఞప్తికి తెచ్చుగుంటే, యిందులోనూ ఆశ్చర్యం తగ్గింది, రాజభూషణంతో పరిచయం కలిగిం తర్వాత సుశీల శ్రీనివాసరావుతో పెండ్లి సంప్రదింపులు జరిపిందన్న విషయం వ్యక్తమైంది. కాబట్టి వొక విషయం తేలిపోయింది-సుశీల, ఎవర్ని పెండ్లి చేసుకుంటుందో తెలీదుకాని, రాజభూషణాన్ని మాత్రం చేసుకోదని. వెంటనే ఉత్తరానికి జవాబు యిల్లా వ్రాశాడు.

"—పెండ్లిని గురించి నీకు సలహా యివ్వ సమర్థుణ్ణి కానని నీకూ తెలుసు. కనీసం నాకు అనుభవం కూడా లేదు. నీ ఉత్తరంలో వొక్క విషయాన్ని నేను సంశయిస్తున్నాను. సుశీల నిన్ను ప్రేమించిందని వ్రాస్తున్నావు. నే ననుకోవడం, సుశీల అసలు ఏ పురుషుణ్ని ప్రేమించలేదు.

సుశీల ప్రేమించేదల్లా, ఎవరో తన్ను ప్రేమిస్తున్నారు అన్న అనుభవాన్ని. నా అభిప్రాయం తప్పు కావచ్చు. అవకాశం వొచ్చినప్పుడు, నేనీ అభిప్రాయాన్ని మార్చుకోడానికి సిద్ధంగా వున్నాను. అంతవరకూ మౌనం ఉత్తమం."

పదకొండో తారీఖున; హాస్టల్ గదిలో, ప్రయాణానికి సన్నాహము చేస్తున్నాడు నిధి. పోస్టు బంట్రోతు వొక ఉత్తరం యిచ్చాడు. అది జగన్నాథం వ్రాసినది:

"..............మనం చదువులో పడికొట్టుకుంటున్నాం. కేవలం ఉత్తరాలవల్ల ప్రయోజనం కనబడటం లేదు. నాకు పట్నం వొచ్చి మీతో గడపాలని వుంటుంది. బట్ వాట్ కెన్ ఐ డు—అంటే నేనేం చెయ్యగలను? ఈసారి పరీక్ష ఫేలవగలనని ఆశిస్తున్నాను. ఏనపక్షంలో మనవాడి తెలివి తేటల్ని పరీక్షించేటందుకు నవాబ్ ప్రభుత్వానికి ఏ కోశానా హక్కు లేదని, మదీయ బంధుకోటికి, ఎట్టకేలకు తెల్లమయ్యె. మిగ రానున్న చదువుని-అనగా-అవర్ ఫ్యూచర్ ఎడ్యుకేషన్-మదరాసు మహాపట్నంలోనే జరిపించుటకు నిశ్చయించిరిగాన, పతత్సుభ ముహూర్తమునకు—ఎక్సెట్రా లేక వగైరా అది నా సంకల్పం.

ఇంక కమింగ్ టు మై సిస్టర్; చాలా ఓకేగా వుంది. కారణం అత్తగారు మంచం దిగకపోవడమే, హ్వై అని అడగొచ్చు. అత్తగారికి నిజానికే పాయ్యేకాలమూ లేదనుకోండి, యూజ్ ది సేయిం గోస్, బిట్వీన్ అవర్ సెల్వ్స్ వంట చెయ్యడం, కోడలి మీద తోసెయ్యవచ్చునని, శ్రమ-పెాన్స్, మా అక్కయ్య యింట్లో స్లోగన్ 'అమృతం వొంట అమృతమే' అని. బట్ ఈ అరేంజ్మెంట్ మా అక్కయ్యకి చాలా వీలు. ఎందుకంటే వంటింట్లో ఏం జరుగుతోందో తనిఖీ చెయ్యడానికి, డొడ్లో భార్యా భర్తల మధ్య ఏం రాచకార్యం నడుస్తోందో సోదా చెయ్యడానికి, అన కాశం తక్కువ. హైలి బాగా నడుస్తోందండోయ్. ఇంతకీ చెప్పొచ్చే ముక్క, మా అక్కయ్య చాలా భాగం వంటింట్లో పడి కొట్టుకుంటోందని, టు యూజ్ ఎ పాప్యులర్ యిడియమ్,

బై ది బై (స్పెల్లింగ్ రైటే చేరసుకుంటారు) యింతకీ అసలు విషయం, లైక్ ఎ ఫ ఖున్ అర్టిస్టు చివరికి వుంచేశాను. (ఓ, యస్, యూ ఏదు తప్పకుండా ప్యాసవుతానంది, అని చెప్పేటందుకు విచారించవల్సి వస్తోంది) మొన్న—, అనగా ఇటీవల, కొండొకచో కొంత కాలం క్రిందట —రైల్వేస్టేషన్ ప్లాట్ ఫారంపైన, శ్రీమతి కోమలిని సందర్శించడం జరిగింది. ఆమెను, సెకెండ్ క్లాస్ కంపార్టుమెంట్‌లో కూర్చుని వుండగా చూడటం తటస్థించింది, ఆమె, ఉత్తర హిందూస్థానం, (టు బి మోర్ స్పెసిఫిక్- గ్రావిటీ లేదనుకోండి, మా కెమిస్ట్రీ మేష్టారన్నట్లు) ఆగ్రా ప్రొసీడ్, అవుతోందట,—ప్రొసీడ్ రెండు 'సీ' లా, వొకచేనా తేలక తెలుగులో వ్రాయడం జరిగింది.

ప్రక్కన మరో మీసాల వ్యక్తి వున్నాడు, అతడెవ్వరో తమరే వూహించుకోండి. 'హే', 'హలోమ్'—అని కేకేసింది నన్ను. నీరిగా రెక్కడున్నారని అడిగింది, ఇంతలో మీసాల రక్కసుడు అవతల కిటికీ దగ్గర నుంచి యువతలకి కళేబరాన్ని జేరేశాడు; వెంటనే ఆమె ఆ మాట తప్పించి 'అమృతంగా రెక్కడ?' అంది, నేను ఆ అలం యొక్క సౌందర్యాన్ని కించిత్ తిలకిస్తుండగానే, ఘూమశకటం కదిలింది-అది వెనక్కి నడవడం—కదలటం ఐతే. బావగారికి వివాహం అయిందన్నా నేను, నాకు తెల్సు అన్నది, 'హౌ' అని అడిగాను—

ఆ వేలకి అంగ్లంలో ప్రవేశం లేదని యిప్పు డిప్పుడు మనీయ బుద్ధికి స్ఫురిస్తూంది..."

ఆ వుత్తరాన్ని చాలాసార్లు నవ్వుకుంటూ చదువుకుని, జాగ్రత్తగా మడిచి మనీపర్సులో వుంచాడు. ప్రక్కగదిలో వుంటున్న మాత్యూ, చదువుతున్న పుస్తకాన్ని మూసి, చేతులో వుంచుకుని, నిదిని పేకాడుకుందాం రమ్మని అహ్వానించాడు. చేతులో పుస్తకాన్ని బల్లమీద వుంచి బాత్ రూమ్‌కి వెళ్ళొస్తాను, యీలోగా పేకాటకి సిద్ధం కమ్మన్నాడు. ఆ పుస్తకాన్ని తీసి నిధి చదవడం మొదలెట్టాడు. అది షేక్స్పియర్ రచించిన 'హామ్‌లెట్'—నాటకం. ఆనర్స్ విద్యార్థుల పాఠ్యగ్రంథం. తలనొప్పిగా వుంది. పేకాటకి వోపికలేదని మాత్యూని పంపివేసి, ఆ నాటకం చదవడం మొదలెట్టాడు. చదవడం సాయంత్రానికి ముగిసింది. సామాన్లు కూలివాడి నెత్తిమీద పెట్టి, ఆరాత్రి మెయిల్లో ప్రయాణం అయ్యాడు.

కాకినాడ చేరుకునేటప్పటికి పదకొం డయింది. లక్ష్మయ్యగారు మాత్రం స్టేషన్ దగ్గరకొచ్చి, నిధిని విడిదిగదిలో దింపాడు. కార్యానికి ఎవ్వరినీ రమ్మనమని అహ్వానించనందుకు కొంచం విచారించాడు. అతని కేదో భయంగా వుంది. భోజనం చేసి పరున్నాడు. జడు పెమేషాల్లోనే భారతమాత సంకెళ్ళని చప్పుడు చేస్తూ అతని ఏకాంతాన్ని భంగం చేసింది.

1935 గవర్న మెంట్ అఫ్ ఇండియా యాక్ట్ క్రొత్తగా అమలులో కొచ్చిన రోజులవి. ఆ యాక్టులోని మంచి చెడ్డలతో ప్రజలకి నిమిత్తం లేకపోయింది, భారతదేశపు స్వాతంత్ర్య పరిణామాలని బ్రిటిష్ పార్ల మెంట్ నిర్ణయించడం యెవ్వరికీ రుచించలేదు. వైట్ హాల్ నుంచి ఏ శుభలేఖ వచ్చినా, హిందూదేశప్రజ దానికి మసిపూసి దగ్గరగా వున్న సముద్రంలో గిరవాటెట్టడం జరగాల్సిందే, ఆధ్యాత్మిక చింతలో మునిగి వున్న ప్రజని, బ్రిటిష్ పార్ల మెంట్, చేష్టలతోనో, మాటలతోనో రెచ్చగొడుతూ వుంటుంది. ప్రజలకి జైళ్ళల్లో బంధించబడ్డందుకు విచారం లేదు. తుపాకీ పట్టుకుని బైట పచార్లు చేస్తున్న తెల్లాయన "నాలుగు రోజుల్లో నిన్ను విడుదల చేస్తాం—యీ విశంగా" అన్నప్పుడే, యీ బానిసలు చెలరేగేది. భారతీయులు

జానిసలే; కాని 1935 ఇండియా యాక్టుతో తాము బానిసలం అని గ్రహించుకున్నారు. అదే వారి బాధలకి. అసంతృప్తికి కారణం. "మిమ్మల్ని మీరే పాలించుకోండి. కాని పైన మావా డొక డుండి, మీరన్నది కాదంటూంటాడు—యివిటండి, దీని తలి సీళ్లు" [illegible] కూర్మయ్య జోటిగాళ్లు యీ యాక్టుకి విలువ కట్టారు. ఇది మరింత వెక్కిరింపుగా తోచింది. వధూవరులు వొకర్ని వొకరు కోరుకుని, పురోహితుణ్ని ఎన్నుకొని వివాహం చేసుకుంటారుట; దొరగారు దాన్ని రద్దుచేసే హక్కు వుంచుకున్నారట. ఆ దొరగారు అనవసరంగా ఆ హక్కుని, అధికారాన్ని చలాయించరని ప్రభుత్వం హామీ యిచ్చింది. అసలట్లాంటి అధికారమే వుండకూడదన్నారు.

ఆ అధికారం తొలిగించడానికి ఏం చెయ్యాలి? ఏమో, ఎవ్వరికీ తెలీదు. కాని ఏదో చెయ్యాలని మాత్రం అందరికీ కసిగా వుంది. తమ అధోగతికి కారణం బ్రిటిష్ ప్రభుత్వం. హోటళ్లో పులిస్తారాకులు పారేస్తే, మిగిలిన మెతుకుల కోసం నాలుగు కుక్కలు, నలుగురు చినుగుళ్లు ధరించిన యువకులు కలిసి కొట్లాడుకోటం, బ్రిటిష్ ప్రభుత్వం చిత్రించిన కళానుగుణమైన దృశ్యం—అజ్ఞానం, అంధకారం; ఆకలి; నిరుద్యోగం, జాడ్యం,—అన్నిటికీ కారణం అదే, మన ప్రాచీన సంప్రదాయాలేవీ? మన కళ ఏమయింది? మన శిల్పాలు? మన మేధావులు ఒకప్పుడు మహా వైభవం అనుభవించాం అని చరిత్ర చదువుకుని ఎంతకాలం తృప్తి పడటం? అసలు చరిత్ర లేకపోతేనే బాగుండును—వుండబట్టే యింతటి అధోగతి పట్టింది కదాన్న పరిజ్ఞానంతో కూడుకున్న విషాదం. ప్రాచీన సంస్కారాన్ని, నాగరికతని, మ్యూజియమ్‌లలో బంధించి వేశారు ప్రభుత్వంవారు. టిక్కెట్టు కూడా లేదు; వూరికే చూడొచ్చు. 'లేవండి, లేవండి' అన్నారు దేశ నాయకులు. 'ఎక్కడికి?' అన్నారు ప్రజ.

ఏమో ఎవళ్ళకీ తెలియదు. అందరూ లేచి కళ్లు నులుపుకున్నారు. ఎక్కడికని వెళ్లడం? పిల్లలు స్కూళ్లకి—మానెయ్యండి; జీతాలు కట్టేవాళ్లు, యిచ్చేవాళ్లులేక అవే మూసుకున్నాయి. కోర్టులు మానెయ్యండి. కాలేజీలు మానండి. కొట్లు మూసెయ్యండి. ఏం

చె య్యద్దో చెబుతున్నారు నాయకులు; ఏం చెయ్యాలో చెప్పరు. మళ్లా ఆవలించి పడుకున్నారు ప్రజ.

మళ్లా లేవండి అన్నారు ఎవరో. అందరూ లేచి మళ్లా ఎర్రబడిన కళ్లని తుడుచుకున్నారు. ఈసారి ఏం చెయ్యాలో చెప్పారు. పన్నులు కట్టకండి, అందరూ వికటంగా నవ్వారు. కట్టేందుకు మాదగ్గ రేముంది? జప్తుచేసుకు పొయ్యారుగా ఎప్పుడో! విదేశీ బట్టలు తగలెట్టండి; తగ లెట్టారు. ఊ; తర్వాత? బట్టలు లేవు; తిండి లేదు; చీకటి అంతా చీకటి. జైలులోని అంధకారానికి అలవాటు పడిన ఖైదీ బైటికి వచ్చిం తర్వాత, సూర్యరశ్మికి తట్టుకోలేడు. ఆ అంధకారమే బాగుంది. ఆ ఆకలే మంచిది; పోయి, భజన చేసుకుంటున్నారు. ఎన్ని రోజులు భజన చేసినా, ఏ రాముడు, ఏ కృష్ణుడూ అన్నం పెట్టడు. నీరసంతో నిద్రపోయారు

ఏదో కొత్తయార్టు వొచ్చింది లేవండి, లేవండన్నారు నాయ కులు. మళ్లా ప్రజలు లేచి, వేళ్లతో కళ్లని విప్పి పట్టుగుని చూశారు. జనం ఎక్కడికో కదిలిపోతున్నారు. ఎక్కడికీ ప్రయాణం? ఆశలులేనీ ఆకలి లేనీ ఆ లోకానికి పోదాం అన్నారు. ఎక్కడ ఆలోకం? ఒక సన్నటి, నల్లటి, పొడుగాటాయన, కఱ్ఱపుచ్చుగుని తొందరగా కదిలి పోతున్నాడు. అందరూ ఆయన వేనకాల బడ్డారు, పిల్లలు, స్త్రీలు, వృద్ధులు. అందరూ అటే పోతున్నారు. అయ్యో, అటు, సముద్రం లోకి నడిచిపోతున్నారు. ఉప్పు తీద్దాం. ఉప్పు తింటారా? ఆశలులేనీ, ఆకలి లేని, ఆలోకం తీరాచేసి సముద్రమూ-ఇక్కడే బాగుంది; యీ జైళ్లేబాగున్నాయి. హాయిగా అన్నం పెడతారు. అటువెడితే సముద్రం, యిటొస్తే, అంధకారం. అది ఆ పపచ్చ అంధకారం,యిది నల్లటి అంధకారం.

అంధకారం యొక్క రంగుని నిర్ణయించుకునేందుకు సృష్టికి వ్యవధి లేదు; కదిలిపోతోంది విశ్వం, అన్నీ యథావిధిగా సక్రమంగా జరిగిపోతున్నాయి. అన్నీ బొగ్గులు; సముద్రంలో ఆరిపోయి, తడిసిన బొగ్గులు. ఈ బొగ్గులు ఆరిపోవు;-లోలోపల నిప్పుకణాలు రగుల్తూనే వున్నాయి-ఒక్కొక్క నిప్పుకణం, సముద్రాన్ని సహితం దహించి పిండబెట్టేస్తుంది.

గవర్నమెంటు ఉద్యోగులు, పాలకుల వుప్పుతింటూ, వారి పతనానికి ప్రార్థనలు రహస్యంగా సాగిస్తున్నారు. ఉదయం లేవగానే పత్రికలు చదువుతారు—యూరప్‌లో మరో రాజ్యం జైలుదేశిన్ని పిల్లకోరలు పీకెయ్యకూడదూ? పాశ్చాత్య ఆకాశంలో యుద్ధ మేఘాలు విహారం చెయ్యడం లేదూ? లేదు, అదంతా ఫ్యాక్టరీ బొగ్గు తాలూకు మేఘాలే, పోనీ కనీసం, ఆ ఫ్యాక్టరీలు మందు గుండు సామగ్రిని తయారు చేసేవేమో, అనుకుని తృప్తి పడ్డారు,

మళ్లా, సన్నటి, నల్లటి, పొడుగాటి, కళ్లు వుచ్చుకున్న వ్యక్తి, పిలుస్తున్నాడు. పోనీ అయన వెనకాల వెడదాం లేవండన్నారు. లేచారు. మళ్లా అందరూ ఆయన వెంటబడ్డారు. ఈసారి, ఎక్కడికని అడగటం మానేశారు. ఎక్కడికో ఎవరి క్కావాలి? మొత్తంమీద కదిలిపోవడం- ఆయన పాదాలకింద యిసుక రేణువులై యీ ప్రజ, వొక్కసారి లేచి, గంతులేసి, నలుదిక్కులా వ్యాపించింది నిప్పు కణాలు ప్రజ్వరిల్లాయి, సముద్ర కెరటాలు ఎవరు పిండుకునేందుకూ ఉప్పుకూడా లేకుండా, నీరసించి వెనక్కి వెళ్ళిపోతున్నాయి. అది ఆకలితీరేస్తున్న మహాయజ్ఞం. అది దాహం చేస్తున్న తీర్థయాత్ర; అది ఆశ సలుపుతున్న స్వప్న గానం.

ఎక్కడికో, ఎందుకో,—ఎవరికీ తెలీదు; ఎవ్వరూ అడగరు. మరి వెనక్కి చూడ్డంలేదు. ఆ సన్నటి పొడుగాటాయన వెనకాలే వెళ్ళిపోవాలి. ఏ కొద్దిమందో, ముందుకు నడిచే జనాభాని, లెక్కపెడుతూ, వొక నోటు బుక్కులో ఎక్కించుకుంటూ, దిగడిపోయారు. అబ్బో, ఏం జనం? ఎంతమందినని లెక్కపెట్టటం! ఊరికే లెక్కపెడితే చాలదు, వాళ్ళని అపు చెయ్యండి అన్నారు ప్రభుత్వంవారు. ఐదు గురుకంటె ఎక్కవమంది వుంటే కొట్టండన్నారు, పట్టుకుని జైళ్లల్లో పెట్టండన్నారు. అవసరమైతే, కాల్చే చంపండన్నారు. అగ్నినే కాల్చమంటున్నా మన్న ఆశ్చర్యం వాళ్ళకీ కలగకపోలేదు.

నిప్పులో కట్టెపెడితే కట్టె కాలిపోతుంది; మంట మరింత పెద్దదవుతుంది. ప్రభుత్వంవారు, అడవులని కొట్టి, యీ మంటని పెద్దది చేసేందుకో అన్నట్లు, కట్టెలని తమ వుద్యోగుల కిచ్చి, వెళ్లి యీ ప్రయాణాన్ని అపు చెయ్యమని అజ్ఞాపించారు. కాకినాడ మునిసిపల్

లిమిట్స్‌లో ఎక్కడ సభ జరిగినా సరే, యీ కట్టుబాటు వర్షం, ఆమంటని చల్లార్చేటందుకు కురిపిస్తామని సాటించారు.

ఎవ్వరూ నిద్రపోవడానికి సమయం కాదది. ఆకలి దప్పులచే బాధపడుతున్న యీ భారతీయులకి, నిద్రాదేవి ఏనాడో విడాకు లిచ్చింది. ముగ్గురు వ్యక్తులు గదిలో ప్రవేశించి, నిధిని నిద్రనుంచి లేపారు, కుటుంబరావు కమ్యూనిస్టు; సుందరం సోషలిస్టు; ఆహోబల రావు అనార్కిస్టు. వీళ్ళు ఎవర్నీ నిద్రపోనీరు వీళ్ళకి నిద్రాహారాలు అక్కర్లేదు. ఇతరులకి వుండకూడదు. ఇదే వారి జీవిత పరమావధి. స్నేహితుల మాట కాదనలేకపోయ్యాడు దయానిధి. వాళ్ల ఆవే శాన్ని అతను అర్థం చేసుకున్నాడు కాబట్టి, అడ్డుకట్టు లేకపోయ్యాడు. ఈ యాక్టు డాక్టర్లకిచేసిన అన్యాయాన్ని గురించి అతన్ని బహిరంగ సభలో వుపన్యసించమన్నారు. నేను డాక్టర్ని కానన్నాడు దయా నిధి. నువ్వు; నేనూ అందరం బానిసలం అన్నారు. "మీరేం చేస్తు న్నారు?" అన్న ప్రశ్నకి వొక్కటే సమాధానం; 'బానిసత్వం'.

ఆ రాత్రి అతని కార్యం అన్న సంగతి ఆ ముగ్గురు వ్యక్తులకి తెలిసికూడా, అతన్ని బలవంతం చెయ్యసాగారు, ఊరికే వచ్చి వింటాను, కాని ప్రసంగించనన్నాడు. పోనీ అదేనా చెయ్యి—అని అతన్ని సభలోకి లాక్కుపొయ్యారు.

సాయంత్రం నాలుగైంది రోడ్డుప్రక్కన మునిసిపాలిటీవారి హద్దుని తెలియపరుస్తూ వొకబోర్డు వుంది. కాని జనం దాన్ని ధిక్క రించి, అన్నిపక్కలా కూర్చున్నారు, ఎక్కడ చూచినా మనుషులే. ఈ దేశంలో యింతమంది జనంవున్నారా! అనిపిస్తుంది; ఏవో కేక లేస్తున్నారు. ఒకాయన లేచి మాట్లాడుతున్నాడు. అదేమిటో ఎవ్వరూ వినిపించుకోకపోయినా, ప్రతివాక్యానికీ కరతాళధ్వనులు, పెద్ద గంద్రగోళం. స్వరాజ్యం—స్వేచ్ఛ, తమ వునికిని గుర్తించమని చేసే చప్పుడు. ఈ మధ్యలో వొకాయన నిలబడి ఏదో అన్నాడు. ఆయన్ని గోలచేసి కూర్చోబెట్టి, బైటికి యీడ్చుకుపొయ్యారు. మళ్ళీ వొకాయన లేచి, ఉపన్యాసం సాగించాడు. దయానిధి, ఆ వుద్రే కంలో కొట్టుకుపొయ్యాడు. "శరీరం పొంగింది. చర్మం విప్పుకుని వెంట్రుకలు నిలబడి, గుండెలు దడదడ కొట్టుకుంటూ, రక్తం వేడెక్కి

వేగంగా ప్రవహిస్తూ, అతన్ని నరాలకుప్పగా మార్చివేశాయి. అతనిక మనిషి కాడు పొకశక్తి; సముద్రాన్ని దహించివేసే మరో నిప్పుకణం. అప్రయత్నంగా కళ్ళమ్మట, ఆకలి కన్నీరుగా వేడిగా జారుతోంది: 'స్వేచ్ఛ' అతన్ని ఆవలించి. తనలో కలిపేసుగుంది—ఏదో శక్తి అతన్ని ముందుకు తోసుకుపోయింది—వెళ్ళి లేచి నిలబడి, మాట్లాడడం మొదలెట్టాడు. అది భాషా! అవి భావాలా? దానికి తర్కంతో నిమిత్తం వుందా? పగిలిన హృదయం, పగలని హృదయంతో మొరెట్టుగోడం.

సముద్రం, కెలతో వర్షం ద్వారానూ, ఆకాశం భూమితో తుఫానుద్వారానూ పడవడం లాంటిది బురదలో పురుగు చంద్రుడికి కనుసైగ చెయ్యడం లాంటిది. సృష్టి చెప్పుగుంటున్న స్వాగతం అది.

స్వాతంత్ర్యం జన్మహక్కన్నాడు నిధి మానవుడికి స్వాతంత్ర్యం ఆకలి దప్పులకంటె కూడా ఎక్కువ ముఖ్యం అన్నాడు. దాస్యానికి అలవాటుపడిన యీ జనానికి తిరుగుబాటు చెయ్యడం చేతకాదు. ఏ వొక్కడో తమ నిజ దుస్థితిని తెలుసుకొనేటంతటి తెలివితేటలు చూపడం మొదలు పెడితే, బ్రిటిష్ ప్రభువులు అతన్ని కొనేస్తార్లు. పెద్ద పెద్ద పదవు లిస్తారు బిరుదు లిస్తారు. దేశకో సభ్యుడుగా దూర దేశాలు పంపించి వేస్తారు వీటికి అతీతుడైనప్పుడు ఆ వ్యక్తి దేశ నాయకుడవుతున్నాడు. అప్పుడు అతడిని ప్రభుత్వం బంధిస్తుంది. పొట్టకూటికై అమ్ముడు పోయిన యీ భారతీయ వుద్యోగులపై నకే, యీ బానిసత్వాన్ని నిలబెట్టే భారం పడేశారు భారతమాతని రూపాయి కమ్మేశాం. మనకి పావలా మిగిల్చి ముప్పావలా వాళ్లే తీసుగుపోతున్నారు—అన్నాడు నిధి వుపన్యాసంలో.

ఒక్కసారి సభ నిశ్శబ్దం అయింది. పై అధికారి కాళ్లక్రింద యినుకరేణువులా బ్రతుకుతున్న వుద్యోగి, వర్షాని కెదరు చూస్తున్న కర్షకుడు, పరీక్షలో ప్యాస్ కాలేని విద్యార్థి ఐదునెల్లకి వొకసారైనా జీతం పుచ్చుగోని వుపాధ్యాయుడు, నిరుద్యోగి, పెండ్లాం [illegible] బాధల నుంచీ పారిపోయి వొచ్చిన భర్త—అందరికి యీ బహిరంగ సభలు, రంగ స్థలాలు లాంటివి. ఒక్కసారి తమ ప్రత్యేకమైన యిబ్బం

దులు, అశాంతి, ఆకలి—అన్నీ మరిచిపోయి, యిక్కడ మానవులుగా మారుతారు—స్వేచ్ఛగా గాలిపీలుస్తారు.

డాక్టర్ల విషయం చూడండి—ఇండియన్ మెడికల్ సర్వీసులో ఏభేదాలు గమనించండి. తలకాయలు దొరలే. కాళ్లు, చేతులు వాళ్లే; మనం? మనం వాళ్ల పాదాలకింద యిసుక రేణువులం. ఒక రేణువ పెద్దసైజు; మరోటి చిన్నది; అంతే తేడా. ఇండియన్ మెడికల్ సర్వీస్—పెద్ద బిరుదు ఒ బి ఇ—మరో బిరుదు, ఒ, బి, ఇ. అంటే ఒ బి డి యన్సు టు బ్రిటిష్ ఎంపైర్ అని......

జనంలో కలకలం బయలుదేరింది. బైట ఎవరో వొచ్చి ఏదో అన్నాడు, ఒక్కసారిగా జనం లేచి అటునుంచి కదిలారు. ఆ గంద్రగోళంలో మునిసిపల్ లిమిట్స్ దాటి లోపలకి పడ్డారు. దూరంగా యీలలు, గుఱ్ఱాల డెక్కల చప్పుడు-దుమ్ము లేవడం. జనం అంతా దగ్గరగా జరగారు—వొక్క వ్యక్తిగా. వ్యక్తిత్వాలు పోగొట్టుకుని, ఒక పెద్ద మనిషిగా మారిపోయారు. జనం చెల్లాదరయి పోడానికి నాలుగు నిముషాల వ్యవధిచ్చారు—మళ్లా యీలలు. జనం అంతా ఒక్కసారిగా అటూ యిటూ వూగిసలాడుతున్నారు.

దయానిధి తన వుపన్యాసం మానలేదు. ఒక్క రావు బహదూర్ బిరుదు కోసం, మానవత్వాన్ని, స్వాతంత్ర్యాన్ని, సంసారాన్ని, ఆత్మల్ని అమ్ముకున్న యీ వ్యక్తుల చెప్పు చేతుల్లో బ్రతకడంకంటె మరణమే మేలన్నాడు.

మళ్లా యీలలు. జనం చిందరవందరగా పరుగెట్టడం కేకలు, కర్రల వర్షం—మంటని చల్లార్చేందుకు ప్రభువులు కనిపెట్టిన, యంత్రాల వర్షం. మూడు నిముషాలు స్వాతంత్ర్యానికీ, బానిసత్వానికి మూగపోరాటం జరిగింది. కొందరు పడిపోయ్యారు. కొందరు గాయపడ్డారు. గాయపడినవాడిలా, సూర్యుడు పశ్చిమ ఆకాశంలోకి కుంటు కుంటూ దిగుతున్నాడు. పడిపోయిన వ్యక్తుల్ని కార్లలో లొక్కుపొయ్యారు-యిసుక బస్తాల మాదిరి.

హాస్పిటల్ లో మంచం మీద పడుకున్న దయానిధి, అసలు గవర్నమెంట్ యిట్లా గాయపడిన వాళ్లకోసమే యీ దేశంలో హాస్పిటల్స్ నిర్మించారని, వుపన్యాసంలో చెప్పలేక పొయ్యానే అని

విచారిస్తున్నాడు. ఎడంచెయ్యి మోచేతికి, ఎడమ కన్నుపైన నుదురు దగ్గరా, రెండు గాయాలు తగిలాయి. అద్దంలో చూసుకుని నవ్వు కున్నాడు. ఇదే కాబోలు, దేశంకోసం త్యాగం చెయ్యడమంటే!

బైట బండ నిలిచిన చప్పుడు, బండిలోంచి ఎవరో దిగిన చప్పుడైంది.

అమృతం లోపలికొచ్చి, స్టూల్ దగ్గరగా లాక్కుని కూర్చుంది, దూరంగా. ఆమె భర్త పినతల్లి కొడుకు, శంకరం, గుమ్మంకి వున్నాడు.

"మా జగ్గు చెప్పాడు.—సరే, పెళ్ళికి కూడా రాలేదు, పోనీ చూద్దామని శంకరాన్ని తీసుకొచ్చాను మావారూ రావాల్సిందే కాని, తాసీల్దారు అక్కడే క్యాంపేశాడు. నువ్వెళ్ళిరా అని నన్ను పంపారు. ఈ కష్టమేమిటి. ఈ వాలకం ఏమిటి బావా!— అంతా విన్నాను....ఔరా, కాలం ఎల్లాగైపోయింది...." అంటూ అమృతం ముక్కుమీద వేలేసుకుంది. పెళ్ళైన తరువాత అమృతం బాగా ఎదిగినట్లు కనబడుతుంది. వంగపండు రంగుచీరా, జబ్బలనంటి పెట్టుకొన్న ఎర్ర పువ్వుల ఖద్దరు రెవికా, వింతగా రేగిపోయిన జడా కొంత పరిపూర్ణత్వ ఆపాదించాయి ముఖం కొంచెం వాడింది; కాని అది అందంగా వాడి పోవడం.

అమృతాన్ని చూడగానే దయానిధి కొండంతయ్యాడు. గాయాలన్నీ మానినట్లయింది; రక్తం వేగంగా ప్రవహిస్తోంది కాని, అందులో వేడి లేనట్లనిపించింది. శీతలంగా వుంది. ఎందుకో భారత మాతని చూచినట్లనిపించి, అతనికి నవ్వొచ్చింద

"బావా నీకో తాయిలం తీసుకొచ్చాను పమిటలో చెప్పుకో,'' అంది, వయ్యారంగా నవ్వుతూ. మబ్బురంగు ముఖంలో, పళ్ళ వరస పోంటి నక్షత్రంలా మెరిసింది. విశాలమైన చెక్కిళ్ళు, సృష్టినంతా పొక్క చూపులో ఆవరించుకునే కళ్లు— ప్రీతిల్లో దేనికేసి చూడటం; ఏ మాటని వినడం? ప్రతి మాటనీ, హృదయంలో తడిపి ముద్దులా చేసి వదేస్తుంది. ఆ మృదుత్వం భాషలోనుందా, మనిషి ఆకర్షణలో వుందా,—నిర్ధారించలేక పోయ్యాడు. అతనెప్పుడూ అమృతం యీవిధంగా ఆకర్షించలేదు. బహుశః దీనికి కారణం, అతని ప్రస్తుతస్థితేమో! యుద్ధంలో గాయపడ్డ సైనికులకి, ఫ్లారెన్స్

నైటింగేల్, దేవకన్యగా అగుపడటంలో ఆశ్చర్యం ఏముంది? స్థలం, కాలం, వీటి ఆసరా చూసుకుని బ్రతుకుతుంది ఆకర్షణ అదేం ఖర్మమో!

"జగన్నాథం గారేదేం?"

"వాడికి పేపర్లు పాసయ్యాయని, మళ్ళా పరీక్ష పెట్టారుట. సికింద్రాబాదు వెళ్ళాడు. ఏం గాబరలమో చెప్పుకోలేక పొయ్యావు. ఇంతేనా బావా" అంది అమృతం.

"పూతరేకులా?"

"కాదు"

"అరిశెలా?"

"ఆబ్బే."

"నువ్వే చెప్పు—చెప్పడం దేనికి, యిల్లా యివ్వరాదూ?"

"ఇందిరని తీసుకొచ్చా" అంది.

నిధి ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసి, లేచి కూర్చోబోయి, 'అమ్మో' అనుకుని మళ్ళా పక్కమీద వాలాడు.

"రైలు దిగగానే, బాబు గారింటికే తిన్నగా వెళ్లాను. మేం కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న పది నిమిషాలకే వాళ్ళ బోటీసు వొచ్చి లాఠీఛార్జీ జరిగిందనీ, నీకు దెబ్బలు తగిలి ఆస్పత్రిలో వున్నావనీ చెప్పాడు. పోనీ, అల్లుడున్నాడనేనా చూసుకోవద్దు, బాబు గారు మాత్రం" అని నిట్టూర్చింది.

"అట్లా చూసుకుంటూ కూర్చుంటే ఉద్యోగం చేసినట్లే. క్యాంపుచేసిన తాసిల్దారుని వొదిలి పెట్టి, మీ ఆయన పీతో షికార్లో స్తే యీపాటికి దేశానికి స్వరాజ్యం రానే వొచ్చును. ఉద్యోగం అంటే అమ్ముడుపోవటం విధి నెరవేర్చడంతో తమ్ముడు, అల్లుడు, బావా అంటూ చూడ్డానికి వీల్లేదు. అల్లా చూస్తూ కూర్చున్న వాళ్ళని, మొన్నాడే పీకేస్తారు...

"నువ్వు చెప్పింది నిజమేననుకుంటా బావా — నేనూ చూస్తాగా, జమాబందీ రోజుల్లో, మావారికి నిద్రాహారాలే వుండవు..."

ఉత్తప్పుడే వుండదు నిద్ర. — ఇంక జమాబందీ వొస్తే చెప్పాలా...'? అన్నాడు నిధి.

"పో బావా—అన్నీ కొంటె కబుర్లు. దెబ్బలు తినికూడా మానవు - ఏం? ఏం చెప్పావు? సరే. పోలీసొచ్చి, ఆస్పత్రిలో వున్నావన్నాడు. బాబుగారేరని అడిగాను,— తెలీదన్నాడు అదెవ్వో. దెబ్బలు తగిలాయా అని, మాధవయ్యగారి భార్యేనా, కొండేం అమ్మా వద్దొద్దు! నాకు మాత్రం కంగారెత్తిందిస్మా చెప్పొద్దు. ఇందిరని కూడా రమ్మన్నాను, వాళ్లమ్మ మొహం వాలుగసార్లు చూసి, అభరికి తనూ వస్తానంది, వెంటనే బైలుదేరి వొచ్చేశాం..."

"ఎక్కడుంది?"

"పిలవనా? ఇందిరా...." అంటూ, గుమ్మంవేపు చూస్తూ, రెండుసార్లు కేకేసింది.

బైటనుంచి జవాబు లేదు; ఇందిర రాలేదు.

"శంకరం—చూడు, ఇందిరని లోపలికి రమ్మను—తీసుకురా..." అంది శంకరంతో. శంకరం, రెండు నిముషాలు, అన్నివేపులా పరకాయించి, ఎక్కడా లేదంటూ చక్కావొచ్చాడు.

"ఇదేం చిత్రంబావా—నాతో కూడా రమ్మంటే, నేను తరవాతొస్తానులెండి, మీరు వెళ్ళి మాట్లాడుతూండండని, అక్కడే నిలబడిపోయింది తను. ఇంతలో ఏమైపోయిందబ్బా అంతా గారడీలా గుంది..."

"ఓవేళ ఎరుగున్నవాళ్లెవరన్నా వుంటే, అవతల వార్డులో కెళ్లిందేమో..."

"ఉండు, నేనే చూసొస్తా బావా..." అంటూ అమృతం లేచి వెళ్లింది.

దయానిధికి అనుభవం అంతా కలలో మాదిరిగా వుంది. మామగారికి తను సభలో ప్రసంగిస్తున్నట్లు తెలుసా? తెలిసే ఇట్లా చేశాడా? ఆయన కేది ముఖ్యం? కూతురు సౌఖ్యమా? రావుబహద్దూరా? ఈ ప్రశ్నలకి సమాధానంపై నిధి తన భవిష్యత్తు ఆధారపడిందని తెలుసుకున్నాడు. కంటిమీదికి మెల్లగా రక్తపుచుక్క జారింది మరి గత్యంతరంలేక కన్నీటి బిందువుతో కలిసిపోయింది.

ఐదు నిమిషాలలో అమృతం తిరిగివచ్చింది. మొహంలో ఎంతో ఆత్రుత కనిపిస్తున్నా, కళ్ళు నవ్వుతో మెరుస్తోన్నాయి.

"ఎక్కడా కనపళ్లేదు బావా—ఇంతలో అక్కడ ఆస్పత్రి కుర్రాడొకడు, కనిపించి, ఎవరో, వారి తాలూకు వాళ్లు వొచ్చి, ఆమెను కార్లో ఎక్కించుకుని తీసుకుపొయ్యారండి అన్నాడు—చాలా చిత్రంగా వుంది. ఎవరంటావ్?" అంది.

"తెలుస్తునేవుందిగా—పోలీసుల్ని, వాళ్ళ నాన్న కూతుర్ని యింటికి పిల్చుకొని రండి అని పంపివుంటాడు. ఇల్లాంటి అల్లుడితో సంపర్కం మరి ఆయన ఉద్యోగానికి నష్టంగా—"

"ఎట్లా?"

"నీకు తెలీదు కాబోలు, గవర్నమెంటు వుద్యోగి, భార్యా, పిల్లలు, దగ్గర బంధువులు— ఎవరేనా సరే రాజకీయాలలో పాల్గొన్నారంటే వారే సంజాయిషీ చెప్పాల్సివుంటుంది. ఈ వుద్యోగులందర్యా, పొట్టకూటికోసం, వారు చేసే పనులన్నీ మహాపాపాలని తెలిసే. రహస్యంగా, దేవుణ్ణి ప్రార్థించి, పూజలూ పునస్కారాలూ చేసుకుని పాపపరిహారం పొందుతారు"

"అల్లాంటి మనుషులుంటారని నే అనుకోను, బావా" అంది అమృతం.

"నేనూ ఎప్పుడూ అనుకోలేదు, ఇప్పుడు అనుభవం ఐందిగా–" అన్నాడు.

ఇద్దరూ మౌనంలో పడ్డారు చీకటి పడింది. వింతవింత రసాయనాల వాసనలు ఆవరిస్తున్నాయి శంకరం పచార్లు చెయ్యడం చాలించి వరుపుచుట్ట స్తంభానికి ఆనించి దానిమీద జార్లపడ్డాడు. కారియర్‌తో అన్నం, ఫ్లాస్కులో పాలు తీసుకురమ్మని, అమృతం శంకరాన్ని పంపింది. ఏదో మాట్లాడాలనుకుని, అమృతం వాక్యాలని కంఠంలో సిద్ధం చేసుకుంది కాని, బైటికి అనలేకపోయింది. దయానిధి కళ్ళు మూసుకుని ఆలోచనలో పడ్డాడు. కుటుంబరావు, సుందరం, అక్కడికొచ్చి మళ్లా కబుర్లు మొదలెట్టారు.

"మాధవయ్యగారింటికి వెళ్లి గడ్డెట్టిరానా?" అన్నాడు కుటుంబరావు.

"ఎందుకనడిగనకనైతే, నేవెళ్లి నిప్పులు పెట్టొస్తా" అన్నాడు సుందరం

"నా విషయమై మీరేమీ ఆదుర్దాపడి కోతిపన్లు చెయ్యకండి. ఒక విధంగా నాకిట్లా జరిగినందుకు, కొంత సంతోషంగానూ, కొంత గర్వంగా నూ వుంది. బాధపడటంలో స్వార్థత్యాగం వుంది. అందుకే మనిషి బాధని భరించగల్గుతున్నా డనుకుంటూ—"

"బాధలో వైరాగ్యం వుంటే, అందులో కొంత భాగం మీ మామగారికి సమర్పించడం నీవిధి కాబట్టి, ఆయనకూడా బాధపడే మార్గం ఆలోచించు" అన్నాడు కుటుంబరావు కొంచెం హేళనగా.

"చూశావో లేదో తమాషా—కొన్ని అరెస్టులు జరిగాయి. అరెస్టు కావాల్సినవాళ్ల జాబితాలో నిధి పేరులేదు. ఇది మామగారు అల్లుడిపై దయ చూపడం కాదంటావా?" అన్నాడు సుందరం.

"మనం యిక్కడ ముసుగులో గుద్దులాటెందుకు? వెళ్లి నాలుగు విషయాలు ముఖాముఖిన అడిగేస్తే మంచిదని తోస్తోంది." అన్నాడు కుటుంబరావు.

ఇందిర తన్ని మూర్ఛానికి రావడం, చూడనీకుండా మాధవయ్యగారి తాలూకు మనుష్యులొచ్చి ఆమెని తీసుకెళ్ళిపోవడం—ఇవన్నీ నిధి స్నేహితు లిద్దరికీ చెప్పాడు. సుందరం వొళ్లు మండిపోయింది. "పోనీ ఆ పిల్లకేనా జ్ఞానం వుండొద్దా! వూళ్లో నలుగురూ గడ్డెట్టరూ" అంటూ, ఏదో అనడం సాగించాడు

"నాకు ఎవర్నో అడిగి తెల్సుకోవాల్సిన సంగతులు కనిపించడం లేదు. ఎల్లాంటి సందేహాలు లేవు—అంతా మబ్బులేని ఆకాశంలాగా, తెల్లమైపోయింది. ఏదో బరువు తగ్గినట్లుగా వుంది. ఈ నిర్మలమైన ప్రశాంత హృదయం మహారణ్యంలో, చెట్లకింద సరస్సులా వుంది. అందులో ఎందుకు రాళ్లు విసురుతారు?" అన్నాడు నిధి కళ్లు కొంచెం మూసుగొని,

"అబ్బాయీ, సరస్సులో కప్పలు, చేపలు కదుల్తుంటాయి—ఎల్లాగా నీ మనస్సు అలలతో కొట్టుకోడం మానదు." అన్నాడు, సుందరం ప్రపమానాన్ని అందుకుని పూర్తి చేస్తూ.

మాధవయ్యగార్ని కలుసుగుని మళ్ళా వొస్తామంటూ వాళ్ళిద్దరూ వెళ్ళిపొయ్యారు.

డాక్టరు, నర్సు వొచ్చి పరీక్షచేసి, కావల్సినవి చూసి వెళ్ళిపొయ్యారు

అమృతం స్క్రీన్ వెనకాల కెళ్ళి, మరోచీర కట్టుగుని, తల దువ్వుకుని. జడని చుట్ట చుట్టుకుని. వొచ్చి, బల్లమీద కూర్చుంది.

"కానీ నేవెళ్ళి. ఇందిరని చూసొస్తా బావా" అంది, నిశ్చయం చేసుకొన్నదానికిమల్లే

"ఇందిరని చూశావుగా" అన్నాడు.

"ఆ చూడ్డం వేరు. నీకెట్లా వుందోనని ఆదుర్దాపడుతుంటుంది. అత్తగారితో మాట్లాడి..."

"ఏం మాట్లున్నాయి."

"ఏమిటిబావా అల్లా గంటావు?-శోభనానికి మరోముహూర్తం పెడతారో,— ఏమిటో కథ—నాలుగూ మాట్లాడొచ్చుగా" అంది,

"మా మార్గాలు విడిపొయ్యాయి అమృతం! మళ్లా కలుస్తాయనుకోను" అన్నాడు, నిధి నిమ్మళంగా లేచి మంచంమీద కూర్చుని.

"అశుభం మాట్లేమిటి బావా—నువ్వనేది నా కర్థం కావడంలా..."

"తల్లిదండ్రుల చెప్పుచేతల్లో పెరిగి, వ్యక్తిత్వంలేని అమాయకురాలు ఇందిర. వాళ్ళ క్షేమంకోసం తన సౌఖ్యాన్ని త్యాగం చేసుకుంటుంది.—అంతేకాదు, మా విడిపోటానికి యింకా లోతులున్నాయి అమృతం! వాటి పరిమాణం అందరికీ అర్థమౌతుందనుకోను."

"అంటే?"

"ఆదర్శాలలో ప్రధాన శత్రుత్వం వుంది. వారికి డబ్బు, ఉద్యోగం, హోదాతో వచ్చే సంఘంలో గౌరవం, బిరుదులు,— ప్రపంచంలో పైకిరావడం;—ఇల్లి తెలుగు ... పెద్ద ... రిటైర్ కావడం, బ్యాంక్‌లో ఎకౌంటు—యివి కావాలి వారికి—"

“యివి ఎవరికి అక్కరలేదు? అందరూ వీట్నేగా ఆశించేది”
అంది అమృతం.

“కొంతవరకూ, అందరూ వీట్ని ఆశిస్తారు, నేను కాదనను. ఆశించవల్సిందే కూడా. కాని, యివి పొందడంకోసం, ఆత్మవిశ్వాసాన్ని, న్యాయవిచక్షణాన్ని, సత్యాన్ని కొందరు వొదులుకోలేరు. మన ప్రభుత్వం, అన్యాయంగా ప్రజల్ని పీడించి, బానిసలుగాచేసిన చరిత్ర తెలిసిన యువకుడెవడూ, యీ దురంతరపు చర్యల్లో పాల్గొనడు. సత్యాగ్రహం ద్వారా ప్రజాసేవచేసి, అనామకుడుగా, పేదవాడుగా జీవితం సాగిస్తాడు. అవసరమైతే మరణిస్తాడు. అంతేకాని అన్యాయానికి దాసోహం చెయ్యలేడు. మావి రెండు మార్గాలు. మాధవయ్యగారిది దక్షిణమార్గం; నాది వుత్తరమార్గం. మేం ఎప్పుడూ కలుసుకోం...”

“నువ్వు చిత్రంగా మాట్లాడతావు బావా— మామా రెప్పుడూ యిట్లాంటివి చెప్పరేం? ఇదంతా వింటుంటే ఏదో భయంగా వుంది....’

“అందులో ఆశ్చర్యం లేదు. వేలకివేలు ఆస్తులు తగలేసి, భూము లమ్ముకుని, చదువుకొని, డిగ్రీపొంది, తాలూకా గుమాస్తాగా చేరడం తప్పదు నేటి యువకులకి; తల్లిదండ్రులు అదే ప్రతిఫలంగా కోరుతున్నారు. సంఘం ఆమోదిస్తోంది. భార్య ఆఫీసనే జైలుకి పంపించే కాపలామనిషి. మళ్ళా రాత్రికి యిల్లు అనే మరో జైలులో మంచంకోళ్ళకి కట్టిపడేసి, తను పారా వుంటుంది. ఆ జీతం రాళ్ళకోసం, భార్య రవికలు, రిబ్బన్లకోసం. యీ దౌర్భాగ్యుడు నలభైఏళ్లు, కూలిపనిచేసి, నీచంగా బ్రతికి, తన కొడుక్కి, సామ్యుయెల్ హోర్ దగ్గరనుంచి రికమెండేషన్ తెప్పించి, కోర్టు అమీనాగా చేరుస్తాడు. తరవాత మరణిస్తాడు, సౌందర్యం, సత్యం, స్వేచ్ఛ, ప్రేమ, ఊహాగానం, ఆధ్యాత్మిక ఆనందం.— మానవుడు కోరదగిన ఏవొక్కదాని వునికీ స్వప్నంలో కూడా గమనించకుండా, మట్టిలో బ్రతుకుతాడు....”

“ఇందిర అల్లాంటి మనిషేనుకోను” అంది అమృతం.

“నేను యింతవరకూ మొగాడి జీవితం వర్ణించాను. ఇంక

మన సంఘంలో స్త్రీమాట చెప్పాలా? నువ్వు అనుభవిస్తూనే వున్నావుగా...."

"నాకేం బావా?' అంది అమృతం ఆశ్చర్యంతో.

"మన నిజస్వరూపం మనం చూసుగోలేం. ఇతరులు చెబితే సహించలేం. కనలని మనం మోసగించుకుంటూ, ఆత్మవంచనకి లోబడి, రోజులు గడిపే నటులం మనం అందరం. నీ అత్తగారి అంపపుకోవటూ. భర్తమౌక్యం, వొకరొన్నొకరు మోసగించుకోటం. కమ్యూనిస్టుతో స్నేహం, సహనం—ఇంకా చెప్పాలా?"

"ఇట్లాంటి వన్నీ కుటుంబాలలోనూ వుంటాయి. ఇందులో విశేషం ఏముంది బావా? సంసారం గుట్టుగా చేసుకోడం తప్పా?"

"తప్పుకాదు; కాని, నీతికాదు. అందరూ ఎట్లాచేస్తే అట్లా చెయ్యడం నీతికాదు. ఇతరుల మెప్పుపొందడంకోసం కాకుండా, నీకు నిజమని, మంచిదని, మనస్ఫూర్తిగా తోచిన విషయాలని ఆచరణలో పెట్టడం నీతి. నీ ప్రవర్తనకి బాధ్యురాలవు నువ్వే—అంతేకాని, నీ భర్త, అత్తగారు, కుటుంబం, సంఘం, బాధ్యులు కాకూడదు. నీ చేష్టలకు నువ్వెంతవరకు బాధ్యురాలివో ఒక్కసారి ప్రశ్నించుకో" అన్నాడు నిధి నవ్వుతూ.

అమృతం చాలాసేపు ఆలోచించి అన్నది: "ఐనా, బావా, యివన్నీ వూహించుకుంటేనే బాధపడటం జరుగుతుంది. అందరూ యిట్లాంటివి అనుకుంటూ కూర్చుంటే వొక్కరోజు బ్రతకగలరా?"

ఊహించుకోకుండా, ఏమీ కాని క్షణం జీవించడం జగన్నాథం పద్ధతి. అక్కయ్యకి కూడా ఆ పద్ధతే నచ్చడం నిధికి ఆశ్చర్యం కలిగించింది. మళ్ళా కళ్లు మూసుకున్నాడు. జీవించడమూ, జీవితాన్ని గురించి ఆలోచించడమూ—ఏది మంచి పద్ధతి? అదీ సమస్య. అసలు 'యిది మంచిదీ' అని నిర్ణయించేటందుకు తగిన ఆధారాలేవి? ఒక మనిషి సుఖపడటమా? కష్టాలు పడ్డా చివరికి ఏదో ఘనకార్యం చెయ్యగలడమా?

"నువ్వు దిగులుగావుంటే ఎట్లాగోవుంటుంది, బావా" అన్నది అమృతం, కొంత నవ్వు తెచ్చిపెట్టుకుంటూ.

"అప్పుడప్పుడు నీకిట్లాగే వుండదూ?"

''ఉంటుందనుకో— కాని ఒంటిగావున్నప్పుడే—''

"గుంపులో మధ్యనున్నవాడు, ఒంటిగా వుండడమా నీ వుద్దేశం? అసలల్లా పదిమందిలోనూ వున్నవాళ్ళకే, తాము ఎంత ఏకాంతంగా వుంటున్నారో, తమకీ ఇతరులకీ మధ్య ఎన్ని సము ద్రాలు పొర్లుతున్నాయో. భయంకరంగా కనుపించి, మరీ బాధపడ తారు. తెలుసా—అమృతం?'' అన్నాడు నిధి.

ఇతరుల సాహసం గిట్టక, ఎప్పుడూ ఒంటిగా వుండాలనే వాళ్ళల్లో ఏదో లోపం వుంటుం దనుకుంటా.'' అమృతం ఆమాట అనేసినందుకు నాలిక కొరుక్కుంది; కాని, మాటలని వెనక్కి తాకోక్క లేదు,

''ఇతరులతో కలిసి వుండాలంటే. మన వ్యక్తిత్వాలని, చాలా వరకూ వొదులుకుని, మనకి అసహజమైన కొత్తలక్షణాలని ఎరువు తెచ్చుకుని నటించాలి—నువ్వ గ్రహించావా? భర్తని భరించాలంటే, భార్య ఎంత త్యాగం చెయ్యాలి! అల్లాగే భర్తనూ. నిజస్వరూపాలని దాచుగుని ఎంతో అభినయం చేస్తేనే. సంసారం నిలబడి, సంఘ జీవనం సాధ్యమవుతోంది....''

"అట్లా వుండడం మంచిదేగా....అల్లావుండగా, దానికి అలవాటు పడిపోతాం, అందులో చెడులేదు, కష్టమూలేదు—మరి నీకెందుకు అల్లావుండడం గిట్టదు?'' అని అడిగింది.

అమృతం అమాయకంగా కనబడ్డా, అదంతా స్థిరపడిన మనస్తత్వాన్నించి జనించిందనీ, ఆమనస్తత్వం తర్కబద్ధమైన అల వాట్లతో అమర్చబడ్డ వ్యక్తిత్వంమీద ఆధారపడిందనీ, నిధి గ్రహించు కున్నాడు.

వ్యర్థప్రసంగం చేస్తున్నట్లు గ్రహించుకున్న వాళ్ళమాదిరి, యిద్దరూ వొకర్ని చూసి వొకరు నవ్వుకుంటూ, మళ్ళా నిశ్శబ్దంలో పడ్డారు. స్వల్ప విషయాలలో అభిప్రాయభేదాలున్నా, ప్రధానాం శంలో ఏకీభావంగల యిద్దరి వ్యక్తుల సంభాషణ మాదిరి, వారి ప్రసంగం, బైలుదేరిన చోటకి చేరుకుని నిల్చిపోయింది.

ఇంతలో శంకరం టిఫిన్ కారియర్ తో వచ్చావొచ్చాడు. అమృతం, భోజనం ఐంతర్వాత, చెయ్యికడుక్కుని, మాధవయ్య

గారింటికి వెళ్ళడానికి సిద్ధపడింది. నిధి వొద్దన్నాడు. మళ్ళా ఘర్షణ ప్రారంభమైంది. అప్పుడే ఒకాయన గదిలో కొచ్చి, నిధికి వొక ఉత్తరం యిచ్చి, దూరంగా వెళ్లి నిలబడ్డాడు. నిధి ఆ వుత్తరం చదువుకుని, 'ఇక మీరు వెళ్ళవచ్చు''నన్నాడు. ఆ వొచ్చినాయన వెళ్లిపొయ్యాడు.

అమృతం ఆ వుత్తరం తీసుకుని, చూసింది. తన కేమీ అర్థం కాలేదు; అది ఇంగ్లీషులో వుంది. ఏమనుందో నిధిని చెప్పమంది. అతను లేచి బ్రెడ్ తినడం మొదలెట్టాడు,

"రాకరాక వొచ్చినందుకు, నీకు మంచి మర్యాద జరిగింది. అవునా?" అన్నాడు.

''మర్యాద పరాయివాళ్ళకుగాని నాకెందుకు బావా?" అంది అమృతం.

"మర్యాద జరగనప్పుడు నొచ్చుకునేది, కావల్సినవాళ్ళే."

"అది ఒక మోస్తరుగా కావల్సినవాళ్ళు."

"నీకు నా మీద అంత అభిమానం వున్నందుకు,—నేను ప్రతిఫలం ఏమీ యివ్వలేక పోతున్నా నమృతం...."

"నే కోరే ప్రతిఫలం నువ్వు సంతోషంగా వుండడమే'' అన్నది.

"అందరూ వొక వ్యక్తి సంతోషం కోసం ఎందుకు పాటుబడాలో నాకు తెలీడం లేదు, ఎవరి సంతోషం వారు చూసుకుంటే చాలదూ?"

"తమకి సంతోషం లేనివాళ్లు, యితరులని సంతోషపెట్టైనా తృప్తిపడగూడదూ?''

అమృతం మాటలని తూకం వేసి విలువ కట్టడం సాగించాడు నిధి. అమృతానికి తన జీవితంలో సంతోషం లేదు కాబోలు. ఎందుకు లేదో? ఆమె కనబరిచే తృప్తి అంతా నటనే? అమృతం దేన్నో అన్వేషిస్తున్నట్లు కనబడుతుంది. దేన్నో అడిగితే అతనికి ధైర్యం చాల్లేదు.

"ఆ వుత్తరం ఏమిటో చెప్పవు బావా?"

"మాధవయ్యగారు వ్రాసింది. చాలా అరెస్టులు జరిగాయట. నేను అరెస్టు కాకుండా, ఆయన ఏర్పాటు చేశాడుట. తన్ను తక్షణం

ఎక్కడికేనా వెళ్ళమన్నాడు. మిగతా విషయాలు తరవాత చూసుకుందాం." అన్నాడు.

ఈ ఉత్తరం ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్‌కి పంపిస్తాను" అన్నాడు నిధి నిదానంగా, కాఫీ గ్లాస్ నేలమీద పెడుతూ.

"అట్లా చేస్తే ఆయన వుద్యోగానికి నష్టం కాదు, బావా?"

"అట్లా అవాలనే."

"ఒద్దుస్మా."

"అవును అమృతం, మాధవయ్యగారు దేశానికి వుపకారం చెయ్యలేక పొయ్యాడు, తనకి అన్యాయం చేసుగున్నాడు, ఆయన విధి ఆయన నెరవేరుస్తూ, నన్నూ అరెస్టుచేసి వున్నట్లయితే సంతోషిద్దును నేను. నాకు నిజంగా జైల్లో కొంతకాలం గడపాలనుంది-"

"బాగానే వుంది. ఆయన వుద్యోగానికి భంగం కలిగితే, మన కేమొస్తుంది?"

"న్యాయాన్ని సాధించడం జరుగుతుంది. చూశావా అల్లుణ్ని వొదిలిపించేశాడని చెప్పుకునే అపకీర్తికన్నా వుద్యోగం పోవడం పెద్ద అపచారమా?"

"నీ ధోరణి నిజంగా ఆ వుత్తరం పోలీసు అధికారుల కిచ్చేటట్లుగా వుంది అల్లా చెయ్యకుస్మా"

"నీ కెందుకు అమృతం వారిమీద అంత జాలి?" అని అడిగాడు, ఎల్లానూ యిస్తాడని తెలిసీ, యివ్వవొద్దు అంటూ తన మంచితనాన్ని ప్రకటించుకోడమా అది? లేకపోతే ఏదో ఘనకార్యం చేస్తున్నానని, సంస్కర్త స్వాతిశయమా?

"ఏం లేదు బావా—అనేక రకాల మనుషులుంటారు. వాళ్ళందర్నీ బాగుచేసినంత మాత్రాన, న్యాయం జరుగుతుందా? ఎందరో మన్ని మోసగిస్తారు, చివరికి మోసపోతారు. కోమలి విషయం చూడు...." అంది అమృతం.

"కోమలి ఎవర్నీ మోసం చెయ్యలేదు. కోమలికి బాగా ప్రవర్తించడం అంటే ఏమిటో కూడా తెలీదు."

"బావా! నిన్నో విషయం ఎప్పటినుంచో అడగాలనుంది—ఏమీ అనుకోనంటే అడుగుతాను—"

''తప్పకుండా అడుగు—పైగా నువ్వడిగే దేమిటో నాకు తెలుసు...''

అమృతం ఆశ్చర్యం ప్రకటించింది.

''ఐతే ప్రశ్న లేకుండా సమాధానం చెప్పు'' అన్నది,

''నీ దగ్గర నాకు రహస్యం లేదు అమృతం. ప్రతివాడూ తన నిజస్వరూపం ఎవరో వకరిముందు బైటపెడతాడు. నేను నీ ముందు బైట పెట్టక తప్పింది కాదు....''

''ఓ యబ్బో యీ మాటల కేంలే. మొగాళ్ల రహస్యాలు ఆడాళ్ళతో ఎందుకు చెబుతారు నాకు తెలీదేమిటి ఆమాత్రం'' అంది. కాని, అతని కేసి రెప్ప వాల్చకుండా వింతగా చూసి. మళ్ళా మొహం తిప్పేసి, గోడమీద పురుగుల్ని వేటాడుతున్న బల్లి కేసి చూస్తోంది.

''కాదు అమృతం. చెప్పకపోవడానికి కారణం, చెప్పింది అవతలవాడు నమ్మడేమోనన్న భయం. చెప్పిన విషయాన్ని, విమర్శించకుండా, సానుభూతితో అర్థం చేసుకోగల సంస్కారం వున్నవాడు దొరికేవరకూ, మనలో సత్యం మరుగువడి వుండాల్సిందే. కొంతమందికి అల్లాంటి వ్యక్తులు అసలెప్పుడూ జీవితంలో దొరకనే దొరకరు. వాళ్లే విషాదకరమైన వ్యక్తులు వాళ్లు చివరికి ఐతే మహా యోగులేనా అవుతారు, లేకపోతే రౌడీలేనా అవుతారు, తన ప్రవర్తన సరియైనదని రుజువు చేసుకుని సమాధాన పడటం కోసం, మానవుడు చేసే యత్నమే తన నిజస్వరూపం,''

అమృతానికి బాగా అర్థమైనట్టు లేదు, కొన్ని విషయాలు యిట్టే బోధపడతాయి; వాటికి మాటలు, ధ్వనులు, నిర్వచనాలు ఏవీ అక్కర్లేదు. మరికొన్ని పరిశీలించి, తర్కించినకొద్దీ, యింకాదూరమై పోయి ఆకృతిలేని, మేఘంలా విడిపోయి, ఆకాశమంతా ఆవరిస్తాయి. అమృతం వెనక్కి జంకింది; చూపుతో, నాడి కదలికతో, చర్మం తాకిడితో చుర్రుమని కాలిపొయ్యే హృదయం, నోరు విప్పగానే మూగదై పోయింది.

''అసలు విషయం తప్పించేశావు, బావా...నీకు కోమలంటే - ఎందు కంత యిది—''?

''యిదంటే?''

"ఏమో బాబూ, నాకు తెలీదు."

తలకాయ గిర్రున తిప్పి, సిగ్గుని నవ్వులోకి మార్చేసింది అమృతం. అట్లా ఆ నవ్వు పైకి తేలిపోయి 'దొంగ బావ'' అన్న వాక్యంలో పేలిపోయింది రంగు రంగుల నక్షత్రాలు, అతని కళ్ళ ముందు కదిలాయి. ఇందాకట్నుంచీ అలుకున్న నిశ్చలత్వం ఒక్కసారి విడిపోయింది. తినేటందుకు పురుగు కోసం బల్లి వెనక్కి వెళ్ళిపోయింది. శంకరం వచ్చే ఆవలింతని ఆపుకుంటూ చిటికలు వేస్తున్నాడు.

అమృతం లేచి ఒళ్లు విరుచుగుని, అటూ ఇటూ పచార్లు చేసి, మళ్ళా అతని మంచం దగ్గరగా వొచ్చి—

"సమాధానం నాకు తెల్సు బావా" అన్నది.

"నీకు తెలీదు, అమృతం. అసలు ప్రశ్న ఏమిటో కూడా నీకు తెలీదు" అన్నాడు.

"నాకు తెలుసు" అంది అమృతం.

"పోనీ నీ ప్రశ్న ఏమిటి? నాకు కోమలితో సంబంధం వుందా అని, లేదని నీకు తెలుసు, ఐనా వుందని, నాకు కొంత బాధ కలిగించాలని. నిజాన్ని నిజం అని రుజువు చెయ్యడం నాచేత కాదు" అన్నాడు నిధి.

అమృతం వొక్కసారి మొహం విచారంగా చేసుగుంది, స్త్రీత్వంలోని అసహాయత కళ్లల్లో ప్రదర్శించింది.

"అది కాదు, బావా! కోమల్ని గురించి నీకెంతటి అభిమానం వుందో తెలుసుకోవాలని—అన్నా గాని. నిన్ను బాధపెట్టాలని కాదు. ఐతే యీ విషయం నీతో మాట్లాడక్లే. నేనేమన్నా తప్పుగా అంటే క్షమించు..."

స్త్రీ యీ ధోరణిలో మాట్లాడినప్పుడు, తెర వెనక జరుగుతున్న నాటకంలో పాత్రగా మారుతుంది. మనం చూడొచ్చు, వినొచ్చు తెలుసుకోవొచ్చు. కాని అర్థం చేసుకోలేం.

'ఇట్లాంటప్పుడు, మీ అమ్మగారుంటే యెంత ధైర్యంగా వుండును!'' అన్నది అమృతం, మరో విషయం ఎత్తుతూ.

అమృతం అనుభవంవల్ల తెలుసుకుని, ఆలోచించి ప్రయో

గించిన అస్త్రం అది. మళ్ళా సంభావణ. ప్రస్తుత కర్తవ్యాన్ని గురించి ప్రారంభమైంది నిధిని తనతో వాళ్ల వూరు రమ్మంది అమృతం.

"మీ ఆయన ఏమన్నా అనుకుంటాడేమో?" అన్నాడు,

"ఛీ,—ఏం మాటలు బావా? "

"నేను మా నాన్న దగ్గరికి బెంగుళూరు వెడుతున్నాను. మవ్వు తెల్లారగట్ల బండికి మీవూ రెళ్లు" అన్నాడు.

నిధికి మాధవరావుగారేర్పాటు చేసిన బసలో అమృతం, శంకరం పడుకోటానికి ఏర్పాటైంది. బండి తెల్లవారగట్ట ఐదున్నరకి. స్టేషన్‌కి వెళ్లేటప్పుడు, అక్కడి కొచ్చి చెప్పి వెడతామని, శంకరం. అమృతం బండమీద గదికి వెళ్లారు.

నాలుగింటికి అమృతం హాస్పిటల్‌కి వొచ్చింది. నిధి నిద్రలో వున్నాడు; రాత్రి బాగా నిద్ర పట్టిందని వార్డు బోయ్ అన్నాడు. అమృతం మెల్లిగా అతని మంచం దగ్గర కొచ్చి. మాధవయ్యగారు వ్రాసిన వుత్తరం కోసం వెదకడం మొదలెట్టింది. అతని దిండుకింద ఆ వుత్తరం దొరికింది. దాన్ని తీసుకుని దాచింది. తరవాత అతన్ని లేపి "వెళ్లొస్తా బావా. నువ్వు తప్పకుండా మా వూరు రావాలిస్మా. మామయ్యని కూడా తీసుకురా. ఇంకో పదిరోజుల్లో జగ్గుగాడు కూడా వొస్తాడు. ఏం?" అంది.

నిధి లేచి. కళ్లు తుడుచుకుని ఆవలించి. అల్లాగే అంటూ మళ్లా వాలాడు. బైట బండివాడు టైమైంది లెగండమ్మా అని అరుస్తు న్నాడు.

వెళ్ళొస్తా బావా! జ్ఞాపకం వుంటాం కదూ—ఓ వుత్తరం ముక్క రాస్తూండు, తమ్ముణ్ణి స్టేషన్‌కి పంపుతా...."

"తప్పకుండా వొస్తా. ఐతే. వోవేళ నే రాలేననుకో—నేను ఎప్పుడు రమ్మంటే అప్పుడు రాగలవా నువ్వు" అన్నాడు.

అమృతం. అటూ ఇటూ చూసి, శంకరంతో. 'పద ఎక్కాల్సిన బండి' అంటూ—"ఓ" అంది ధైర్యంగా. నమ్మమన్నట్లుగా నవ్వి, బండెక్కి వెళ్లింది. భారతమాత సంకెళ్లు చప్పుడు చేసినట్లు గాజులు చప్పుడు బైటనుంచి వినబడింది.

నిధి పక్క సర్దుకుంటూ దిండ్లకింద చూశాడు, మామగారు

వ్రాసిన ఉత్తరం లేదు. అతనికి నవ్వొచ్చింది. చిత్రమైన మనిషి అమృతని అనుకున్నాడు.

# 5

# సౌందర్య రాహిత్యం

దయానిధి పలారులో ప్రాక్టీస్ పెట్టాడు. మిగిలిన మూడెకరాల భూమి అమ్మి, దశరథరామయ్యగారు కొంత డబ్బు కొడుక్కిచ్చి, మిగత డబ్బుతో నారయ్యని తీసుకుని దక్షిణదేశ యాత్రకి రైలు చేరారు. ఆ డబ్బుతో దయానిధి ప్రాక్టీస్‌కి కావల్సిన సరంజామంతా తెచ్చుకున్నాడు, ఇల్లు కొంచం పెద్దదే. హాజా. మధ్య పెద్దహాలు, వెనుక రెండు గదులు, వరండాలోంచి పైకి మెట్లు వెనకాల విశాలమైన దొడ్డి, దాన్నిండా పూల మొక్కలు, అరటి చెట్లు చుట్టూ గోడ, — జోత్తిగా నడివీధిలో కాకుండా, కాలవకి కొంచం దూరంలో వుంటుంది. రెండు గదులలోనూ, కుడివైపు దాంట్లో మందుల బీరువాలు, కుర్చీలు, బల్లలు అమర్చబడివున్నాయి. ఎడమవైపు దాంట్లో పుస్తకాల బీరువా, గుండ్రటి బల్ల, సోఫా, పడక్కుర్చీ వుంటాయి. రామదాసుని కాంపౌండర్‌గా పెట్టుకున్నాడు. భోజనం హోటల్ నుంచి కారియర్‌లో తెప్పించుకుంటాడు.

తన జీవితం అసంపూర్ణంగా వుందని దయానిధికి తెలుసు. మాధవయ్యగారి వద్దనుంచి వుత్తరం రాలేదు. ఇతను ఇందిర సంగతి కనుక్కుంటూ వ్రాసిన వుత్తరాలకి జవాబు లేదు. ఇందిర, యితన్ని అక్కడ కొచ్చి, తనని తీసుకరమ్మని కబురంపింది. వొకసారి వుత్తరం వ్రాసింది. మామగారి దగ్గరకెళ్ళి, ఘర్షణపడి, పెద్దగొడవ చెయ్యటానికి యితనికి తగినంత ధైర్యమూ లేదు, యిష్టమూ లేదు, పెళ్ళాం కాపరానికి రాదేం? అని చాలమంది అతన్ని అడుగుతూనే వున్నారు, పుట్టింటి కెళ్ళిందనీ, చదువుకుంటుందనీ, జబ్బుగా వుందనీ,— ఏదో అబద్ధపు సమాధానాలు యితను చెబుతూనే వున్నాడు, జనం రక

రకాలుగా చెప్పుకోడం సాగించారు. లంచ మెడతానని మామగార్ని వొక్కసారి పదివేలు అడిగాడనీ, ఆయన యివ్వలేనందున భార్యని వొదిలేసి; వాళ్లతో సంబంధం వొదులుకున్నాడనీ, కొంద రనుకున్నారు, మరికొందరు ఇతనికి మరో స్త్రీతో పెళ్లిగాక పూర్వంనుంచే సంబంధం వుందని అభిప్రాయపడ్డారు. వారి అభిప్రాయాలని ఋజువుపరిచే నిదర్శనాలకోశం వెదుకుతున్నారు కాని, ఫలితం లేక పోయింది. రికామీగా వున్న కొందరు వ్యక్తులు యిందులో నిజమేమిటో తెలుసుకోడానికి పరిశోధనలు చేస్తున్నారు. అందర్లాగే కాకుండా, ఎవరేనా, వింతగా జీవిస్తుంటే, సంఘం క్షమించదు. అందరూ పెళ్ళాం బిడ్డలతో కాపరం చేస్తుండాలి. సన్యాసం పుచ్చుగుంటే అది వేరే సంగతి. మనుషుల ప్రవర్తనకి బహిర్గత చిహ్నాలు చూపమని శాసిస్తుంది. పరీక్ష ప్యాసైతే సర్టిఫికేటు, పట్టాపుచ్చుగుంటే బోర్డు, పెళ్ళాం వుంటే మెళ్ళోపుస్తి, సన్యాసం పుచ్చుగుంటే కాషాయవస్త్రం, గుండు, పోనీ గడ్డం,—యివన్నీ చూపాలి.

ఒకరోజున నిధి, క్లబ్బులో ప్రకాశరావుని కలుసుకున్నాడు. ప్రకాశరావు తండ్రికీ, దశరథరామయ్యగారికీ పరిచయం వుండేది. ప్రకాశరావు 'లా' పూర్తిచేశాడు: కాని ఇంకా ప్రాక్టీస్ పెట్టలేదు. అతనికింకా వివాహం కాలేదు. అవీ ఇవీ మాట్లాడుకున్న తర్వాత ప్రకాశరావు శ్యామల విషయం చెప్పాడు.

శ్యామల, ప్రకాశరావుచెల్లెలు; వయస్సు 22, అత్తారు నూజివీడు దగ్గర. శ్యామల భర్తకి బొంబాయిలో ఫ్యాక్టరీలో పని. బొంబాయిలో నాలుగేళ్లు కాపరం చేసింది. ఆమె తండ్రి, అన్నగారు, వొక్కసారి తీసుకొచ్చి, చూపించమని, ఎన్నిసార్లు వ్రాసినా, అతను సెలవదొరకలేదనో, తనకి వొంట్లో బాగాలేదనో, ఏదోసాకు చెబుతూ, నాలుగేళ్ళ మధ్యలో, వొక్కసారికూడా భార్యని పుట్టింటికి తీసుకురాలేదు. ఎప్పుడేనా ప్రకాశరావు బొంబాయి వెళ్ళి చెల్లెల్ని చూసి వొస్తుంటాడు. ఈమధ్య తండ్రికి జబ్బుచేసి, కూతుర్ని చూడాలనుందంటే, ఇతను వెళ్ళి, శ్యామల్ని తీసుకొచ్చాడు. వొచ్చిన మొన్నాడే శ్యామల ప్రవర్తన వింతగా వుంది.

మనిషి అసలే సన్నం; పైగా అన్నం తినడం మానేసింది.

ఆకలి లేదంటుంది; అందరూ బలవంతం చేస్తే కాస్త తిని డోక్కుంటుంది. కొన్ని చిత్రమైన పనులు చేస్తుంది. బొగ్గుల్ని చూస్తే శ్యామలకి భయం. ఐనా పొయ్యిదగ్గరే కూర్చొని బొగ్గులు కాల్తుంటే తదేక దీక్షతో చూస్తూ కూచుంటుంది, మధ్యలో పొయ్యిలో నీళ్ళోసి మంట ఆర్పేసి, బొగ్గుల్ని పొడుంచేసి, కాటికగా పెట్టుగునో, పౌడర్లా మొహానికి రాసుకునో, లేకపోతే ఆ పొడుం నీళ్ళల్లో కలిపి పోసుగోడమో చేస్తుంది. అదేమిటే అని అడిగితే, మరిచిపొయ్యానంటుంది. వంటింట్లో సత్యనారాయణస్వామి బొమ్మదగ్గర కూర్చుని దానికేసి చూస్తూ, కొంత మట్టితీసి, నీళ్ళల్లో కలిపి, ఆ బొమ్మకి పట్టిస్తుంది అదో ధోరణి. నూజివీడులో వైద్యులు గాలిన్నారు, భూతమన్నారు మళ్ళా మనిషి శుభ్రంగా, తెలివిగామాట్లాడుతుంది ప్రకాశరావుకి వైద్యులు చెప్పిన విషయాలలో నమ్మకంలేదు. ఏ మద్రాసో తీసుకెళ్ళి డాక్టర్లకి చూపించాలని వుందన్నాడు.

"బొంబాయి నుంచి, తనకాపరం ఎల్లా వుంటున్నదీ, భర్త విషయం ఎప్పుడేనా వుత్తరాలలో వ్రాసేదా?" అని అడిగాడు నిధి.

"మొత్తం నాకు యీ నాలుగేళ్ళలో, ఆరు వుత్తరాలు వ్రాసింది. తను బాగానే వున్నానని వ్రాసేది కాని..."

"భర్త విషయం...?"

"అంతా బాగానే వున్నామని వ్రాసేది."

"నువ్వు బొంబాయి వెళ్ళి చూసేవాడవుకదా, నీకేమన్నా విచిత్రంగా తోచేదా?"

"అంటే?"

"బావగారు నీకు నచ్చేవాడా?"

"నా అనుమానం అప్పుడప్పుడు అతను తాగుతాడని. శ్యామల నడిగాను. అది నవ్వి—కాదు, అవన్నీ ఖాళీసీసాలు, స్పిరిట్, నూని, యివి పోసుగుసేందుకు కొనుక్కున్నామనేది.'

"అతని ఆరోగ్యం?"

"దుక్కలాగుండేవాడు."

"మీ శ్యామలకి పిల్లలా?"

"లేరు."

"కడుపొచ్చి పోయిందా?"

"నేనడగలేదు."

శ్యామల్ని చూడాలని వుందన్నాడు నిధి. వాళ్ళిద్దర్నీ ప్రొద్దున్న యింటికి రమ్మని ఆహ్వానించాడు.

"నేనేమీ మందిచ్చి, జబ్బు కుదురుస్తా ననుకోవొద్దు. ఊరికే ఫ్రెండ్లీ విజిట్ — శ్యామల్ని చూడాలని కుతూహలంగా వుంది" అన్నాడు,

ప్రకాశరావు పేకాట బల్ల దగ్గరకీ, దయానిధి కారమ్‌బల్ల దగ్గిరికీ కదిలారు.

ప్రొద్దున్నే ప్రకాశరావు, శ్యామల్ని తీసుకొచ్చాడు. నిధి ఆమెని చూడగానే ఆశ్చర్యపడినా, పైకి ఆశ్చర్యాన్ని ప్రకటించ లేదు పెండ్లి సంబంధాలు చూస్తూ తను చూచిన పిల్లలలో శ్యామల వొకర్తి. ఈ సంగతి ప్రకాశరావుకి తెలీదు; శ్యామల గుర్తుపట్టినట్టు లేదు శ్యామల కొంచం నలుపు. అంత ఎత్తరి కాదు. చర్మాన్ని ఎముకల మీద సాగదీసినట్లు సన్నగా వుంటుంది, అందమైన పళ్ళవరస. మాట్లాడినప్పుడు చూడముచ్చటగా వుంటుంది కాని మాట్లాడదు. గదిలోకి రాగానే; బల్ల ముందు కూర్చుని, యింటికప్పు, గోడలని చూడటం మొదలెట్టింది. బల్లమీద వున్న సిరాబుడ్డి తీసుకుని: కొంచం సిరా చీరమీద పోసుకుంది. ఆమె కట్టుకున్నది పసుపు పచ్చ పువ్వులద్దిన నల్ల అద్దకం చీర; గుజరాతీ ఫక్కీలో కట్టి, నెత్తిమీద వేసుకున్న ముసుగుని తీసేసింది. జడముందుకు వేసుకుని యిప్పింది. సిరా జడకి పూసుకుంది. "చాలా మంచి వాసన" అన్నది సిరావాసన చూస్తూ.

నిధి ఆమెని పరీక్ష చేసి, ప్రకాశరావుని పక్కగదిలో కూర్చోబెట్టి, మళ్ళా యివతలి కొచ్చాడు.

"బొంబాయి బాగుంటుందా?" అని అడిగాడు.

"బాగంటే?"

"అందంగా వుంటుందా?"

శ్యామల వికలంగా నవ్వి, జడ తన మెడచుట్టూ బిగించుకుంది. శ్యామల లేచి అన్ని మూలలా పచార్లు చేసి, వాసన చూసింది.

"మీ ఇంటికి అద్దెంత?"

"మనిషికి రూపాయి."

"అంతే!"

"నలభై మందున్నాం"

"నలభై అన్నమాట" అన్నాడు.

"భోజనాని కెంతవుతుంది?" అని అడిగాడు మళ్ళా.

"గుడ్డాని కెంతవుతుంది?" అని ప్రశ్నించింది.

"సరే, మీ ఆయన వస్తే కెన్నింటికి వస్తాడు?"

"ఇంట్లో అవివాహం సంట" అంది.

"పానీ రోజూ ఎన్నింటికి ఇంటికొస్తాడు?"

దీనికి శ్యామల సమాధానం చెప్పలేదు. 'చాలా చక్కగా వుంది' అంటూ బైట అరుగుమీదికి నడిచి పచార్లు చేస్తోంది. నిధి దొడ్లో గాలేస్తుంది రమ్మని పూలమొక్కల దగ్గరికి తీసికెళ్ళాడు. వాటికేసి వింతగా చూసింది. ఒక పువ్వుని కోసి వాసన చూసి, "ఛీ పాడు వాసన" అని నలిపి పారేసి కింద మట్టిని అరిచేతుల్లో రుద్దుకుని, మొహం అంతా తుడుచుకుంది. ఆకాశం కేసి చూసి ఆలోచించి, చివరికి నేలమీద పడుకుంది.

"నువ్వు రోజల్లా ఎట్లా గడిపేదానివి బొంబాయిలో" అని అడిగాడు.

శ్యామల నవ్వింది; కాని సమాధానం చెప్పలేదు.

"శ్యామలా, నువ్వు కట్టుకున్న చీర ఎంతో బాగుంది. నువ్వే కొనుక్కున్నావా, మీ ఆయన కొన్నాడా?" అని అడిగాడు.

శ్యామల చీరకేసి గర్వంగా చూసుకుని, పమిటకొంగు తీసేసి, గడ్డి మీద పరిచి మొహం అందులో దాచుకుంది, పల్చబడి గుండెల కతుక్కుపోయిన రొమ్ములు కంఠం నరాలు పాలిగూడులా మెదుల్తూ, భయంకరంగా వుంది శ్యామల.

"మీ ఆయన మంచివాడేనా? ఎట్లా వుంటాడు, చెప్పవ్?" అన్నాడు

"ఓ ఫ్యాక్టరీ గొట్టంలా గుంటాడు" మళ్లీ నవ్వింది. "నిక్కు తెలీదు బొగ్గు వాసన తారుజిగురు—మాట్లాడితే మరల మోత, నవ్వితే నిషాళం అంటే నలుపు..." అని యింకా చెప్పబోతోంది.

అతను ఆమె దగ్గరగా వెళ్ళి, మెల్లిగా అడిగాడు.

"నీకు నిద్ర బాగా పడుతుందా?"

"నే నసలు మేలుకోను."

"కలలు తరుచువొస్తుంటాయా?"

"బొంబాయి కల" అంది తను మెల్లిగా.

"ఓ కల చెప్పవూ?"

"బొంబాయి రండి చెపుతాను."

"ఎట్లావాను? మీ గదిలో నలభై మంది కాపరం వున్నా రన్నావు. మరి నాకు చోటేది వొస్తే?"

"నా భుజాలమీద" అంది విక్రాంతంగా నవ్వుతూ.

ఇంతలో ప్రకాశరావు దొడ్డి వేపునొచ్చాడు. అతన్ని చూసి, శ్యామల "బాబో బొంబాయి మనిషి" అంటూ, గబగబా లోపలికి పరుగెత్తింది.

నిధి మెల్లిగా నడిచి మెట్లమీద కూర్చున్నాడు. ప్రకాశరావు అతనికేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఏమిటంటావు?"

"నాకేమీ తెలీకం లేదు. ఐనా, నాకో అనుమానం కలిగింది, నా దగ్గర శ్యామలని రెండు వారాలు ఉంచగలవా?"

"ఏం?"

"ఉంచితే నా అనుమానం తీరిపోదమో, రుజువు కావటమో జరుగుతుంది."

"టి. బి. యా?"

"కాదు, కాదు"

"చెప్పకూడదా?"

"నే నిప్పుడు చెప్పను. నువ్వు నవ్వుతావు; పైగా నమ్మవు. అంచేత ముందు నే నిర్ధారణ చేసుగుని, నీకు తెలియపరుస్తా. అదృష్టం వుంటే, ఆమె మామూలు మనిషికూడా కాగల్దు. లేకపోతే నష్టం మట్టుకు లేదు" అన్నాడు నిధి

"మాయింటి కొచ్చి, మందు యివ్వడానికి వీలవుతుందా?"

"కాదు. ఇక్కడే వుండాలి."

"ఉంచుతాను. ఎవ్వరితో చెప్పను, ఏమిటో కథ నాకు చెప్ప కూడదూ?" అన్నాడు ప్రకాశరావు.

"చెప్తాను. ఎవళ్ళతో అనకు. సౌందర్య రాహిత్యం అనే జబ్బుతో బాధపడుతోంది శ్యామల" అన్నాడు. ఇద్దరూ లోపలి కెళ్ళారు.

ప్రకాశరావు, శ్యామల్ని, పదిరోజులపాటు నిధి ఇంట్లో వుంచే టందుకు అంగీకరించాడు. దొడ్డివైపున వున్న వరండాలో సగం పొడిలేసి, వాకస్క్రీన్ ఏర్పాటుచేసి, ఆ వరండా, దానవతలున్న గదీ, శ్యామలకోసం ఏర్పాటుచేశాడు. గదంతా మార్చివేశాడు. నిధి గోడలకి సగం భాగం ఆకాశరంగు వేయించాడు. కింద భాగానికి పసుపు పచ్చరంగు కాగితం చుట్టూ అంటించాడు. నాలుగువైపులా నాలుగు చిత్రపటాలున్నాయి. మూలల్ని ఎత్తు బల్లలు అమర్చి, వాటిమీద పూలతొట్టెలు, ఫొటోగ్రాఫ్‌లు వుంచాడు. నేలంతా ముదురంగు తివాచీ పరిచాడు. మూలగా, కిటికీపక్కన మంచం — కిటికీలోంచి, చెట్లు, ఆకాశం కనిపిస్తుంటాయి. కూర్చునేందుకు వరండాలో కుర్చీలు, మధ్యన గుండ్రటిబల్ల, చిన్నపుస్తకాలు షెల్ఫ్,— వీటిమధ్య శ్యామల ఏకాంతంగా కాలం గడపటం. రాముదాసు వేళకి భోజనం వరండాలో పెడుతూంటాడు. కుట్లు, అల్లికలు, — ఏటికి కావల్సిన సరంజామా గదిలో వుంచారు. డ్రాయింగు కాగితాలు, రంగుల పెట్టె కుంచెలు, ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో కలిపిన మట్టి, మైనం వాకముద్ద చేసి వాకమూల బల్లమీద వున్నాయి. అప్పుడప్పుడు నిధి వొచ్చి, శ్యామల ఏం చేస్తుందో చూసి, కాసేపు మాట్లాడి పోతూండేవాడు. మొదటరోజున, దొడ్లో మట్టి తీసుకొచ్చి, మంచం మీద చల్లింది శ్యామల. "పోనీ మంచం, దొడ్లో వేయించనా?" అన్నాడు నిధి,

శ్యామల, మాట్లాడకుండా, మంచంకిందదూరి, వొట్టినేల మీద పడుకుని తలగడదిండు, గుండెలమీద వుంచుకుంది.

"ఇక్కడ బాగుందా?"

"అంటే?"

"నీ మనస్సు హాయిగా, నిశ్చింతంగా...." శ్యామల మాట్లాడలేదు

"మీ ఆయన్ని రమ్మని వ్రాయనా? ఇద్దరు హాయిగా యిక్కడే వుందురుగాని." అన్నాడు.

"బాబోయ్" అని కళ్లుగట్టిగా మూసుకుంది.

"ఏం?"

"వినండి, వినండి" అంది.

నిధి విన్నాడు. మిల్లుకూత. ఆశ్చర్యానికి బెదిరి పోతోంది శ్యామల.

"శ్యామలా, నీకు పాట లొచ్చునా?"

"వొ"

"ఐతే పాడు."

"పట్టి మశానములో మసలే వో రామయ్య"

"ఓ ఫస్టుగా వుంది. గ్రామ్ ఫోన్ తెప్పించనా?"

నారాయణరావుగారింటికి కబురంపి, నిధి గ్రామ్ ఫోన్ తెప్పించి, గదిలో పెట్టాడు మొదట్లో శ్యామల ప్లేట్లని చూసి భయపడింది. నిధి ప్లేట్లమీద సౌండ్ బాక్స్ పెట్టింతర్వాత, తెల్లటిగుడ్డతో మెత్తగా కప్పాడు. బెంగుళూర్ నాగరత్నం, వనజాక్షి, రాచప్ప, ఖాదర్ బాచ, బాలగంధర్వ, రాము నాథశాస్త్రి,–వీళ్ళ రికార్డ్లలో, శ్యామలకి వనజాక్షి పాటలు నచ్చాయి. అవే అస్తమానం పెట్టుకునేది. ముఖ్యంగా, రికార్డు చివర "మైనేమ్ యీజ్ మిస్ వనజాక్షి" అన్న వాక్యం, శ్యామలకి చాలా యిష్టం. తనూ చివర, "మైనేమ్ యీజ్ మిస్ శ్యామల" అంటూ కూర్చునేది

"నువ్వు మిస్ వి కాదు. 'మిస్' అనేది పెండ్లికాని వాళ్ళకే" అన్నాడు నిధి.

"అమాత్రం తెలుసులే వెళ్ళవయ్యా, మిస్టర్ నిధి" అంది శ్యామల.

మళ్ళా తనే అడిగింది.

"మిస్ నిధి ఎక్కడ?"

–"అంటే?"

"యువర్ వైఫ్."

నిధికి సమాధానం ఏం చెప్పాలో తెలీడం లేదు.

"బొంబాయి వెళ్ళింది."

"బొంబాయ్ మరి తిరిగిరాదు."

"ఏంకి?"

"అది స్వర్గలోకం. వెళ్ళినవాళ్ళు వెనక్కిరారు."

మూడోనాడు శ్యామల రామచిలక కావాలంది. నిధి మనుష్యుల్ని పంపి, కోయలచేత పట్టించి పంజరంలో వుంచి, గదిలో పెట్టాడు.

ఒకటిచాల్దు యింకా కావాలంది శ్యామల. మరో రెండు చిన్ని చిలకల్ని కూడా తెప్పించాడు. వేరే పంజరాల్లో పెట్టించాడు. అన్నీ ఒకే పంజరంలోనే ఉంచాలంది. అన్నింటినీ ఒకే పంజరంలోనే వుంచాడు. అవి మొదట్లో పొడ చుకునేవి; తరవాత గత్యంతరం లేక, అల్లాగే వుండిపోయ్యేవి.

"ఒక్క పంజరంలో నలభై చిలకలు కావాలి" అన్నది శ్యామల.

నిధికి అప్పటికి అర్థమైంది. "ప్రయత్నం చేస్తున్నాను, మెల్లి మెల్లిగా వొస్తా" యనిచెప్పి, శ్యామల్ని వూరుకోబెట్టాడు.

శ్యామల ఆ పంజరంతో ఆడుకునేది. పంజరం నిండా మట్టి పోసేది; సున్నం మొత్తేది. సిరాపోసేది. పుల్లలతో చిలకల్ని పొడుస్తూ ఆనందించేది.

ఐదోనాడు, పిచ్చపిచ్చగా రంగులతో బొమ్మలు గియ్యడం మొదలెట్టింది. ఫ్యాక్టరీ గొట్టాలు, మరలు;—అవీ ఆమెగీసిన బొమ్మలు. కుట్లు, అల్లికలు సాగించింది. 'యుకాంబో' అని అక్షరాలని కుట్టింది. ఆ గుడ్డని పంజరంమీద కప్పింది. సాయంత్రం పట్టైంది. కిటికీలోంచి చంద్రుడు కేసి చూస్తూ కూర్చుంది. నిధిలోపలి కొచ్చాడు.

"చందమామ బాగుందా?"

"చంద్రుడిలో ఫ్యాక్టరీ వుందండోయ్— అదిగో నల్లగా గొట్టం. పొగరాదేం?"

"వెనక వుండేది. ఈమధ్యన పాడైపోయి; నిల్చిపోయింది" అన్నాడు నిధి.

"ఐతే, శ్యామలా, చిలకల్ని అల్లా పొడుస్తున్నావుకదా,— చచ్చిపోవూ?"

"చావాలనే పొడవటం—మీ కంతమాత్రం తెలీదు?"

"ఎందుకు నీకంత కసి?"

"అవి చస్తే, నా కానందం."

"పోనీ. వాటిని వొదిలేద్దాం."

"అమ్మో, అవి లేకపోతే కాలక్షేపం కాదు."

"కాలక్షేపానికి బోలెడున్నాయి. పుస్తకాలు చూశావా? కన్యాశుల్కం—చిలకమర్తివారి గణపతి, కదూ్వాక మంజరి—బొమ్మలు, పట్లు, గ్రామఫోన్, చంద్రుడు. పూలు, నక్షత్రాలు..."

"మీరు చాలా మంచివారు."

"నే నేం మంచి? పాపం, నీకెంత కష్టంగా వుందో యిక్కడుండటం! జైల్లో వున్నట్లు వుంది కాదు? ఆ చిలుకలు, నువ్వూ వొకే రకంగా బాధపడుతున్నారు,—ఔనా? పోనీ, మీ అన్నయ్య దగ్గరికే వెళ్ళిపోతావా?"

"నాకిక్కడే బాగుంది"

"బాగుంటే ఏమిటి?"

"ఏమో!"

"అయితే శ్యామలా, నే నెవర్నో జ్ఞాపకం వున్నానా?"

"ఓ. నన్ను చూడ్డానికి వొచ్చారు, వెనక. నేను మీకు నచ్చ లేదు. అందుకని నన్ను చేసుకోలేదు. మీ పెళ్లాన్ని చూపించండి, ఏ వూళ్లోవుంది?"

"వాళ్ళవూళ్లో వుంది, రమ్మని వ్రాయనా?"

"ఓ."

"మీ ఆయన్నికూడా రమ్మని వ్రాయనా? పాపం నీకోసం బెంగపెట్టుకొన్నాడుట."

"నిజంగా?"

"అవును."

"పోనీ రమ్మనండి."

"పొద్దువుతోంది, భోజనానికి లే."

"మీరు నాతోకూర్చుని తినండి."

ఇద్దరూ, వరండాలో కూర్చుని భోజనం చేశారు. భోజనంచేసి యివతలకి రాగానే, గుమ్మంలో, రోజ్ నిలబడివుంది. స్కూల్లో ఆమె

వుద్యోగం తీసేశారట. నిధి ఆమెని తనదగ్గర, కాంపౌండర్ గా వుండ మన్నాడు. అభ్యంతరం లేకపోతే. రోజ్ వొప్పుగుంది. శ్యామలకి తోడుగా కూడా వుంటుందనుకున్నాడు.

ముందు గదిలోకెళ్ళి కూర్చోగానే, రోజ్ ఓ వుత్తరం యిచ్చింది. తమకోమల్ని ఎక్కడ, ఎల్లా కలుసుకున్నదీ చెప్పింది. ఆ వుత్తరం యిది :

“మిమ్మల్ని చూడాలని వుంది. ఎందర్నో అడుగుతాను, నేను యిదివరకు కోమల్ని కాను. జమీందారు చదువు చెప్పిస్తున్నాడు, మీ అమ్మతల్లిగారూ వారూ బాగా వున్నారా? మీ భార్యాగార్ని వొస్తే చూపిస్తారా? నేను అక్కడకొస్తే నాతో మాట్లాడతారా? నాకు రాత్రుళ్లు నిద్రపట్టదు నిద్దట్లో అస్తమానం మీరే కనబడతారు. అట్లా ఎందుకుంటుంది? నేను మీకు జ్ఞాపకం వస్తానా? ఇంకెందు కొస్తాను.

నే నిప్పుడు చిక్కుల్లో వున్నాను. జమీందారు ఏవూరో చెప్పకుండా వెళ్ళాడు. నెల దాటింది. మీరు కొంచెం డబ్బుపంపిస్తారా? నన్ను రమ్మంటారా! ఏమి చెయ్యను, చూసి వొచ్చేస్తాను. లేకపోతే జ్వరం వొస్తుంది.”

“డబ్బు పంపమని నీతో చెప్పిందా!”

“మనియార్డర్ చెయ్యమంది.”

“ఏమిటి చిక్కు?”

“నాతో చెప్పలేదు.”

“మందులకా?”

“నాకు తెలవదండి.”

మొన్నాడు నిధి, రెండొందలు మనియార్డరు పంపించాడు. కోమల్ని రమ్మని రాసేటందుకు సాహసించలేక పొయ్యాడు. అయినా ఆ రాత్రి కూర్చుని కోమల్ని గురించి తన కెట్లాంటి అభిప్రాయం వున్నదీ విపులీకరించేందుకు, వొక పెద్ద వుత్తరం వ్రాశాడు. ప్రొద్దునే ఆ వుత్తరం చదువుకున్నాడు. అందులో రాసిన సత్యాలని [illegible] యిస్తున్నాడు. తనికి నిజంగా కావల్సింది, కోమలి శరీరం. అది పవిత్ర మైన శరీరం కాదన్న సత్యాన్ని సహించలేదు. అది అతని వాంఛకి

అద్దుగా తోచడం లేదు. ఆకలేసినప్పుడు, ఏమీ దొరక్కపోతే ... తింటాడు మనిషి. అందం కోసం ఆకల్ని ఎవడు చంపుకుంటాడు? కోమలి అందం, శరీరానికి పవిత్రతని కూడా ఆపాదిస్తుంది. అది మాయ. భ్రమ. ఆ భ్రమని వాంఛించటం తప్పదు ఈ లోకా... పట్టుకొని ప్రాకులాడే వాళ్ళకి ఆ భ్రమ యదార్థం. పరలోక చింతా పరులకి, యీ యదార్థం, భ్రమ. ఉత్తరాన్ని చించి వేశాడు నిధి.

శ్యామల గదిలో, గ్రామఫోన్‌తో కలిసి తనూ పాడుతోంది. గదిలో కొచ్చాడు. చిలకలు గొడవ చేస్తున్నాయి. శ్యామల ... బొమ్మలు, మంచం కింద వున్నాయి. సగం అల్లిన దుస్తులు న్నాయి. ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో పొడుగాటి గొట్టాలని తయారు చేసింది. పేకముక్కలతో మేడ కట్టింది. ఆ గదిలో ప్రతీ వొస్తువూ శ్యామల నిజస్వరూపాన్ని చాటేస్తోంది,

"నువ్వు బాగా పాడతావు శ్యామలా, సంగీతం చెప్పించుకో రాదు? "

గర్వంగా నవ్వింది శ్యామల. "నేర్చుకుంటా."

"నీ కిక్కడ బాగుందా?"

"అంటే?"

"ఇక్కడే వుండా అనుందా, వెళ్ళిపోవాలనుందా?"

"నాకు యీ గదిలో బాగా లేదు. నూతిపళ్లెం దగ్గర ... కట్టించు."

మధ్యాహ్నం దాటియాక, కఱ్ఱలు తెప్పించి, దొడ్లో చెట్ల మధ్య వొచిన్న పందిరి వేయించి, మంచం, కుర్చీలు, అక్కడ పెట్టించాడు. శ్యామల ఆ దొడ్లో గడుపుతోంది. కింద గడ్డిలో పడుకుంటుంది. పువ్వుల రేకలని పొడుంచేసి వొళ్ళంతా పోసుకుంటుంది. చేదతో తనే నీళ్లు తోడుకుని వొళ్లు తడుపుకుంటుంది,

శ్యామల ఆహారానికి చాలా ఖర్చవుతోంది: ద్రాక్ష, దానిమ్మ, మామిడి, అరటి సపోటా, అనాస—రకరకాల పళ్లు. పాలు ఎన్నో కావాలి శ్యామలకి. విపరీతమైన ఆకలి తెలియపరుస్తో ... తెల్లచీర కట్టుగుని వెన్నెట్లో నూతిపళ్లెం మీద పాడుతుంది, అక్కడికి నిధి వొచ్చాడు.

"ఇప్పుడు బాగుందా?"

"ఓ, కాని, ఆ నూతిలో వుండాలని వుంది."

"చల్లగా వుండాలన్న మాట. రాత్రి మంచుపడి, జలుబు చేస్తుంది. మంచం గదిలో వేయిస్తా."

"గదిలో చిలకల గోల."

"వాదిలేద్దాం."

"అమ్మో. అవి అందులోనే వుండాలి."

"ఎందుకంత కసి?"

పెద్ద గాథ చెప్పింది. మధ్యలో వొక్కొక్క ద్రాక్షపండు నోట్లో వేసుకుంటూ, తన వెనకటి కథ చెప్పడం సాగించింది. శ్యామలకి,— బొంబాయి పట్నం. అక్కడి మనుషులు, రొద, గంద్రగోళం,మిల్లులు యివంటే భయం. భర్త యీమె ప్రకృతిరీత్యా కోరింది యివ్వలేక పోయాడు. దానికి కారణం ఆ వాతావరణం అని. శ్యామల భ్రాంతి. ఐదో నెలలో గర్భం పోయింది, ఏవో బాధలు; చెప్పుకోలేదు; చెబితే భర్తకి అర్థం కాదు. శ్యామలకి జీవితంపై మమకారం ఎక్కువ, జీవితాన్ని హింసించాలి. ఎట్లా? తన్ను తనే హింసించుకుంటుంది.

భోజనాలు కాగానే, నిధి ముందు గదిలోకి వెళ్ళిపోయ్యాడు. సైకోథెరపీ మీద, డాక్టర్ జోన్సన్ బీ బొంబాయిలో యిచ్చిన లెక్చర్లు విన్నాడు, ఆ వ్యాసాలు తీసి చదవడం మొదలెట్టాడు. శ్యామలతో వొచ్చిన తిరకాసు కొంతవరకూ అతనికి అర్థమైనట్లు తోచింది, గడియారం తొమ్మిది కొట్టింది. కాంపౌండింగు రూమ్ తలుపులు వేసిన చప్పుడైంది. రామదాసు వెడుతున్నాడు. రోజ్ తన పక్క మట్టు సర్దుకుంటోంది. శ్యామల గది నిశ్శబ్దంగా వుంది. బైట ఎద్దు బండి నిలచిన చప్పుడైంది, గది తలుపు ఎవరో తట్టారు.

వెళ్ళి తలుపు తీశాడు వెంకటాద్రిగారు.

'ఇందిర వొచ్చింది.'

'లోపలికి రమ్మనండి.'

ఇందిర లోపలికొచ్చి, హాల్లో బల్ల మీద కూర్చుంది.

'సామాన్లు లోపల పెట్టించండి' అన్నాడు నిధి.

'సామాన్లేమి లేవు' అన్నాడు వెంకటాద్రిగారు.

'భోజనాలు చేశారా?'

'నేను రాత్రుళ్లు భోజనం చెయ్యను. అమ్మాయి పస్తుతుంది' అన్నాడు.

రోజ్‌ని కారియర్. ఫ్లాస్కు యిచ్చి పంపించాడు నిధి. వెంక టాద్రిగారు ఫలహారం చేశాడు.

"ఇల్లు బాగానే వుంది, అద్దెకేనా?"

"ఆ."

"ఏమయ్యా పెద్దముండావాణ్ణి, నా మాట విని ఓసారి మామగారి దగ్గరకెళ్ళి, ఏదో రాజీపడి, ఇందిరని తెచ్చుకుని హాయిగా సంగా కాపరం చెయ్యరాదూ?"

"రాజీపడేటందుకు. అసలు దెబ్బలాటే లేదుగా."

"మరి నువ్వెందుకు వెళ్లవు?"

"వారు నన్ను రమ్మనలేదు."

"ఒకళ్లు రమ్మనే దేమిటి? నీ పెళ్ళాన్ని నువ్వు తెచ్చుకోక?"

"వారు పంపందే?"

"ఏమొచ్చింది?"

"అది వారేన్ని అడగండి. వారు పంపితేనే యిల్లా తీసు కొచ్చారా మీరు?'

"నా దగ్గర వుంటోంది ఇందిర. తీసుకెళ్లు బాబయ్యా అంది. బయలుదేరాను."

"చూశారా మరి. అన్నీ తెలిసే అల్లా సెలవిస్తారేం మీరు?"

"ఏదో తెలివి తక్కువ వాడు. మీ మామగారు. నువ్వే నాసర్దుకు పోవద్దు, చదువుకున్న వాడవ్?"

"ఏం చెయ్యమంటారు?"

"కాంగ్రెస్ మెంబరవటగా నువ్వు? ఆ కాంగ్రెస్‌లోంచి తప్పుకో రాదు? అందులో కూడా, గుద్దా? లాఠీ దెబ్బలు, జైళ్లేగా!"

"దానికీ, ఇందిర కాపరానికీ సంబంధం ఏమిటో నాకు తెలీదు. అంతకంటె మామగారే కాంగ్రెస్ మెంబరుగా చేరిపోతే తీరిపోతుందిగా."

"బాగానే వున్నాయ్ పట్టింపులు" అంటూ ఆయన సణిగాడు. ఇంతలో రోజ్ కారియర్, ఫ్లాస్కు తీసుకొచ్చింది.

కప్పులో పాలు పోసి యిచ్చాడు. ఆయన పుచ్చుకోనన్నాడు.

"నే నింకా ఆ స్థితికి రాలేదు. బాబు. మీ ఉభయులూ పుచ్చుకోండి."

ఇందిర రెండు పళ్ళు తిని పాలు తాగింది.

"మేం తెల్లారగట్ట ఐదు గంటల బండికి వెళ్ళాలి. నువ్వు కూడా మాతో వస్తే, నీ మామగారు సంతోషిస్తారు—ఏదో మాట్లాడుకో వచ్చు" అన్నాడు వెంకటాద్రిగారు.

"ఐతే మీరు వారు వంపితే రాయబారిగా వచ్చారా, లేక మీరు తమాషా చూద్దా మనొచ్చారా?" అన్నాడు నిధి.

"పెండ్లి చేసుగుని భార్యను విడిచిపెట్టి; ఒంటరిగా వుండడంలో తమాషా ఏముంది బాబు?" అన్నాడాయన కొంచెం హేళనగా.

"ఇంతకీ మీ తప్పు ఏమీ లేదంటారు?"

"వెనకటివి తెలుసుకుని ఏం లాభం? ముందు గతి చూసుకో వాలి. మొగా డెల్లావడితే అల్లాగే వుండగలడు, ఇందిర విషయం ఆలోచించు."

"అల్లా అనడంలో మీ అభిప్రాయం ఏమిటో తెలుసుకో వచ్చా?"

"వేరే చెప్పాలా—అందరికీ తెలుస్తూనే వుంది."

"మీరు పెద్దలు, నిజానిజాలు తెలుసుకోకుండా, మాటలనెయ్యడం భావ్యం కాదు."

"నేను నోరు కట్టేసుగుంటే ఆగుతుందా! లోకం లేదూ?"

"ఊరుకో బాబయ్యా—నువ్వు పడుకో, మళ్ళా ఆయాసం వొస్తుంది." అంటూ ఇందిర వెంకటాద్రిగార్ని మందలించి, బల్లపైద పక్క అమర్చింది. ఆయన దగ్గు ఆపుకుంటూ వెళ్ళి పడుకున్నాడు.

"మరి నువ్వో?"

"ఈ గదిలో మంచం వుంది లెండి" అన్నాడు నిధి. ఇందిర అవులించి, గదిలోకి నడిచి మంచంమీద కూర్చుంది. గదగుమ్మం అవతల,

దయానిధి, మడతమంచం వాల్చుకుని, దానిమీద పోదింకు వడేసి గదిలో పడక కుర్చీమీద కూర్చుని, దీపం పెద్దది చేసి, చదవడం సాగించాడు.

"మీరే యీమంచంమీద పడుకోండి— నేనక్కడ పడుకుంటా" అంటూ ఇందిర లేచింది.

"ఫరవాలేదు, నువ్వు పడుకో మళ్ళా ప్రొద్దున్నే లేవాలి" అన్నాడు.

ఇందిర తన మంచం మీద పరుపు, దుప్పటి, మడత మంచం మీదికి వేస్తూ—"మీరు మాతో రారా?" అని అడిగింది.

"దేనికోసం రాను?"

"అవును లెండి మీ రెందు కొస్తారు!"

పక్కగదిలో చిలుకలు శబ్దంచేశాయి. నిధి పుస్తకం మూసి, దీపం కొంచెం తగ్గించాడు. ఇంతలో శ్యామల వొచ్చి గదిగుమ్మం ముందు నిలబడి, కళ్లు పెద్దవిచేసి, గదంతా పరకాయించి—

"ఇంకా పడుకోలేదు? నాగదిలో దీపం ఆరిపోయింది. భయమేస్తోంది" అంటూ లోపల కొచ్చి, బల్లమీద దీపం పెద్దది చేసి, "గదిలో కెడదాంరండి" అని పక్కకి తిరిగి ఇందిరని చూసి 'బాబో!' అని కేకేసి వులిక్కిపడి దీపం మళ్ళా పెద్దదిచేసి, గబగబా అవతలకి నడిచిపోయింది.

నిధి బెడ్‌రూమ్ దీపం వెలిగించి పెద్దలాంతరు తీసుకుని ఆమెని చెయ్యి పట్టుకుని ఆమెగదిలోకి తీసికెళ్ళి, పడుకోపెట్టి, మళ్ళా తన గదిలో కొచ్చాడు. ఇందిర బల్లపక్కన కిటికీ దగ్గర నిలబడివుంది.

"ఇంకా పడుకోలేదేం?" అన్నాడు.

"నిద్ర రావడం లేదు. మీరు పడుకోండి" అంది.

"నువ్వేం చేస్తావు మరి?"

"ఇల్లాగే చూస్తూ కూర్చుంటాను" అంది.

రెండు నిమిషాలు నిశ్శబ్దం. వెంకటాద్రిగారు, గుర్రుపడు[illegible]ట్లు చప్పుడు మాత్రం వినిపిస్తోంది. ఇందిర గుమ్మంలోకి వెళ్ళి రెండు తలుపులూ దగ్గరగా మూసి మళ్ళా వొచ్చి,

"ఐతే నన్ను మీరు ఎప్పుడూ తీసుకురారా?" అని అడిగింది.

"ఈ శృంగారం మీకు పెట్టింకే, ఆనాడు కాలప్రట్టుక తోటలో—ఇప్పి మరచిపోయ్యారా?"

"నేనేం దుష్యంతుణ్ణి కాదు." అన్నాడు. ఇందిర బలహీనంగా నవ్వింది.

"అప్పను లెండి—మీకు నే కెందుకు యింక!"

"అంటె?"

"మీకొక్కవల్సినవాళ్లు మీదగ్గరే వున్నారు."

"నువ్వనేది ఏమిటి? మీబాబయ్య రైల్లో ట్రైనింగ్ యిచ్చాడా యిల్లా అనమని?"

"మా బాబయ్య జోలెందుకు లెండి. నాకు దేవుడు కళ్ళిచ్చాడు."

నిధి నవ్వాడు.

"ఆవిడ నా పేషెంటు, చిత్రమైన కథ. అంతేనా నీ అనుమానం? ఇంకా ఏమన్నా వుందా?"

"డాక్టర్ని చీకటి గదిలోకి రమ్మనే పేషెంటు. మరో పాత పేషంటుకూడా వొస్తోందిగా...."

"నాకు కోపం రావాలనా, లేక నవ్వించాలనా?"

"డాక్టరు దగ్గర డబ్బు పుచ్చుకునే పేషంటు."

"ఈ బల్లమీద వుత్తరం చదివావా?" అన్నాడు.

"ఏం తప్పా?"

"తప్పే."

"ఈ వుత్తరం చదివితేనే తెలియనక్కరలేదు. పెళ్ళిలోనే చెప్పగున్నారు, వింతగా ...."

"నోరు మూసుగుని పడుకుంటావా?"

"ఏమిటో చెప్పగున్నారు — నాగమణీ, సుశీలా అంటూ. నేను నమ్మలేను. మీ తమ్ముగారూ యింతేటగా?"

నిధి అవతలకి వెళ్లిపోయి, వీధులో అరుగుకింద మెట్లమీద కూర్చున్నాడు. దూరంగా ముస్లిమ్ కుర్రాడు 'ఏదీ గతి [illegible]' పాడుకుంటూ పోతున్నాడు. నిధికి విచారం వేసింది. తనమీద జాలే

సింది. బ్రతికినప్పుడే కాకుండా. మరణించిన తర్వాత కూడా, ఆడ వాళ్లు పురుషుల్ని పీడించడం ఎందుకో అనుకున్నాడు. సహించటం ఆడవాళ్ల వంతు; బాధపడటం మొగాడి వంతు.

తానెప్పుడు మెట్లమీదే పడుకున్నాడు. తానెప్పుడు లోపలి కెళ్ళి, మడత మంచంమీద పడుకున్నాడు. తానెప్పుడు కుర్చీలో కూర్చున్నాడు. తానెప్పుడు రోడ్డుమీదకి వెళ్ళి వంతెన మీద కూర్చున్నాడు. ఎల్లాగో తెల్లవారింది. వెంకటాద్రిగారు లేచి, దంతధావనం మొదలెట్టాడు. జట్కాబండి వొచ్చింది. ఇందిర మెట్లమీద నిలబడింది.

"మాతో రండి."

"మీ నాన్న చేతకూడా మాటలనిపిస్తావా?"

"క్షమించండి. ఎప్పుడూ అనను."

"అనడంలో బాధలేదు నాకు; అసలు నువ్వు వాటిని నమ్మి అనుకోడంలో వుంది"

"ఇంక అనుకోను వస్తారా?"

"ఏ మొహంతో."

వెంకటాద్రిగారు బండి ఎక్కమని తొందర చేస్తున్నాడు శ్యామల కూడా లేచి హాల్లో నిలబడి చూస్తోంది. ఇందిర ఆమెకేసి పరకాయించి చూసింది.

"నే నిక్కడే వుంటాను; బాబయ్యా. నువ్వు వెళ్ల కూడదు?" అంది ఇందిర.

"మీనాన్న నాపిక్కి పురెడతాడు. ఎక్కు, కావాలంటే తరవాత వొద్దువుకాని."

ఇందిర బండెక్కింది. బండి కదిలింది.

దయానిధి గదిలో కూర్చుని కళ్లు మూసుకున్నాడు, ఎనిమిదింటికి రామదాసు లేచాడు. స్నానం చేసి, కాఫీ తాగి హాల్లోకి రాగానే శ్యామల అతన్ని తన గదిలోకి ఆహ్వానించింది. రాత్రి తను చూసిన దృశ్యం జ్ఞాపకం చేసి ఆవిడ ఎవరో, ఎందుకొచ్చిందో అన్నీ చెప్పమంది. నిధి అన్నింటికీ సమాధానం చెప్పాడు. శ్యామల వ్యాధి కుదురుతోందనీ, అతని చికిత్స పని చేస్తోందనీ అనిపించినా, ఆమెను మామూలు మనిషిగా చెయ్యగలనన్న ధైర్యం అతనికి చిక్కడంలేదు.

అతని జీవితమే సరిగ్గా లేదు: అతనికి తెలియని లోటుపాట్లు అతనిలో ఎన్ని వున్నాయోనన్న భయంవల్ల అతను పసినీ దీక్షతో నిర్వహించలేక పోతున్నాడేమో. అతని మనస్సుని కుదిట పర్చుకోవడం చేత కావడం లేదు. ఇతరులని బాగుచేసే అధికారం, డిగ్రీద్వారా అతనికి వుంది, కాని నైతికంగా అట్లాంటి అర్హత లేదేమో!

"తెల వార్లూ చిలకలు దెబ్బలాడుకున్నాయ్-నాకు నిద్ర పట్టలేదు" అంది శ్యామల.

"కలిసి వుంటే, అవీ మనలాగే విడివిడిగా వుంటాయి" అన్నాడు.

"ఈ సంఘం పాడువడిపోయిన దేవాలయం లాంటిది. మన మందరమూ అందులో స్తంభాలం; ఎప్పుడూ కలుసుకోవు. చిలకలు పంజరంలోనూ, మనం స్వార్థం అనే కోటలోనూ బంధించబడ్డాం-"

శ్యామల ఆశ్చర్యంతో కళ్లు పెద్దవిచేసి, నుదురు చిట్లించింది. దయానిధిక తను ఇల్లా ఎందుకు మాట్లాడాడో అర్థం కాలేదు, విగ్గరగా ఆలోచించడం కాబోలు, ఆలోచించడం కూడా కాదు! నిజంగా అనుభవిస్తున్న బాధని ప్రకటించడానికి, బుద్ధిచేసే యత్నమే ఆ మాటలు.

శ్యామల తన బొమ్మలని చూడమంది, చేతి గాజులు చూపించింది. వాటిని పూలతో జంటలుగా కట్టి కదిలించింది.

"మీ కళ్ళు వాచాయి; మొహం బరువెక్కింది పాపం తెల్లవార్లూ నిద్రపోలేదనుకుంటా" అంటూ శ్యామల, అతన్ని ఓదార్చడం మొదలెట్టింది. పేషెంటు లక్షణాలు తవకే వొచ్చేటట్లున్నా యనుకున నిధి లేచాడు.

"కూర్చోండి—మీ రివాళ అదోలా మాట్లాడుతున్నారు."

"వొచ్చినప్పుడుకంటె ఇప్పుడు నీ వొంట్లో బాగుంటోందా?"

"ఓ—నాకే. తెగుల్లు—?"

"బొమ్మలాయి వెళ్తావా?"

"వెళ్ళను."

"ఏం?"

"ఏమో—

శ్యామల డిగులుగా కుర్చీలో కూర్చుని ఎందుకో ఏడ్వ మొద లెట్టింది. అతనికి అర్థం కాలేదు. భుజం మీద చెయ్యి వేశాడు. కళ్ళ మ్మట కారే నీటిని తుడుస్తున్నాడు. ఏదో చప్పుడైతే పక్కకి తిరిగి చూచాడు. గుమ్మంలో ప్రకాశరావు నిలబడి వున్నాడు.

నిధిని ప్రకాశరావు ముందు గదిలోకి తీసుకెళ్ళాడు.

"శ్యామల్ని తీసుకెళుతున్నాను."

"చాలా భాగం నయమైంది. ఇంకో రెండు నారాలుంచ కూడదు?"

"క్షమించాలి, ఆ జబ్బు యిక్కడ కుదరదని తోస్తోంది."

"మీకు మార్పు కనపడటం లేదు?"

"ఏం మార్పో—నాకేమి నచ్చడం లేదు."

"అంటే-మీలోపల ఏదో వున్నట్లుంది. చెప్పవేస్తే సంతోషిస్తా."

ప్రకాశరావు, గోడలకేసి మొహం తిప్పి, నణగడం మొద లెట్టాడు, "నాకు చెప్పడం యిష్టం లేదు. ఊళ్ళో పదిమందీ అనుకు న్నది నేను నమ్మకపోయినా, వాళ్ళు అనుకోడం నాకిష్టం లేదు" అన్నాడు,

నిధికి కోపం వచ్చింది.

"ఇదిగో ప్రకాశరావు, నువ్వు చదువుకున్న వాడవు. శ్యామల జబ్బుని గురించి నీకంతా చెప్పాను. ఒప్పుకున్నావు. శ్యామలలో కొంత మార్పు కూడా వొచ్చినట్లుంది. శ్యామల కిప్పుడు సౌందర్యం అర్థమవుతోంది. కోల్పోయిన బాంధవ్యం మళ్ళా నెలకొల్పు కుంటోంది. బాధ పడుతున్న చైతన్యం చూపుతోంది. తుదకి సాను భూతి కూడా చూపగల్గుతోంది. మనుషుల శాంతికి సానుభూతి నిద ర్శనం. ఆ సానుభూతి ఎట్లాంటిదో నీకు చెప్పాలంటే నా స్వీయ చరిత్ర చెప్పాలి. అది చాలా కష్టం..."

"చెప్పటం దేనికి? కొంతవరకూ తెలుస్తూనే వుంది."

"మీరంటున్న దేమిటి?"

''అప్పటితో నాకు వాదం ఎందుకు,—శ్యామల్ని తీసుకు వెళ్తాను.''

''తక్షణం తీసుకు వెళ్లండి ''

''నేనూ పెద్దగా కేక వెయ్యగల్ను. ఐనా బ్రహ్మచారి దగ్గర అప్పు పెట్టడం, నాదే తప్పు.'' అన్నాడు ప్రకాశరావు.

అతన్ని లెంపకాయ కొట్టడానికి నిధి చెయ్యి లేవబోయింది. ఆ చేతిని తీసి- డ్రాయర్లో పెట్టి, ఎడంచేత్తో మూశాడు.

ప్రకాశరావు గబగబా గదిలో కెళ్ళి, శ్యామల్ని చెయ్యి పట్టుకుని బైటికి యీడ్చుకొచ్చాడు.

''నేను రాను, రాను'' అంటూ శ్యామల చెయ్యి విదిలించుకుని దొడ్లోకి పరుగెత్తి కాసేపు మట్టిలో దొర్లి వొళ్ళంతా బురద చేసుకుంటోంది. ప్రకాశరావు వెంటపడి ఆమెని మళ్ళా పట్టుగుని బైటికి తీసుకొచ్చాడు.

అతని తాలూకు మనుషులు బండి తీసుకొచ్చారు.

''నేను రాను రాను-'' అని శ్యామల గెంజుకుంది.

''ఎందు కొస్తావు? అన్నీ యిక్కడ ఏర్పాటుగా వున్నాయి'' అని ప్రకాశరావు ఆమెని బైటకు తీసుకెళ్ళాడు.

నిధి పళ్లు పట పట కొరుకుతూ, అతనికేసి కోపంగా చూశాడు. కాని అసహాయుడు.

శ్యామల వెనక్కి తిరిగి ''నా పంజరం'' అంది.

''నీ క్కావల్సింది, పంజరమా, చిలకా?'' అని అడిగాడు నిధి.

శ్యామల కాసేపు ఆలోచించి, అటూ ఇటూ చూసి, ''పంజరం'' అన్నది.

వెంటనే నిధి పంజరాన్ని తీసుకొచ్చి, తలుపు తెరిచాడు; రెండు చిలకలు బైటికి ఎగిరి పోయ్యాయి. మూడోది కుంటుతోంది; ఎగర లేక, అక్కడే గంతులేస్తోంది. ఖాళీ పంజరం శ్యామల కిచ్చాడు నిధి. దాన్ని గట్టిగా పట్టుగుని శ్యామల బండెక్కింది. బండి కదిలింది. మలుపు తిరుగుతోంది. బండిలోనుంచి రోడ్డుమీదకి ఎవరో పంజరాన్ని గిరవా పెట్టారు.

# స్వయం సంస్కారం

రెండు మాసాలు గడిచినై. నిధి వేషంట్లు పల్చబడుతున్నాడు. ప్రాక్టీస్ నీరసించింది. శ్యామల కోసం అతను నాలుగైదొందలు ఖర్చుచేశాడు. అందులో కానీ కూడా ప్రకాశరావు ఇవ్వలేదు. అతను మళ్ళా యితనిదగ్గరకు రాలేదు. ఎప్పుడేనా క్లబ్బులో పేకాట బల్లదగ్గర కనబడినప్పుడు మొహం పక్కకి తిప్పేసుకుంటాడు. వెనక ప్రకాశరావు అన్నమాటలను నిధి మరిచిపోలేక పోతున్నాడు. వాటి నిజాలు కొంతవరకూ క్లబ్బుదగ్గర రుజువవుతున్నాయి. ఇతను రాగానే: అంతవరకు హుషార్‌గా మాట్లాడుకున్న వ్యక్తులు వెంటనే జోరు తగ్గించి, మెల్లగా మాట్లాడడం మొదలెడతారు. వాళ్లు అంతవరకూ తన విషయమే మాట్లాడుకుంటున్నారనీ తన్ని చూడగానే విషయం మార్చేస్తున్నారనీ యితని అనుమానం.

వారు చెప్పుకునే రహస్యాలేమిటో తెలుసుకోలేకపోతే అతనికి పిచ్చెక్కేటట్లుగా వుంది. సంఘం ఏమనుకుంటున్నదీ నాకక్కర్లేదనుకునే వ్యక్తి సంఘం దాచుకున్న రహస్యాన్ని భేదించే యత్నాలెందుకు చేస్తాడో. ఒకే వ్యక్తి బాధపడుతుంటే సంఘానికి సరదా కాబోలు. సంఘం వేసిన తారు రోడ్డుమ్మట నడవక బాదల్లోంచి వేరే కాలిమార్గం చేసుకుని నడిచే వ్యక్తి సంఘాని కంత వినోదం కలిగించినప్పుడు, ఆ వ్యక్తికి సంఘం తన ప్రాజ్ఞత, తెలియపరుస్తూ, ఆయనకొక ప్రాతి శిల్పం చెక్కించి నడిరోడ్డులో ప్రదర్శించొద్దూ? అతన్ని [illegible] అనుకుంటున్నారన్న [illegible] గర్వంలేక పోతేను. మంచో, చెడో ఏదో చెయ్యడంలో ఓటమిలేదు. ఏమి చెయ్యకపోవడంలో వుంది ఓటమి. సంఘం ఏమి చెయ్యదు. ఆఫీసు కెడుతుంది, భోజనం చేస్తుంది, పేకాడుతుంది, పిల్లల్ని కంటుంది. ఎవడో

...గా చూసి, అది చెడేనని నిర్ణయించి, ఆ చెడు ...లో పొంది తృప్తి పడుతుంది.

...కాను,'' ... సంఘం తనలో దేన్ని చూసి సంతోషిస్తుంది—మంచినా, ...గునా? అసలు అతనిలో మంచి ఏముంది? డబ్బు, హోదా, కుటుంబం, వృత్తిలో ప్రావీణ్యం. ఖ్యాతి, — వీటిలో ఏం వున్నాయి అతనికి. పోనీ చెడుగునా? చెడుగంటే ఏమిటి? డబ్బు, హోదా, కుటుంబం వృత్తిలో ప్రావీణ్యం. ఖ్యాతి—యివి లేకపోవడమే చెడుగా? ఇవి లేకపోవడానికి కారణం అతనిలో ఏదో వుందని సంఘం తెలుసుకుంది. అదే చెడుగు, అది ఏమిటో: ఎట్లాంటిదో తెలుసుకోవాలి ఎట్లా? సంఘం చెప్పదు, సంఘం ధ్వనులు చేస్తుంది కాని, అర్థమయ్యే భాష మాట్లాడదు. సంఘం తీర్పు చెప్పదు; వూరికే వాదిస్తూ కూర్చుంటుంది. ఆ వ్యక్తిని మధ్య నిలబెట్టి, అతనిచుట్టూ అలుముకొని, సంఘం చూస్తూ కూర్చుంటుంది.

నిధికి క్లబ్బులో వున్న స్నేహితులు కూడా, అదోలా మాట్లాడడం మొదలెట్టారు, శ్యామలను గురించి హేళన చెయ్యడం సాగించారు. శ్యామల వ్యాధిని గురించిన అతని అభిప్రాయాలని వెక్కిరించారు. అప్పుడప్పుడు, 'బ్యూటీ స్పెషలిస్ట్' అనేవారు. ఒకసారి సంగమేశ్వరరావు, డాక్టర్ బ్యూటిఫుల్ అని పిలిచాడు కూడాను. ఆ పిలుపుకి నిధి వెనక్కి తిరిగాడు, అతని పేరు అది కాదు. ఐతే తను ఎందుకు పలకాలి? కొన్ని వారాలు, స్నేహితులు ఇందిర విషయం ముచ్చటించేవారు. ఒకసారి నిధి క్లబ్బు కుర్రాణ్ణి, చదువుకోడానికి ఇండియా అనే పత్రిక తెచ్చిపెట్టమన్నాడు. వాడు తెచ్చాడు, దానిమీద 'ఇండియా' అనే మాటలో, ఎవరో (రెండో) 'ఐ' అనె అక్షరం పక్కనే సిరాతో 'ఆర్' అనే అక్షరం వ్రాశారు. ఒకసారి తను వెళ్ళి, భార్యను తీసుకొద్దామనుకున్నాడు కూడాను. సంఘం (క్లబ్బు ద్వారా) వేసే బాణాల పరంపరా? లేక మాధవయ్య గారి ఆదర్శాల విషవాయువులా? ఏది ఎదుర్కోటం సులభం? బాణాల పరంపరనే ఎదుర్కోటం సులభంగా తోచింది. ... ఏవొక వ్యక్తి వెయ్యడు. అవి అన్నివైపులనుంచీ తగుల్తాయి. కొట్టినవారిని కనుక్కోలేం, ఎదురు తిరిగేటందుకు. కాని మాధవ

వయ్యగారు వొక మనిషి. ఆయన ఆదర్శాల పునాదులు అతనికి తెలుసు. అవి ఎంతవరకూ వ్యాపించాయో కూడా అతనికి తెలుసు—వాటి వారినుండి అతను తప్పించుకోవచ్చు. పైగా సంఘం ఎక్కడుంది? ఏలూరు టౌన్ హాల్ సంఘమా? అనంత విశ్వంలో యీ ప్రపంచం ఎంతటిది? ఢిల్లీలో వొక యిసుక కణం యీ భూగోళం అయితే, కొలంబోలో మరో యిసుకకణం మరోగోళం అవుతుంది. అంతటి అల్పమైన యీ గోళంలో ఏలూరు టౌన్ హాలెంత? భూగోళ శాస్త్రం యీవిధంగా యిచ్చే తృప్తి. తసీకం. ఏలూరు టౌన్ హాలు చాలా చిన్నదే, కాని ఎక్కడికెళ్ళినా అదే తన వెనకాలే వొచ్చే నీడలాంటిది. సంఘంలో పుడవబ్బకున్న వాడు, సంఘాన్ని తప్పించుకు తిరగలేడు. పోనీ క్లబ్బుకి వెళ్ళడం మానేస్తే? తన పేషంట్లు సంఘంలో వాళ్ళే; వాళ్ళు రావడం మానుకున్నారు. ఏలూరునుంచి వెళ్ళిపోయి, మరోచోట ప్రాక్టీస్ పెడితే? తనని ఎరుగున్నవాళ్ళు, ఆ ప్రదేశమంతటా వున్నారు. అతను చేసిన ద్రోహం ఏమిటి? అతను ఎరుగున్న తాలి నందరినీ చంపడమేనా గత్యంతరం? ఈ ఆలోచనలని త్రొక్కిపెట్టేసుకుని హాస్పిటల్ కి వొచ్చేశాడు నిధి. జీతాలిచ్చి యిదరి శాంపొందర్లని భరించే స్థితిలో లేడు. ఒకర్ని మానిపించాలి. ఎవర్ని? రామదాసు ముందు జేరాడు; తెలివైనవాడు. రోజ్ స్త్రీ; వీదది. తన విషయం తెలుసున్నది.

టౌన్ హాల్ తేనెపట్టులా మళ్ళా చెలరేగుతుంది.

రోజ్ జీతం లేకపోయినా, తిండీ, బట్టా యిస్తే వుంటానంది. జీతం లేకపోతే వుండలేనని రామదాసు తనే మానేశాడు.

ఆ మొన్నాడు, దయానిధి టెన్నిస్ ఆడి, సోఫా తాగి కూర్చున్నాడు. ఈసారి కూడా టెన్నిస్‌లో కృష్ణమూర్తే గెలిచాడు. కృష్ణమూర్తి లక్నో విశ్వవిద్యాలయంలో ఎం. ఎ. ఎల్ ఎల్. బి. డిగ్రీ పొందాడు; స్థితిమంతుడు; కులాసా పురుషుడు; క్లబ్బు స్నేహితులూ అతన్ని వేళాకోళం చేస్తుంటారు. అతనికి కోపం రాదు; నవ్వేసి మళ్ళా కొంటెగా మాట్లాడటం సాగిస్తాడు. అతను ఏవూళ్లో ప్రాక్టీస్ పెడతాడో అన్నది, అందరికీ వొక సమస్య అయిపోయింది.

టెన్నిస్ సెట్ గెల్చిన సంతోషంలో అతనే సమాధానం చెప్పేశాడు.
"నేను పూనాలో ప్రాక్టీస్ చేదుతున్నానండి" అని తెలియజేశాడు.

"ఏం కథ? మొన్న ఆదివారం మద్రాసులో వచ్చావ్?" అని అడిగాడు.

"ఏముందండీ, ఆ మాత్రం వూహించలేరూ?"

ఊహించలేమన్నారు.

"పూనాలో అందమైన స్త్రీ లున్నారు" అన్నాడు. అంతా పకపకబడి నవ్వారు.

అందమైన స్త్రీలు బొంబాయి, మద్రాసు పట్నాలలో మాత్రం లేరా అని ప్రశ్నరడగొచ్చు. ఉండవచ్చు; వున్నారు కూడా. వుండగా వరికాదు, అందుబాటులో వుండాలి." అని వుపన్యాసం ధోరణిలో సాగించాడు.

ఆ విషయం విస్తరించి, విపులీకరించమన్నారు.

"పూనాలో గరల్సు, ఫార్ వర్డ్—సైకిల్ మీద వెడుతుంటారు. మధ్యలో అందరగా నడుస్తున్న యంగ్ మేన్ కనబడితే, సైకిల్ నిలిపి, వెనకాల ఆ యంగ్ మాన్ ని ఎక్కించుగుని పోతుంటారు.

హైలీ డెవలప్ డ్ సివిక్ సెన్సు వుంది. ఇక్కడ నిధి బోటి గర్ల్ కి. పూనాలో ఫస్టు రేటు ఆపరుట్యూనిటీస్ వున్నాయి, లాయర్ల కైబిలిటీస్ చాలా లిమిటెడ్."

పేకాట బృందం చప్పట్లు కొట్టారు. నిధి చిరాకుతో కుర్చీలో కదిలి, బలవంతంగా నవ్వాడు. నిధి లేచి దూరంగా బల్ల దగ్గర కెళ్ళి పత్రికలు తిరగేస్తున్నాడు.

కృష్ణమూర్తి కేబులోంచి దువ్వెన తీసి, సోడా నీళ్లు నెత్తిన జల్లుకుని, జుట్టు వెనక్కి దువ్వి అటూ యిటూ పచార్లుచేసి ఓ గులాబి పువ్వుని కోసుకొచ్చి వాసన చూస్తూ నిధి దగ్గర కొచ్చి—"డాక్టర్, స్మెల్ ది రోజ్, రోజ్ చాలా అందమైన పువ్వు సుమండీ" అంటూ ఆ గులాబీని అతని కిచ్చాడు.

నిధికి కోపం వచ్చింది. ఇందులో కాంపౌండర్ గా వుంటున్న

రోజ్‌ని వేళాకోళం చేసినట్లనిపించింది. "రోజ్ బాగానే వుంటుంది కాని ముళ్లుంటాయి" అన్నాడు సిధి.

"దానందం ముండ్లే. ముల్లు గుచ్చుకోకుండా, కొయ్యటంలో వుంది అసలందం" అన్నాడు కృష్ణమూర్తి.

"ఐతే డాక్టర్‌జీ, లేడీ శ్యామల ఎట్లా ప్రోగ్రెస్ అవుతోంది?" అని అడిగాడు.

"శ్యామల్ని నేను ట్రీట్ చెయ్యడం లేదు" అన్నాడు సిధి.

"అదేమిటండీ, మీ ట్రీట్‌మెంట్ గురించి విన్నాను. నాకు నచ్చింది మనవాళ్లు ఫూల్సండి. శ్యామల కేస్ గురించి నాకు వినాలని వుంది" అన్నాడు కృష్ణమూర్తి.

"నా డయాగ్నోసిస్ సరియైనదేనని నాకు తెలుసు, కాని యితరులకి, డాక్టర్లకి దాని నిజానిజాలని రుజువు చెయ్యలేను. అదే వొచ్చిన చిక్కు. చాలా కేసులు పరిశోధించి, నయం చేసి, తరవాత వొక పేపర్ వ్రాయొచ్చు, అప్పుడే శ్యామల కేస్ మీద వో పేపర్ వ్రాయటం మొదలెట్టా కూడా. ఆకలి, దాహం, సెక్సు— వీట్లకి మల్లే సౌందర్యం కూడా వొక ఆకలే అనుకుంటాను. ఐ. ఏ. రిచార్డ్స్, వాట్‌సన్, డాక్టర్ జాన్‌సన్‌లు, అగ్‌డెన్ యిది నిజమనడానికి ఆధారాలున్నాయని నిర్ధారణ చేశారు. మీకు విసుగెట్టకపోతే వాళ్లు చెప్పిన వుదాహరణలని చెబుతాను...."

"తప్పకుండా— చెప్పండి— వుండండి, మరో సిగరెట్ ముట్టించనివ్వండి..."

"ఉండీ వుండీ వొక్కసారిగా, కోపం రావడానికి కారణం? ఆకస్మికంగా చిరాకొచ్చి; భార్యతో తగవులాడడం, పిల్లల్ని కొట్టడం దీనికి కారణం ఏమిటి? ఇల్లు చిందర వందరగా వుండటం, తలుపులు గడియ పడకపోవడం, రాకపోవడం గోడమీద పటం వొంకరగా వేలాడటం - కొన్ని ఇవి. భర్త పొడుగాటి గోళ్లు పెంచుకున్నాడని [illegible] ఇచ్చిన అమెరికన్ స్త్రీని గురించి విన్నారా? పతివ్రతగా వుంటున్న స్త్రీ వొక్కసారిగా చాంచల్యం కనబరచడానికి కారణం కొంతవరకూ భర్త ఏరోజుకు ఆ రోజు గడ్డం చేసుకోకపోవడమే అంటే ఎవరేనా నమ్ముతారా! ఇవన్నీ అల్పమైన విషయాలే. ఇంత

కంటే పెద్దని కూడా వున్నాయి. మూఢనమ్మకంతో మగ్గిపోయిన వాతావరణం, మనస్సుని విభజన చేస్తుంది. ఆచారం దాస్యాన్నీ. వ్యక్తిత్వం స్వాతంత్ర్యాన్నీ పురిగొల్పుతాయి. అత్త-మామ. బంధువులు యిరుగు పొరుగు, దేవుడూ దయ్యం-యివి ఆచారాన్ని సూచిస్తాయి. ఇంగ్లీషు చదువున్న భర్తసంపర్కం, పట్నాలలో నాగరికత-యివి వ్యక్తిత్వాన్ని సూచిస్తాయి. ఈ రెండింటికీ రాత్రి, పగలూ యుద్ధం జరుగుతుంటుంది.

వ్యక్తిత్వం వోడిపోతే వ్యాధి సంక్రమిస్తుంది. మన దేశంలో నూటికి తొంభై మంది స్త్రీలకి ప్రకృతితో సంబంధం వుంది. చెట్లు, నేల, ఆకాశం, చెరువులు అనాదినుంచీ వొస్తున్న సంప్రదాయం. వీటితో చెలిమి చేసిన వారిలో నూటికి పదిమందికి భర్తలతో బస్తీలకి ఎగబడగానే ఆ సంబంధం పోయింది. చెట్లు చంద్రుడు, ఆకాశం, చెరువులు. సంప్రదాయం-వీటికి బదులు తారు,పొగ,నీళ్లురానికుళాయి, రొద — వీటితో చెలిమి చేసుకోడం చేతకాక, మతులు పోగొట్టుకుంటారు అట్లాగే, సెక్సు జీవితంలో విభజన లుంటాయి. భర్తని దైవంగా పూజించటం నేర్చుకున్న స్త్రీ. భర్త తనని వేశ్యగా వుండమని వేధించుకు తింటే, ఏం చేస్తుంది? సంపూర్ణ జీవితం స్వేచ్ఛా ప్రకటన భర్త కోరతాడు. రాత్రి పగలు మళ్ళా సంప్రదాయం చావరికం, గుట్టు, నటన; ఈ రెంటికీ పొసగదు. మానసిక వ్యాధి రాక తప్పదు, ఈ దేశంలో నూటికి తొంభై స్త్రీల జబ్బులు, మానసిక జబ్బులే—''

"బాగానే వుంది. ఐతే దీనికి మందేమిటో?''

''రాత్రికి, పగటికీ మధ్య వుండే లోయని మరుగు పరచడం,''

"అంటే?"

"ఈ వ్యాధి కేవలం డాక్టర్లవల్ల నయం కాదు. ప్రతి డాక్టరూ, మానసిక శాస్త్రంలో ప్రావీణ్యం పొందినా ఎక్కువ వుపయోగపడదు. సంఘం తనకేది కావాలో నిర్ణయించుకోవాలి. సంప్రదాయం నేర్పిన అసంపూర్ణ జీవనమా? వ్యక్తిత్వం, అధునిక విజ్ఞానం ప్రబోధించిన స్వేచ్ఛా జీవనమా? అల్పమైన ఆదర్శాలను ఆచరణలో పెట్టుకోవడమా? అనాచరణీయమైన వున్నత ఆదర్శాలకి

నోటితో కృతజ్ఞత వెలిబుచ్చుతూ రహస్యంగా చెడిపోడమా? ఎవరికి వారే నిర్ణయించుకోవాలి. ప్రస్తుతం మన దేశం. పగలు మంచిగా వుండి రాత్రి చెడిపోతోంది. పగలు కూడా చెడిపోవడం 'నవీనత్వం' అనిపించుకుంటోంది. రాత్రి కూడా బాగుండటం పూర్వాచార పరాయణత్వం అవుతోంది. అనుభవంలో రుజువైనప్పుడు చెడ్డతనాన్నే మంచితనంగా సమర్థించుకుని, అందరికీ అందుబాటులో వుండే ఆదర్శాలని ప్రచారంచేసి పగలూ రాత్రీ వొకేలా ప్రవర్తించడం మంచిదని నా అభిప్రాయం—'?

"మంచి ఆదర్శం అంటే ఏమిటండీ!''

"ఒక రకం ప్రవర్తన. నీతా దుర్నీతా అని అడగకూడదు. అది అనుచరణీయమా, పరిపూర్ణ జీవనానికి తోడ్పడుతుందా. మొత్తం మీద చాలా మందికి సంతోషాన్ని, ఆరోగ్యాన్ని యిస్తుందా అని ప్రశ్నించాలి' అన్నాడు నిధి

''ఈ ప్రశ్నలకి అవునన్న సమాధానం వొస్తే దాన్నే నీతి అంటున్నారు. అంచేత మీరు చెప్పిన వాటికి అందరూ అనుకునే నీతికి భేదం ఏముందండీ?" అని అడిగాడు కృష్ణమూర్తి.

"భేదం చాలా వుంది. నేడు మన సంఘం ఆమోదిస్తున్న నీతిని ప్రతిపాదించినవారు విచిత్రమైన గతించిపోయిన వాతావరణంలో వున్నారు. ఈ నీతి, మత సిద్ధాంతాలపైనా సంఘంతో నిమిత్తం వొదులుకున్న కొద్దిమంది ఋషుల వేదాంత ఘోషపైనా ఆధారపడి వుంది. ఇది తప్పు అనే సాహసం నాకు లేదు. ఇది మనకు సరిపడదూ అనగలను. దానికి కారణం యీ నీతి మనం ఆచరణలో పెట్టలేక పోవడమే. పైగా యీ నీతి మనకి మోక్షం యివ్వడానికి వుద్దేశింపబడింది కాని యీ లోకంలో వున్న సంతోషాన్నివ్వడానికి వుద్దేశింపబడింది కాదు. మోక్షం యిస్తుందో లేదో ఎవ్వరూ చెప్పలేరు. ఎందుకంటే రుజువు చేసినవారు లేరు."

"ఐతే యిష్టం వచ్చినట్లు తిరిగి సంతోషంగా వుండడం మీ నీతి అన్నమాట.'' అన్నాడు కృష్ణమూర్తి.

''నా అభిప్రాయాలని చులకన చెయ్యడం చాలా సులభం. కాని వాటిని ఆచరణలో పెట్టడానికి ఎంతో ధైర్యమూ, శక్తి

సామర్థ్యాలూ వుండాలి. ఎంతో విజ్ఞానం, సంస్కారం కావాలి, ఇతరుల్ని పొందే అవకాశాలు లేక మన సంఘంలో మనుషులు బద్ధ ... భిన్నశాఖలలోనే సృష్టిపడి మోసం పేరు చెప్పుకుని యీ ప్రపంచాన్ని జీవితాన్ని వొక జాడ్యంగా వొక పీడకలలాగా భావిస్తూ ఎల్లాగో రోజులు గడుపుతున్నారు. అందుచేతే మన సంఘం అభివృద్ధి చెందటం లేదు. మనం ఆధ్యాత్మిక విలువల పేరూ, వేదాంతం పేరూ, దైవం పేరూ, మతం పేరు చెప్పుకుంటూ, మనుషుల మాట మరిచి పోతున్నాం—"

"నిధిగారూ! మళ్ళా వేదాంతంలోకి కొట్టుకుపోతున్నారు" అన్నాడు కృష్ణమూర్తి.

"వేదాంతం అంటే, మన వుద్దేశం, ఎవరికీ జీవితంలో నిమిత్తం లేని పండితుల పుస్తకం అని. నిజానికి వేదాంతం అనేది, 'మనం నిత్యం జీవితంలో బ్రతకడం ఎట్లా' అన్న ప్రశ్నకి అందరికి అన్వయించే సమాధానమే. నా యిల్లు నేచక్కబెట్టుకోడం స్వార్థం. అందరిళ్లూ నా యింటిలాగే చక్కబెడతాను; అనడం రాజకీయ వేత్తల పని. అదే వేదాంతం కూడాను..." అన్నాడు నిధి

కృష్ణమూర్తి, థాంక్స్, అంటూ లేచి వెళ్ళి, పేకాట బల్లదగ్గర చేరి పోకర్ జటలో మునిగిపొయ్యాడు.

నాలుగు మాసాలు గడిచినై. దయానిధి రెండెకరాల భూమి అమ్మివేశాడు. ఇంటి ఖర్చు తగ్గించాడు. తోటమాలి పని మానుకున్నాడు. ఊళ్లోకి సైకిల్ మీదే వెళుతున్నాడు. నెలకి వొందకూడా రావడంలేదు. డబ్బిచ్చుకోలేని రోగులని డిస్పెన్సరీలో పెట్టుకుని వుచితంగా మందులిస్తున్నాడు. డబ్బంతా ఖర్చయిపోతోంది. చాలడం లేదు మెడికల్ జర్నల్ తెప్పించడం మానుకున్నాడు. ఇప్పుడు తనేదైనా వ్యాసం రాస్తేనే వొకాపీ వొస్తుంది నాలుగు నెలలు తండ్రి డబ్బు పంపించేవాడు. మైసూరులో పక్షవాతం వొచ్చి. అకస్మాత్తుగా తండ్రి మరణించాడు. ఆ మిగిలిన ఎకరం అమ్మివేసి, అన్నగారూ తనూ కలిసీ, అంత్యక్రియలు జరిపారు. నారయ్య [illegible] నిధి దగ్గర చేరాడు.

నవంబర్ లో కలెక్టర్ గారి ఆధ్వర్యాన క్లబ్బు వార్షికోత్సవం

జరిపారు. ఆ సందర్భంలో షేక్స్పియర్ రచించిన 'హామ్లెట్' నాటకాన్నుండి కొన్ని దృశ్యాలు ప్రదర్శించారు. హామ్లెట్ పిన తండ్రి భూమిక కృష్ణమూర్తి, హామ్లెట్ భూమిక నిధి ధరించారు. క్లబ్బు జనానికి ఆ నాటకం ఆడటం యిష్టంలేదన్నారు, విషాదాంత నాటకం ఆడవల్సిన సందర్భం కాదది, కన్యాశుల్కంలో కొన్ని దృశ్యాలు, సారంగధర ఆడదామన్నారు. నిధి, హామ్లెట్కి తనే పెట్టుబడి పెడతానన్నాడు. ఆఖరికి, కన్యాశుల్కంలోంచి కొన్నీ, హామ్లెట్ లోంచి కొన్నీ దృశ్యాలు, ప్రదర్శించారు. హామ్లెట్ రక్తి కట్టలేదు. ఏవొ కరిద్దరు కాలేజీ విద్యార్థులకో తప్ప. అందులో కవిత్వం ఎవళ్ళకీ అర్థంకాలేదు. హత్య చేయబడిన హామ్లెట్ తండ్రి దయ్యంగా వొచ్చి కొడుకుతో మొరెట్టుగున్న దృశ్యం బాగుంది. కాని, ఒఫీలియాతో హామ్లెట్ సంభాషించే ఘట్టంలో, నిధి 'వోవ రాక్టు' చేశాడన్నారు.

హామ్లెట్ ఆ ఘట్టాలలో, 'వున్మాదం' నటించాడనీ, నిజంగా చైతన్యం వున్నవాడేననీ, ఆ భూమికధరించే పాశ్చాత్య నటుల నమ్మకం. ఈ నాటకం కోసం, నిధి హామ్లెట్ గురించిన విమర్శ లెన్నో చదవడం జరిగింది. ఒఫీలియాతో ప్రేమఘోష సలిపినప్పుడు, హామ్లెట్ కి నిజంగా మతిపోయిందనీ, ఆ 'వున్మాదం' నటనకాదనీ, నిధి వాదం. క్లబ్బు జనానికి యీ వాదంతో నిమిత్తం లేకపోయింది. దయానిధి హామ్లెట్ భూమిక ధరించడం నబబుగానే వుందని. "ఇప్పుడు మాకర్థమౌతోంది" అనీ గుసగుసలు ప్రారంభించారు.

1937 ఏప్రిల్ మాసం వొచ్చింది. దయానిధి ఎంతో కష్టం మీద డిస్పెన్సరీకి అద్దె యివ్వగలుగుతున్నాడు. మందు పుచ్చుగుంటున్న కొద్దిమంది పేషంట్లలో సగంమంది అతని కేమీ ఫీజివ్వరు. వాళ్ళ దగ్గ రెట్లా వొసూలు చెయ్యాలో అతనికి తెలీదు. ఇంట్లో ఏదో శుభకార్యం చెయ్యాలి. అతనేం చెయ్యగలడు? అతనికి పిల్లలులేరు, దగ్గర భార్య లేదు. గృహప్రవేశానికి యిల్లు కట్టే తాహతు లేదు, తన పుట్టినరోజు చేసుగుంటే జనం నవ్వుతారని భయం. ఆ రోగులలో సగానికి సగం, ఫీజులు యిచ్చేరకమే కాని, ఏం లాభం, యిచ్చుకోలేరు. కుర్చీలు, బీరువాలు, మంచాలు వేలం వేద్దామని తోచింది, లేకపోతే

అన్నీ చెయ్యాలి. పేషంట్ల దగ్గర బిడియపడటం ఆపు కోవాలి,
కృష్ణమూర్తి జ్ఞాపకం వచ్చాడు. ఈ మధ్య వూళ్ళో కూడా
బోర్డు పెట్టాడు. పూనాలో మెడిసిన్ చదివి రెండు రోజుల క్రితం వొచ్చా
డట కృష్ణమూర్తి డబ్బు గలవాడు కాబట్టి చదివించగలిగాడు. వాళ్ళింటికి
వెళదామనుకుంటున్నాడు ఉదయం తో నిద్రపోయింది. పోనీ సాయం
త్రం అనుకుంటే. ఇప్పుడు నిధి క్లబ్బుల మెంబరు కాడు. ఎల్లా అడ
గాలో, ఎల్లా మాట్లాడాలో, రిహార్సలు చేసుకుంటుండగా, కృష్ణమూర్తి
చక్కా వొచ్చాడు. ఇద్దరూ ముందు గదిలో వో అరగంట కూర్చు
న్నారు. తరవాత కృష్ణమూర్తి వెళ్ళిపోయ్యాడు. కృష్ణమూర్తి
అలసి పోయింటు. కృష్ణమూర్తి రక్తం సీసాలో తీసుకుని, గిండీ పంపిం
చాడు నిధి పదిరోజుల్లో రిపోర్టు వచ్చింది 'ప్లస్' గుర్తువేసి వుంది
ఆ గుర్తు బదులు, మైనస్ గుర్తు వొచ్చేవరకూ, వారానికో ఇన్
జెక్షన్ చొప్పున, కనీసం ఆరు మాసాలేనా ఇన్జెక్షను పుచ్చుకుంటే
కాని, పూర్తిగా జబ్బు నివారణైందనుకో కూడదని చెప్పాడు
అంతవరకూ అతను పెళ్ళిమాట తలపెట్టకూడదన్నాడు. కృష్ణ
మూర్తి సరేనని, వారం వారం వొస్తూ ఇన్జెక్షన్లు పుచ్చుకుంట
న్నాడు.

కృష్ణమూర్తి వైఖరిలో మార్పు రానందుకు నిధి
వస్తాడు. అప్పుడప్పుడు రోజుని కృష్ణమూర్తి వేళాకోళం చేస్తే
అతను సహించలేడు. స్వతహాగా మనిషి ధోరణే అంత. అనుభవ
మానవుడు జ్ఞానం పొందితే, పజ్యాలలో రోడ్లన్నీ వేమనలుగా అ
అతనికి మానవ ప్రకృతి అర్థం కావటంలేదు. యథార్థం తెలు
కూడదు. తెలుసుకుంటే, తట్టుకోలేం అంచేత మతం, దేవు
దయ్యం, పురాణం, వేదాంతంతో మన్ని మనం మోసగించుకో
అవసరం. అతనికి నవ్వొస్తుంది. కృష్ణమూర్తి మంచివాడు. తన్ను
తాను మోసగించుకోవచ్చు. కాని, ఇతరులని మాత్రం మోసగిం
చడు. అతన్ని గురించిన యథార్థం మరుగుపరిచేయత్నం చెయ్యడు,
కృష్ణమూర్తిలో 'పాపం' చేసిన చైతన్యం లేదు. కాని నిజంగా
పాపం చేశాడా ? కొందరు దొరికిపోతారు; కొందరు దొరకరు;
తేడా, దొరికిపోకుండా వుండడమే సంఘం అవలంబిస్తున్న

జరిహారు గా ర్తిలో పశ్చాత్తాపంలేదు. ఎందు కుండాలి? ప్రైఫా
నాటకానున్ ంచి తేరుకున్న రోగి పశ్చాత్తాప పడుతున్నాడా?
న్న జబ్బులూ చెడుగే. చెడుగుని రూపుమాపటం డాక్టర్ల విధి.
ఇది మంచి జబ్బు, యిది చెడ్డజబ్బు, అని విలువలు కట్టడం అజ్ఞానం.
సంఘం యిట్లాంటి విలువలు కట్టడంవల్లే, ధైర్యం లేనివాళ్లు ఆత్మ
హత్యకి లోబడుతున్నారు, అది చెడుగు, కృష్ణమూర్తిని చూసి జాలి
డి. 'ప్రేమించడం' మొదలెట్టాడు. కృష్ణమూర్తి ఆనందాన్నీ,
హాస్యదృష్టినీ, వుత్సాహాన్నీ యీజబ్బు లేమీ చెయ్యలేకపోయ్యాయి.
మానవుడి ఆత్మబలం అల్లాంటిది. భారాన్ని మొయ్యగల భుజబలం
వున్నవారి భుజాలపైననే భారం పడటం, సంతోషించవలసిన
విషయం.

రెండు నెలలు గడిచాయి. ఆనాడు ఆదివారం కృష్ణమూర్తి
నే క్లినిక్ కి రాలేదు. సోమవారం చూశాడు, రాలేదు. ఇట్లా
మధ్య మధ్య మానెయ్యడం ప్రమాదమని ఎన్నోసార్లు చెప్పాడు.
ఎందుకు రావడంలేదో? వాకబు చేశాడు. కృష్ణమూర్తి వూళ్ళో
లేడు. ఏవూ రెళ్లాడు?

పోస్టు బంట్రోతు వుత్తరా లిచ్చాడు. ఒకే పెళ్లితాలూకువి
రెండు శుభలేఖ లొచ్చాయి. ఒకటి కృష్ణమూర్తి, తన పెండ్లికి
వా సిన ఆహ్వానము. పెండ్లికూతురు గోవిందరావుగారి
దం త్రె, సుశీల. రెండోది, గోవిందరావు మామయ్య పంపిన శుభ
పెండ్లికొడుకు కృష్ణమూర్తి. వివాహం పదకొండు రోజు
దయానిధికి ఆశ్చర్యం వేసింది. వెఱ్ఱి ఆవేశం వొచ్చింది.
నే గోవిందరావు మామయ్యకి వుత్తరం వ్రాశాడు, పెండ్లికొడు
సుఖవ్యాధు లున్నాయనీ ప్రస్తుతం తనపేషంటనీ, వ్యాధితీవ్రత
గ్గలేదనీ, తగ్గటంయిక, ఆరుమాసాలేనా పడుతుందనీ అల్లాంటివానికి
సుశీల నిచ్చి వివాహం చెయ్యటం గొప్ప అపచారమనీ, కాబట్టి, ఏదో
విధంగా యీ పెండ్లి ఆపెయ్యవలసిందనీ-ఆ వుత్తరంలో సారాంశం.
ఏదో జ్ఞాపకం వచ్చి చివర మరో రెండు వాక్యాలు చేర్చాడు.
వివాహం నిశ్చయం కావడం, వివాహం జరగకపోవడం యిది
మొదటిసారి కాదని అందరూ ఎరుగున్నదే. సుశీల నాకు చుట్టం.

అంచేత సుశీల బాధ్యత నాకూ కొంతవరకు వుంది. డాక్టరుగా సంఘంవట్ల కూడా నాకు బాధ్యత వుంది. ఈ వివాహంవల్ల ముందు వారికి పుట్టబోయ్యే సంతానంపై, మీరు శాస్త్ర కనికరించి, తగినచర్య తీసుకుంటారని నమ్ముతున్నాను."

కృష్ణమూర్తికి కూడా వ్రాయాలనుకున్నాడు, కాని దాని వల్ల ప్రయోజనం లేదని విరమించాడు. సుశీలకి ఓ వుత్తరం వ్రాసి చించేశాడు,

రెండు రోజుల్లో గోవిందరావుగారి దగ్గరనుంచి జవా బొచ్చింది. కృష్ణమూర్తి చదువుకున్న వాడనీ, ప్రయోజకుడనీ, సుశీల అన్నివిధాలా ఇష్టపడిందనీ యవ్వనంలో వొడుదుడుకులు వాటంతట అవే సర్దుకుంటాయనీ. డాక్టర్ గా నిధిలో అంత నమ్మకం లేదనీ, తన బుల్లు ముందు తాను చక్కబెట్టుకోవడం వుత్తమం అని ఆ వుత్త రంలో సారాంశం. చివర మరో రెండు వాక్యాలున్నాయి. "మీ కుటుంబం చరిత్ర నీ పెండ్లికి ఎట్లాంటి అంతరాయం కలిగించిందో, ఆ రోజుల్లో నువ్వు ఎంత నొచ్చుగున్నావో స్మరించుకో. నువ్వు అన్నీ చూసుగుని వివాహం చేసుగుని, భార్య ద్వారా అనుభవిస్తు న్నదేమిటి? బావుకుంటున్న దేమిటి? నీ కింకా లోకజ్ఞానం లేదు. ఇట్లాంటి వ్రాతలు యిట్లాంటి ప్రచారం ముందెప్పుడూ ఎవరి దగ్గరా చెయ్యకు."

దయానిధి, దీనికి మళ్లా జవాబు వ్రాశాడు: అందులో కొన్ని వాక్యాలు: "నేను అన్ని బాధలూ పడివున్నాను గనుకనే యితరుల సౌఖ్యం కోసం యింత ప్రాకులాడటం. నాకు లోకజ్ఞానం లేక పోవొచ్చు. కాని లోకజ్ఞానం కల మీబోటి పెద్దలు కూడా, యిట్లాంటి దుర్నీతిని ఆమోదించడం నా కెంతో దిగులుగా వుంది. కూతురుకు పెండ్లిచేసి అత్తవారింటికి పంపటంతో మీ పూచీ వొదిలిపోతుంది. తరవాత వారి జీవితాలు ఏమైతే మీ కెందుకు? ఈ స్వార్థపరత్వం లోకజ్ఞానమైతే నా కిట్లాంటి జ్ఞానం లేకపోయినందుకు విచారం లేదు. ఈ పెండ్లి మాన్పించే యత్నం విరమిస్తానని మాత్రం అన్నాడు కృష్ణమూర్తికే వ్రాస్తున్నాను."

అన్నాడు కాని, ఎందుకో కృష్ణమూర్తికి వ్రాసే ధైర్యం అత

నికి లేకపోయింది. కాకినాడ డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసర్‌కి వొ న్తుత్తరం వ్రాశాడు యీ విషయాలన్నీ తెలియపరుస్తూ. దీనికి మెడికల్ ఆఫీసర్ యీ విధంగా సమాధానం వ్రాశాడు.

"మీరు చెప్పిన విషయాలతో నేను ఏకీభవిస్తున్నాను. ఈ వివాహం జరగడం - అందులో మీరు కార్యం కూడా యిప్పుడే జరుపుతారంటున్నారు - చాలా విచారకరమైన విషయం. కాని నేను చెయ్యగలిగింది ఏమీ లేదు. డిస్ట్రిక్టు ఆఫీసర్ దగ్గర్నుంచి హెల్త్ సర్టిఫికేట్ వుంటేనేకాని వివాహం చట్టబద్ధం కాకూడదని ఏదేనా శాసనం వుంటే తప్ప మనం యిందులో జోక్యం కలగజేసుకోడం పోస్సాధ్యపడం. ఒకవేళ అట్లాంటి శాసనాన్ని ప్రభుత్వం ముందు ముందు అమలు జరిపినప్పటికీ పుణ్యపురుషులవారూ మెడికల్ ఆఫీసర్‌కి లంచం పోసి దొంగ సర్టిఫికేట్ పొందే అవకాశం వుండనే వుంటుంది. ఈ పరిస్థితులలో కార్యం యిప్పుడే జరపకుండా మీరే వారితో మాట్లాడి ఏదో చెయ్యడం మంచిది. నేనేమీ చెయ్యలేను."

దయానిధి గోవిందరావుగారికి కనీసం కార్యం మాత్రం యిప్పుడు జరపకుండా చూడవల్సిందని మరో వుత్తరం వ్రాశాడు. దానికి ఆయన జవాబు వ్రాశాడు: వివాహం తప్ప కార్యం జరిపే ఏర్పాటు యిప్పుడు కాని అసలెప్పుడు కాని లేదనీ, కొన్ని కారణాల వల్ల యీ వివాహం యిప్పుడు జరిపి తీరాల్సిందేనని వ్రాశాడు. ఆ కారణం ఏమిటో కనుక్కుందామని సంకల్పించాడు నిధి, నారయ్యని కాకినాడ పంపించాడు. నారయ్య రెండు రోజు లుండి తిరిగి వొచ్చాడు. అతని కేమీ ఆరా దొరకలేదు. ఇంక వివాహం రెండు రోజు లుంది.

అమృతం భర్త, తనూ అమృతం సుశీల పెళ్ళికి వెళుతున్నామనీ, తనూ వొస్తాడని ఆశిస్తున్నామనీ నిధికి వుత్తరం వ్రాశాడు. వివాహం యింక రెండు రోజుల్లో వుంది. పోనీ తనూ వెళ్ళి, కృష్ణమూర్తితో మాట్లాడితే? ఏమని మాట్లాడటం? తను మామగారితో ఏం మాట్లాడగలిగాడు? నీయిల్లు నువ్వు చక్కబెట్టుకోమన్న గోవిందరావు మామయ్య మాటలు సూదుల్లా గుచ్చుకున్నాయి. ఆ రోజు గడిచిపోయింది. ఆ మొన్నాడు వుదయం, పెండ్లికి వెడదామని సంక

ళ్ళించాడు. హోల్డాల్ తీసుకుని స్టేషన్ కొచ్చాడు. బండి ప్లాట్ ఫారం మీద సిద్ధంగా వుంది. పదినిముషాల టైముంది. కాళ్లు దడ దడ లాడుతున్నాయి; వొళ్ళంతా చల్లబడింది. జ్వరం తగిలింది. బల్ల మీద కూర్చుండి పోయ్యాడు. నుదురు వేడెక్కిపోయింది. శ్వాస బరువుగా వొస్తోంది. గార్డు విజిల్, రైలుకూత, రైలు కదలడం జరిగింది. ఒచ్చిన జట్కాబండిలోనే యెక్కి యింటికి వెళ్ళిపోయాడు.

రెండు నెలలు గడిచినై. క్లబ్బులో కృష్ణమూర్తి టెన్నిస్ ఆడుతున్నాడు.

''హల్లో డాక్టర్,— మీవాళ్ళంతా వెడ్డింగ్‌కి మీ రొస్తారని చాలా అనుకున్నారు. నేనుకూడా డిజ్ అప్పాయింట్ అయ్యాను. బహుశా పేషంట్లతో మీకు తీరుబడిలేక పోయిందేమో'' అన్నాడు కృష్ణమూర్తి.

"లేదు లేదు—నాకొంచెం వొంట్లో సుస్తీ చేసింది."

''డాక్టర్ ఈజ్ వాన్ పేషంటు—''

నిధి నవ్వాడు; కృష్ణమూర్తిలో ఏ విధమైన మార్పులేదు.

జబ్బు విషయం అడుగుదా మనిపించింది; కార్యం మాట అడగా లనిపించింది. అనవలసిన వాక్యాలను ఆలోచించుకుంటున్నా గానే; కృష్ణమూర్తి మళ్ళా అందుకున్నాడు.

''ఐనా మీరు వొచ్చినా, మీరు ఎన్‌జాయ్ చెయ్యలేరేమో లెండి—మీ పెండ్లి విషయం, అవన్నీ జ్ఞాపకం రావచ్చు'' అన్నాడు.

నిధి ఆలోచన పరిపరి విధాల పోయింది. అల్లా అనడంలో కృష్ణమూర్తి వుద్దేశం ఏమిటో? కంఠం సవరించుగుని నిధి మాట్లాడబోయాడు.

''ఐతే చూడండి, మీకు,—మీరు—"

"ఫరవాలేదు లేవయ్యా, యిప్పుడు డబ్బుతొందర ఏమీ లేదు. మీదగ్గిర వున్నప్పుడే యిద్దురుగాని'' అన్నాడు కృష్ణమూర్తి—కానే పోగి—''పైగా నేను మీకు ఫీజ్ యివ్వాలిగా. ఇప్పుడు మనం బ్రంధువులం కూడాను. ముందు ముందు మీరే నా ఫేమిలీ ఫి[illegible]

అంటూ కృష్ణమూర్తి పేకాట బృందంలో కలిసిపొయ్యాడు.

హార్టులెస్ స్కౌండ్రల్ అనుకున్నాడు నిధి. నిదానించి చూస్తే

కృష్ణమూర్తి చేసిన తప్పేమిటి? అతని జబ్బు నిమ్మళించి వుండగూడదూ? వివాహం చేసుకున్నాడు, కార్యంలో తగిన జాగ్రత్త తీసుకున్నాడేమో! చదువుకున్నవాడు, ఆమాత్రం ఆలోచించుకోడు? కాని యీ ప్రశ్నలకు సమాధానం ఎవరు చెబుతారు? అమృతం చెప్పగలదు అమృతానికి వుత్తరం రాయా లనిపించింది. వ్రాశాడు. అమృతం భర్తని సంబోధిస్తూ "నేను ఆనాడు జబ్బుచేసి, సుశీల వివాహానికి రాలేకపొయ్యాను, మీరూ అమృతం, కులాసాగా గడిపారని తెలుస్తూ. మీ రెవరేనా పెండ్లి విశేషాలు వ్రాస్తారేమో అనుకున్నాను. జగన్నాథం ఆ పెండ్లికి ఎందుకు రాలేదో వ్రాశారు కారు. అతను వెళ్ళివుంటే, అన్ని సంగతులూ వ్రాయును. ఇప్పుడేనా మీరు పెళ్ళి వివరాలన్నీ రాస్తే సంతోషిస్తాను" అని వ్రాశాడు. ఈ వుత్తరం అతనికి తృప్తి నివ్వలేదు, లేఖలో జీవంలేదు, చచ్చిపోయిన కలంతో వ్రాసిన వుత్తరంలాగు. దాన్ని చించివేసి యీసారి అమృతాన్ని సంబోధిస్తూ మరో వుత్తరర వ్రాశాడు.

"—నువ్వూ, నీ భర్తా కులాసాగా వుంటున్నారని తెలుస్తూ. నన్ను జ్ఞాపకం వుంచుకుని, వివాహానికి ఆహ్వానిస్తూ వ్రాసిన వుత్తరానికి చాలా కృతజ్ఞుణ్ణి. సుశీల పెండ్లి ముచ్చటలు నీనోటంట వినాలని వుంది. రహస్యాన్ని తిన్నగా శోధించి, సత్యాన్ని విప్పిచెప్పే శక్తి నీకే వుంది...." ఈ వుత్తరం అతను పూర్తిచెయ్యలేక పొయ్యాడు. నాలుగైదుసార్లు చదువుకున్నాడు. అతనికి 'వుంచుకోటం' 'నీనోటంట' 'రహస్యాన్ని'—అనే మాటలు ప్రమాదంగా తోచిన్నై; ఇవి చదువుకుని భర్త ఏమనుకుంటాడో! ఏదో పాపం చేసినవాడల్లే బాధపడ్డాడు. తనలో ఏదో పాపంచేసే సంకల్పం వుందా? ఆ సంకల్పాన్నుంచి అతను పారిపోవడానికి యత్నిస్తున్నాడా? అతని మనస్సు చెడిపోయింది. పెద్దమంటలో అడివిచెట్లు విరిగి పడుతున్న ట్లనిపించింది. ఆ వుత్తరం చించివేశాడు.

మరో మాసం గడిచింది. ఇప్పు డతనికి ప్రాక్టీస్ బొత్తిగా ఇంటద్ది, రెండు నెలలది యివ్వాలి. అతికష్టంమీద భోజనం గడుస్తోంది. నారయ్యా, రోజ్ వొండి పెడుతున్నారు, అప్పుడప్పుడు, మిగిలిన ఎకరం కూడా అమ్మేశాడు. అన్నగార్ని అడగలేడు. గర్వం,

అతిశయం, యాచనకి అంగీకరించడం లేదు. అమ్మేటందుకు ఏమీ లేవు. భార్య దగ్గరవుంటే ఎంత బాగుండును. నగలేనా అమ్మొచ్చు.

క్లబ్బులో అతన్ని గురించిన పుకార్లు కొత్తరూపం దాల్చాయి.

"భార్యని వొదిలేశాట్టగా! కృష్ణమూర్తి పెండ్లాన్ని యిక్కడికి ఎందుకు తీసుకురాడోయ్! బికాజ్, వాడి పెళ్ళానికీ, డాక్టర్‌కీ సంబంధం వుందిలే మరి—బంధుత్వం యీజ్ యీక్వల్ టు బ్యూటిఫుల్ సంబంధం."

కృష్ణమూర్తి డాక్టర్ దగ్గర ఎందుకు మందు పుచ్చుగోడో చెప్పుకో. ఎ క్రాస్‌వర్డు పజిల్! వీడు అర్‌సినిక్ యింజెక్షన్లిచ్చి చంపితే?"

"నిధిగారి సతీమణి ఏది? కనుక్కున్నవారికి వెయ్యిరూపాయల బహుమానం."

అదీ పుకార్ల ధోరణి వెళ్ళటం, యివి వినడం, బాధపడటం తప్పడం లేదు. వినకుండా, బాధపడకుండా వుండలేదు. ఆ బాధే తనకి మిగిలిన స్నేహితుడు. అప్పుడప్పుడు కొందరు క్లబ్బువ్యక్తులు, ఏదో జబ్బు వొంకని యితని దగ్గరకొచ్చి, బాతాఖానీ వేసి, కొంత పరిశోధనా ఫలితాన్ని పొందా మనుకుని పోతుంటారు.

ఇప్పుడు కృష్ణమూర్తి చాలా భాగం అత్తవారి వూళ్ళోనే వుంటున్నాడు. ఎప్పుడేనా 'మాచెస్' వుంటే వొచ్చిపోతుంటాడు. మరో మాసం గడిచింది. గోవిందరావు మామయ్య దగ్గరనుంచి వుత్తరం వొచ్చింది.

"నిన్నరాత్రి, సుశీల ప్రసవించి చనిపోయినది. శిశువుకూడా మరణించినది...."

దయానిధికి "కొన్ని కారణాలేమి"టో తెలిశాయి. వివాహం జరిగి ఎనిమిది మాసాలు పూర్తికాలేదు. శిశువు కృష్ణమూర్తికి పుట్టలేదు; తండ్రిగా వుండే బాధ్యతమాత్రం అతను వహించాడు, దయానిధికి దుఃఖంలో భయమేసింది. సుశీల మృత్యువుకి అతను కారకుడేమో ననిపించింది. తను కోరినప్రకారం సుశీల పెండ్లి జరక్కపోయివుంటే సుశీల ఏమవును? ఏవిషమో కాగును. సుశీల అల్లుకున్న పద్మవ్యూహాన్నించి విముక్తి చేసేశక్తి వొక్క మృత్యువే.

ఏదో బరువుతో విరిగినట్లనిపించింది. కారుద్దామంటే కన్నీరు లేని సమయం అది. స్వేచ్ఛగా గాలి పీల్చాడు. జీవాన్ని తీసుకుపోయినప్పుడు, సృష్టి ఏదో ప్రశాంతాన్ని, వికాసాన్ని దిగవిడిచిపోతుంది. పెద్ద కెరటం మహాసముద్రంలోకి నిష్క్రమించేముందు, ఒడ్డుపై నురగని దిగవిడిచినట్లు, భయంకర మేఘం వర్షించి, తెల్లపడి, పల్చబడి, ఆకాశంలో అంతర్థానమైనట్లు. ఏడ్చి, జుట్టుపీక్కునేటందుకు యిక్కడేముంది? ఇతరులకోసం కన్నీరు కార్చడం సులభం, మనకోసం కావల్సినప్పుడు, కన్నీరు రాదు. మూల్గలేని ప్రాణి నవ్వుతుంది. కాని సృష్టిమూగదై, నిశ్శబ్దంలో జీవిస్తుంది.

రాత్రి పదకొండు గంటలైంది. దయానిధి హేమ్లెట్ చదవడం మొదలెట్టాడు. ఆ నాటకాన్ని ఎన్నోసార్లు చదివాడు. కాని యిప్పుడు పూర్తిగా అర్థమైనట్లుంది. అది నాటకం కాదు. మానవత్వాన్ని ఋజువుచేసే అనంత ప్రణాళిక. ఎవరికివారు అందులో యదార్థాన్ని, రక్తనాళాల పైన ఋజువు చేసుకోవాల్సిందే.

దయానిధి పుస్తకం మూసేసి దొడ్లో నూతిపళ్ళెం మీద పడక్కుర్చీ వాల్చుకొని కూర్చున్నాడు. ఆకాశంలో మేఘాలు బరువుగా కదుల్తున్నాయి. చెట్లలో ఆకులు మెదలడం లేదు, గాలి దూరంగా పిలుస్తోంది. ఏదో వొచ్చి లేపేవరకూ కదలనట్లు చెట్లు నిలిచిపోయాయి. నిధి కళ్ళముందు ఇంద్రధనుస్సులా ఏదో మెరిసింది. వేళ్ళతో కళ్ళను తుడుచుకున్నాడు. కన్నీటితో వేలు తడిసింది. ఛ, ఛ— తను ఏడవకూడదనుకున్నాడు, ఎందుకు దుఃఖం? ఎవరిమీద తనకి కోపం? ఏం కావాలి తనకి? అన్నింటికి సమాధానం శూన్యం. ఏమీ జరగడంలేదని పడే బాధా, కారణంలేని దుఃఖం,—వీటికి అంతం లేదు. సృష్టిని చూసే మానవుడు జాలిపడటం జరుగుతుందా? ప్రపంచంలో అన్నీ మూసుకునే తలుపులు. అన్ని తలుపులూ వొకదాని తర్వాత వొకటి మూసుకుపోతాయి. మనం బైటుండిపోతాం. అంతా చీకటి, దూరంగా ఏదో కిటికీ తెరిచినట్లుంది; కాంతి మెరి[illegible] అతను జీవితాన్ని స్పృశించి పట్టుకున్నట్లుంది. విశ్వాన్ని ఆవులింతలో యిముడ్చుకున్న విముఖత అది. తొందరగా లేచి గదిలోకెళ్ళి, కాగితం, కలం తీసుకుని వ్రాయడం మొదలెట్టాడు. పదహారు

రోజులవరకూ బైటికివెళ్ళకుండా. గదిలో ఏకాంతంగా కూర్చుని, గంటకో వాక్యం చొప్పున వ్రాస్తూ గడిపి, చివరికి ఆ వ్యాసం ముగించాడు. అతనికి ముగింపు చేతకాదు. ప్రేమకి ద్వేషం ముగింపు; యవ్వనానికి వాంఛ ముగింపు, జీవితానికి మృత్యువు ముగింపు; కాని ఈ వ్యాసానికి ముగిం పేమిటి? ఒక్కసారి విశ్వంలోని సౌందర్యవతులైన స్త్రీల శరీరాలని మంటగాచేసి, ఆ జ్వాలలో తన శరీరం ఒక్కసారి మండించుకుని, ఎండిన నాలుకా, కాలిపొయ్యే నుదురూ, మరి మెదలని అస్తిపంజరమై, కరిగిన మంచులా ద్రవించని రక్తంతో, నిండు సూర్యుని చూడగలిగిన మానవులందరూ, ఆ వ్యాసాన్ని, ముగించే యత్నం చేస్తూ, అల్లా వ్రాస్తూ పోవాల్సిందే. ప్రతి యుగంలో మనుషులూ, మరో అంకమో, మరో అధ్యాయమో వ్రాస్తూ వుండే ఎడతెగని పుస్తకంలాంటిది జీవితం. దానికి ముగింపు లేదు. తను వ్రాసిన వ్యాసం వొకసారి చదువుకున్నాడు నిధి.—

# 7

# చీకటి సమస్య

షేక్స్పియర్ రచించిన హామ్లెట్ నాటకం చదివినవారికందరికీ అందులో వొక సమస్య వున్నదన్న విషయం తెలిసే వుంటుంది. ఆ సమస్య, హామ్లెట్ నాటకానికి సంబంధించినదికాని, రచయితకి సంబంధించినది కాదు. హామ్లెట్, షేక్స్పియర్ యిద్దరూ ఒకటేనని నమ్మిన విమర్శకులు యీ సమస్యను పరిష్కరించే యత్నాలు చేశారు. ఇట్లా చేసిన వారు షుమారు అరవైమంది. వీరు, ప్రపంచంలోకి షేక్స్పియర్ గొప్ప రచయితనీ, అతని రచనలో హామ్లెట్ గొప్ప నాటకమనీ అన్నారు కాని, దాని సమస్య పరిష్కారం కాలేదు. కోల్‌రిజ్, యీ నాటకంగురించి వ్రాస్తూ తన స్వీయచరిత్ర చెప్పుగున్నాడు. గెథే అదే పని చేశాడు. ఇటీవల టి. యస్. ఎలియట్ అనే విమర్శకు డొక్కడూ ధైర్యంచేసి, హామ్లెట్

షేక్స్పియర్ రచించిన వుత్తమనాటకం కాదనీ, పూర్తిగా పాడై పోయిన నాటకం అనీ, తీర్పు చేశాడు. ఎలియట్ యిట్లా అంటున్నాడు.

"హామ్లెట్ నిండా, రచయిత వెలుగులోకి లాగి కళానుగుణంగా ప్రదర్శించలేకపోయిన 'గొడవ' లాగే వుంది...హామ్లెట్ అనుభవించిన వుద్రేకానికి సరిపడ్డ పరిస్థితులు బాహ్య ప్రపంచంలో లేవు. పడే బాధకీ, చూస్తూన్న వాతావరణానికీ మధ్య వున్న లోయపై వొంతెన వెయ్యలేకపోయాడు. హామ్లెట్ తన వుద్రేకంతో బాధపడినట్లు, షేక్స్పియర్ హామ్లెట్ నాటకంతో బాధపడ్డాడు. సారస్వతంలో ప్రదర్శించడానికి వీలుకాని కథావస్తువుని షేక్స్పియర్ యీ నాటకంలో తీసుకున్నాడు. షేక్స్పియర్ ఆ బాధని హామ్లెట్ ద్వారా ప్రదర్శించలేక పొయ్యాడు. అందుచేత యీ నాటకం తగులబడింది.''

ఈ సమస్యని పరిష్కరించే వుద్దేశ్యంతో నేనూ యీ వ్యాసంలో కొన్ని సూచనలు చేస్తున్నాను. ముందు; హామ్లెట్ సమస్య ఏమిటో కొంచం పరిశీలిద్దాం.

హామ్లెట్ తండ్రి మరణానంతరం, హామ్లెట్ తల్లి గెర్ట్రూడ్, భర్తసోదరుణ్ని వివాహమాడుతుంది. రాజ్యపరిపాలన కూడా వారిదే. ఆ స్థానంలో మంత్రికుమార్తె ఒఫీలియాని హామ్లెట్ ప్రేమిస్తాడు. ఇట్లా వుండగా వో నాడు హామ్లెట్ తండ్రి. దయ్యంగా కుమారుడికి దర్శనం యిచ్చి, తను తన సోదరునిచే హత్య గావింపబడినాననీ. తల్లి కూడ యిందులో బాధ్యురాలనీ, వారిమీద పగసాధించవలెననీ కుమారుణ్ని శాసించి, అంతర్థానమౌతాడు! ఆ నాటినుండి హామ్లెట్ మనస్సు మారిపోతుంది. తల్లి వ్యభిచరించిన విషయం తెలియగానే, 'స్త్రీ'మీద అతనికున్న గౌరవం పోతుంది. ఒఫీలియా కూడా యిట్లాంటి కులటేమోనని భ్రమిస్తాడు. అతన్ని [illegible]లించడానికి, అతని గుట్టు బైటకి లాగడానికి తండ్రిచే నియమించబడిన గూఢచారిణిగా పరిగణించి, ఆమెని తూలనాడి సంపర్కం మానుకుంటాడు. రాత్రీ, పగలు బాబయ్యనీ, తల్లినీ యే విధంగా సంహరిస్తే కసి తీరుతుందో ఆలోచన సాగిస్తూ, పరాకుప్రసంగం

చేస్తూ, పిచ్చివాడిలా ప్రవర్తిస్తాడు. గూఢచారుడుగా వుంటున్న మంత్రిని హత్య చేస్తాడు. రాజు, భార్య, అతనిది ప్రమాదకరమైన 'పిచ్చి' అని భయపడి, దాని నిజానిజాలు తెలుసుకోడానికి యత్నిస్తారు. హామ్‌లెట్ రాజ్యంలో వుంటే వారికి ముప్పు వాటిల్లుతుందని, అతన్ని దూరదేశానికి పంపుతారు. అత నీపన్నాగం తెలుసుకుని, తిరిగి వొచ్చి, రాజయోధులను హత్య చేస్తాడు. చివరికి. పగ సాధిస్తాడు; ఒఫీలియా ఆత్మహత్య చేసుకుంటుంది. తనూ, తల్లీ, రాజూ, అందరూ మరణిస్తారు.

ఇందులో సమస్య యిది: హామ్‌లెట్, తన చర్యలకి యేవగించుకుని తన తల్లినీ, ఆమె భర్తని చంపడానికి నిశ్చయించుకుని కూడా, ఆ పని ఎందుకు చెయ్యడు? స్వగతాలతో అమాయకులని చంపుతూ ఎందుకు వృథా కాలయాపన చేస్తాడు? ఇదీ ప్రశ్న. దీనికి విమర్శకులు రకరకాల సమాధానా లిచ్చారు. వీటన్నింటినీ మూడు రకాలుగా విభజించవచ్చు.

1. షేక్స్‌పియర్ వొక పాత నాటకాన్ని ఆధారంగా చేసుకుని యీ నాటకం వ్రాశాడు; అందులో పగ తీర్చుకోవడం తప్ప వేరే కథ పట్టులేదు. కాబట్టి, ఆ 'పట్టు,' 'బిగి' ఆపాదించటంకోసం, యీ స్వగతాలు, 'ఉన్మాదం' 'తంతు' యిరికించాడు అని,

2. హామ్‌లెట్ ఆదర్శజీవి. తన ఆదర్శాలని ప్రపంచానికి కూడా ఆపాదించాడు. తన తల్లి చేష్టలు: ఆ ఆదర్శాలని భగ్నం చేసినై. "వాళ్లు వుంటేనేం, చస్తేనేం?" అనుకుని నిస్పృహ చెంది. కార్యదీక్షనుంచి విరమించి. వేదాంతి అయ్యాడు—అని.

3. నాటకకర్త హామ్‌లెట్ యిరుక్కున్న వ్యూహాన్ని చూసి జాలిపడి, సానుభూతి ప్రకటించడంవల్ల, యీ 'అలస్యం' జరిగింది—అని.

నేను యిందులో మూడోదానితో ఏకీభవిస్తున్నాను. ఇది కొంతవరకూ ఎలియట్ చెప్పిన వాటికి దగ్గరగాకూడా వుంది. హామ్‌లెట్ తల్లిని, అందరు పురుషులలాగే, 'మాతృదేవత'గా ఊహించి, గౌరవించి ప్రేమించాడు. కాని, ఆమె భర్త చనిపోగానే మళ్ళా వివాహం చేసుకుంటుంది. ఈ కృత్యంతో హామ్‌లెట్ తల్లిని పూజించలేకపోయ్యాడు. తరవాత, భర్త జీవించి వుండగానే, భర్త

సోదరుడితో వ్యభిచరించిందన్న సంగతి తెలియగానే, ఆమెని 'గౌర వించడం' మానేశాడు. స్త్రీని 'చాంచల్యమా'! అని సంబోధించాడు. చంపడానికి నిశ్చయించుకున్నాడు. ఆమె బ్రతికివుంటే తనలాంటి కూతుళ్ళని కంటుందని భయపడి. 'చంపడం' 'మంచిపనే' నను కున్నాడు. కాని ప్రేమించకుండా వుండలేకపోయ్యాడు, తల్లిలోని చెడుగుకి అతీతం అయ్యే ప్రేమ అతనిది. "పోనీ సుఖపడనీ, అనుభ వించనీ, యీ నాలుగు రోజులేగా, తరవాత ఎల్లాగా చంపుతానుగా, పోనీ పాపం, ఆనందించనీ" అని హామ్లెట్ అనుకుని, 'ప్రేమకి' తన దాస్యం వొదులుకోలేక. కాలయాపన చేశాడు. ఆ ఔదార్యం, ఆ అతీతమైన ప్రేమ. హామ్లెట్ లోని వుత్తమలక్షణాలు—చివరికి 'పాపాన్ని', 'చెడుగుని' చూసి, భరించి, సహించి, అనుభవించి, అతీతమయ్యే ప్రేమ అతనిది. పాపం లేదు, పుణ్యం లేదు, చెడుగు లేదు, మంచి లేదు - ఇవి ఐహిక విలువలు ఆధ్యాత్మిక విలువలు కావు, సంఘం యొక్క ప్రాపకం, ప్రాబల్యంమీద ఆధారపడే అశాశ్వ తమైన విలువలు. కష్టసుఖాలు రెంటినీ సమంగా అనుభవించిన వ్యక్తికి తీర్పుచేసే అవసరం వుండదు; వుండనక్కరలేదు.

ఐతే ఈ సూచనలు సమర్థించేటందుకు, నాటకంలో ఆధారాలు ఎక్కువగా లేవు. వీటి ఆధారాలు షేక్స్పియరు జీవిత రహస్యంలో దాగివున్నాయి. షేక్స్పియరు తల్లిచర్య షేక్స్పియర్‌ని బాధించి వుండొచ్చు. తనకి జరిగిన అన్యాయాన్ని, పదిమందికీ ఎరుకపరిచి, వారిని అపవాదునుండి రక్షించడం, మహాపురుషుడి లక్షణం. వ్యక్తి గతమైన విలువలే, ప్రపంచానికి అన్వయించే సూత్రాలుగా మారు తాయి. షేక్స్పియర్, చెడ్డదైన తన తల్లిని ప్రేమించగలిగాడు. కాని యీ ప్రేమనీ, ఆమెలోని "చెడ్డ" తనాన్నీ సమన్వయం చెయ్య లేక పోయాడు. శిఖరం ఎక్కి కిందికి చూశాడు,—అఘాతంవుంది; తల తిప్పేశాడు. ఈ అఘాతంపైనుంచి అవతలి శిఖరంమీదకి దూక ఎట్లా? అదీ అతని సమస్య. చివరికి-తెగించి దూకేశాడు; కాని దూకేముందు, అవతల శిఖరంమీదికి చేరుకోలేనని అతనికి తెల్సును; ఐనా దూకడం అతని విధి; అతని ప్రకృతి. చెడుగుపై కాట్లు చెయ్య

లేదు; దూకి అతీతుడు కావాలి; అఘాతంలో తనూ, తల్లీ తన పాత్రలూ అంటాపడి నశింపై పోయారు.

చెడ్డవ్యక్తులే రక్తికట్టే పాత్రలన్నాడు, జాన్ బైలీ. వారిని రంగం పైకి వొదిలి, ప్రేక్షకులను ప్రేమించమన్నాడు. ఎందుకు? 'చెడ్డతనం' సాధనంగా చేసుకుని ఆ పాత్రలు 'ఆనందాన్ని' సాధించారు. ఆనందాన్ని సాధించడం, శాంతిని పొందడం, అవసరంగాని, అవి పొందేటందుకు సాధనాలేవైనా, ప్రమాదంలేదు. "ఏవిధంగానైనా, సంతోషాన్ని సాధించిన మనుషులను షేక్స్పియర్ ప్రశంసిస్తాడు" అంటాడు సర్ వాల్టర్ రాలె. సంతోషం పొందేయత్నంలో వారు మరణిస్తే, విషాదకరమైన పాత్రలై మన సానుభూతిని కోరతారు; గెలిస్తే, హాస్యాస్పదంగా మారతారు. వారు పొందదల్చుకున్న ఆనందం అల్పమైంది కాదు. ప్రాణాన్ని బలిగా కోరుతుంది వారి ఆశయం. వారి మృత్యువు, ఇంజనీర్లు అశ్రద్ధగా కట్టిన వొంతెన పడిపోవటం లాంటిది కాదు; భూకంపంలో కూలిపోయిన వొంతెన లాంటిది. మొదటిదాన్ని విమర్శిస్తాం. రెండోదాన్ని చూసి జడుసుకుని ముగ్ధులవుతాం."

ఈ వ్యాసాన్ని ఎట్లా ముగించాలో తెలియక దయానిధి డ్రాయర్లో పెట్టేశాడు. వారం గడిచింది.

సాయంత్రం నాలుగైంది. దయానిధి క్లబ్బుకెళ్ళాడు, ఈ మధ్య పత్రికలు సరిగ్గా చూడక, దేశంలో ఏం జరుగుతుందో అతనికి బాగా తెలీడంలేదు. వెళ్ళి పత్రికలు చూడడం మొదలెట్టాడు. కాని అతని మనస్సు స్థిరంగావుండక, పదేపదే, వ్యాసం మీదికి వెడుతోంది. దాన్ని మాడరన్ రెవ్యూకో, త్రివేణికో పంపాలనుకున్నాడు. అతనికి సారస్వతంలో ప్రవేశంలేదు. విమర్శకుడిగా పైకిరావాలని కూడా అతని సంకల్పం కాదు. అది వ్రాయడంలో అతనిబాధ తీరిపోయింది. ఏదో బరువుతగ్గినట్లనిపించింది. అతని విమర్శన చదుకున్న సాహిత్యప్రియులు నవ్వుతారేమోకూడా అనిపించింది. సారస్వతంయొక్క ఉద్దేశం జీవిత సమస్యకి సమాధానం యివ్వడమా? తలిదండ్రుల పాపాలు పిల్లలని వెంటాడినప్పుడు, వారేం చేస్తారు? 'ఏం చెయ్యాలి?' అన్నదానికి షేక్స్పియర్ సమాధానం యివ్వలేక పొయ్యాడు.

వారిని క్షమించి, ప్రేమించమన్నాడా? నీతి లేదనడం లేదు. ప్రాచీన శక్తులు, ప్రకృతి, మానవత్వం—వీటికి నీతితో నిమిత్తంలేదు. ఈ గోళంపై మానవుడి బ్రతుకు క్షణికం; అశాశ్వతం. నీతిపేరిట కఠిన శిక్ష, కన్నీరు, ఖుట్టుపీకోక్కవడం ఎందుకో. మహాసముద్రం పొంగి పొరలి, నీతినీ, అది నెలకొల్పిన సంస్థలని ముంచివేస్తుంది. ప్రకృతి జ్వాలలో మానవుల కట్టడాలు తగులడతాయి. తాలిగోగా మిగిలిన జీవంలేని ముక్కలనుంచి నీరసించిన నల్లపొగ ఆకాశం కమ్ముతుంది.

"ఎట్లా జీవించడం?" అన్నదానికి సారస్వతం సమాధానం యివ్వాలంటే అతని విమర్శకి విలువవుంది.

ఇతరులజోలి తనకెందుకు? తన జీవితానికి తాను సమాధాన పడ్డాడు. అతని సమస్య విశద పడింది. విశదపడిన వొస్తువు, యిక మరి బాధించదు. అందులో భయంపోయింది. ఏకాంతంలో అతను తెలుసుకున్న వెలుగు అతన్ని రక్షిస్తుంది. తనూ, తనలాటివాళ్ళు చేసిన పాపాలను భరించే భారం షేక్స్పియర్ మీద వెయ్యడం ఎంత తప్పు? నీనీడ, నీవ్యక్తిత్వం, నీచెడుగు, నీపాపాలు నువ్వు జీవించి వుండగానే నశింపై పోవడం, ఎంత ఆశ్చర్యం! ఎంత ఆనందం!

పత్రికలో వార్త యీ ఆలోచనల్ని అరికట్టింది. రాయల సీమలో కలరా, ప్లేగు చెలరేగి, అనేకమంది మరణిస్తున్నారు. అక్కడ సహాయం చెయ్యడానికి వొచ్చిన డాక్టర్ల సంఖ్య తక్కువ. ఎందరో డాక్టర్లు వొచ్చి, తోడ్పడితేగాని లాభం లేదు. ఆరోగ్యశాఖ వారు చేస్తున్నపనికి డాక్టర్లు కూడా సహాయపడాలని నాయకులు విజ్ఞప్తి చేస్తున్నారు. ప్రజలకి మందులు, బట్టలు. డబ్బు కావాలి. అనంతపురం, కర్నూలు జిల్లాల్లో పరిస్థితులు తీవ్రంగా వున్నాయి. నిధికి యిది చదవగానే, అక్కడికి వెళ్ళిపోవాలనిపించింది. వెళ్ళి అక్కడే ఏకాంతంగా వుండిపోవాలి. మరి తిరిగి రాకూడదు. ఈ వూళ్ళు, యీ తాలూకాలు ఎన్నో జ్ఞాపకం చేస్తాయి. ఇక్కడ మనుషు లల్లో కుళ్ళు, కుట్ర. కుతంత్రం-వీళ్ళనుంచి పారిపోవాలి.

సోడా లక్ష్మి దొచ్చి, 'వోటర్' తీసుకోండన్నాడు.

"నాకు కాతా లేదుగా—నేను మెంబర్ని కాను" అన్నాడు నిధి.

"కాకపోతే ఏం లెండి—ఫరవాలేదు తీసుకోండి" అన్నాడు పుత్రాడు. వాడి కళ్లల్లో ఎంతో దయ, యెంతో ఆదరణ. వాడిజీవితం ఎంత మంచిది! హాయిగా అట్లన్నీ చూస్తాడు, సోడాలు తాగుతాడు— ఏ శ్రమా చింతా లేదు. కాని అల్లా ఎంతకాలం వుంటాడు? యవ్వనం వొస్తుంది; ఏపిల్లనో పెళ్లిచేస్తారు; వాడు ఏ పిల్ల వెంబడో పడతాడు. వాదాలు, దెబ్బలాట్లు; త్రాగుడు; పెండ్లాన్ని కొడతాడు; పెండ్లాం వాణ్ణి విడిచిపోతుంది; వాడూ నిధిలాగే ఐపోతాడు. పురుషుడి యవ్వన ప్రశాంతుక్కి. జనందాన్ని హరింపజేసేందుకు ఏ స్త్రీయో సిద్ధంగా వుంటుంది. వాడు మూలగడం, ఆమె కూచుని వినడం; ఆమె మూలగడం, వాడు వినడం; ఇంతే వాడి జీవితం?

పేకాట బృందం యితన్ని చూడలేదు. కబుర్లు సాగించారు, ఈసారి కృష్ణమూర్తిని గురించి.

"ఇవాళ రాలేదేం డాన్‌జవాన్?"

"ఊళ్లో కొచ్చాడు;"

"ఐతే భాయీ, అతనివైఫ్ ఆత్మహత్య చేసుకుందిటగా"

మూడు తలకాయలు ఆ కంఠం దగ్గరగా జరిగాయి.

"ఏం లేదు; ఇదివరకే ఆమెకి మరోడితో సంబంధం వుందిట; మూడో నెలని తెలుసుకున్నారుట—మన కృష్ణమూర్తికి తండ్రిగా వుండే భాగ్యం కలిగింది, మనవాడు నాటకం కనుక్కున్నాడు— ఏం జరిగిందో మనకి తెలీదు. ఆత్మహత్య చేసుకుంది. నీళ్లాడి చని పోయిందని గప్‌చిప్ చేశారు."

"ఐతే ఆ కాస్త పుణ్యం కట్టుకున్న ధన్యుం డెవం డో కో!"

"బ్యూటీ స్పెషలిస్ట్—"

"మేం నమ్మం మాకు నిదర్శనం కావాలి-"

"వివాహం ఆపు చేయించమని, వుత్తరాలు రాసి అఘోరిం చాడు-"

దయానిధి యీ సంభాషణలో కొంత వినగలిగాడు. సోడా కుర్రాడు 'కలర్' కొట్టి యిచ్చాడు.

"నేను డబ్బు లివ్వలేను." అన్నాడు విధి.

"ఫరవాలేదు లెండి—తరవాత చూసుగోవచ్చు — ఇక్కడ

ఇలాగే వాళ్లంతా డబ్బులిస్తే, మా అయ్య స్టేషన్ కాడ హోటల్ పెట్టును..." అంటూ కుర్రాడు నవ్వుతున్నాడు.

"ఐతే - నీకు నాపైన యింతదయ దేనికిరా?" కుర్రాడు మాట్లాడలేదు

"మీరు మంచోరండి—"

"నేనేం చేశాను?"

"మా విన్నికి మంచెప్పి బ్రతికించారండి.—రాత్రికి భలే ఆటాడుతున్నారండి—సినిమా—పంజాబ్ మెయిల్."

నిధి జేబులోంచి అర్ధరూపాయ తీసిచ్చాడు.

"చల్, మెయిల్ కి చల్.— మేరే మౌలా బులాలో" అని పాడుకుంటూ కుర్రాడు లోపలికి వెళ్లాడు.

పేకాట బృందం మళ్ళా సాగించింది—

"అబ్బాయ్—నే నోటి చెబుతాను విను, ఇనస్పెక్టర్ సంసారం పర్యం వొచ్చే లక్షణా లనుకో. నిధిగారి తల్లి - పెద్ద గాథలే—"

"ఏమిటండోయ్—బాంబులు విసురుతున్నారు."

"ఇల్లాంటివి దాగుతాయా బాబూ— ఆవిడ కథానాయకురాలే-అస లందుకనే యీయనకి సంబంధాలు కూడా రాలేదుట—"

"ఐతే భార్య ఏమైనట్టు?"

"ఇద్దరికీ చెడిందిగా—"

"ఎందుకో—"

"చారిత్రిక పురుషుడు" గుసగుసలు.

"విపులీకరించండి."

"కష్ణమూర్తి పెళ్ళాం ఎవరనీ?"

"కానివయ్యా—"

"అసలు పెళ్ళికిపూర్వమే, లేచొచ్చిన దాని కూతుర్ని తగులుకున్నాడు.—తల్లి ప్రోత్సాహం వుండేది—"

"చిత్రం"

"తల్లి రహస్యాలు కొడుకు దాస్తాడుగా మరి"

"ఐ. సి."

నిధికి ఆ కుర్చీ ఎత్తి, వాళ్ళమీద గిరవాటెట్టా లనిపించింది.

రెండు చేతులతో కుర్చీకాళ్ళని గట్టిగా పట్టుకున్నాడు. ఆ మాట్లంటున్నది గుమాస్తా సోమయ్య. వొందరూపాయల కాగితం పైకితీసి చూపించి మళ్ళా జేబులో పెట్టేశాడు. కోటు విప్పి కుర్చీకి తగిలించి, బైటకి వెళ్ళి వొచ్చి మళ్ళా ఆట్లోపడ్డాడు. ఇలతలో టెన్నిస్ ఆట గాళ్ళు వొచ్చి బల్లల్ని వెనక్కి లాగమన్నారు, కుర్రాడు, బల్లల్ని వరండాలోకి యీడ్చాడు, మళ్లా ఆట సాగించారు. సోమయ్య కోటు గోడని తగిల్చాడు, నిధికి రాయలసీమ వెళ్లేటందుకు యిప్పుడు వొందరూపాయలు కావాలి. సోమయ్య కోట్లోంచి ఆ కాగితం తీసేస్తే సోమయ్యకి మంచి శాస్తి జరుగుతుంది. వరండాలోకి నడిచి వెళ్ళాడు. కుర్రాడు చిమ్నీలు తుడిచి దీపాలు వెలిగిస్తున్నాడు. కోటు కీనీడలో వుంది. పర్సు లాగెయ్యడం అతిసులభం. సోమయ్య కోటు వెతుక్కొంటూ లేచాడు. పేకాటలో నోటు మార్చే అవసరం వొచ్చింది. "నా కో టేదిరా?"

"ఇదిగో మీకోటు—యిదేనా?" అన్నాడు నిధి.

"అవును—హాల్లో—మీ రిక్కడే వున్నారే—ఎంత సేపైంది వొచ్చి—రండి ఆడుకుందాం" అని ఆహ్వానించాడు.

"అరే బ్రదర్—ఏడవకు—నోటు మార్చ నక్కర్లేదులే, రా.. మనవాడు పంపకం చేస్తున్నాడు."

"ఇహనేం—మనబేస్తు మనకే దక్కుడు—"

సోమయ్య పర్సు తనే తీసుకున్నా ననుగుంటాడు. అట్లా అనుకోడమే తనకి కావల్సింది. తను వాగిన వాగుడుకి యిదిశాస్తి అని గ్రహించుకుంటాడు. కాని ఊరుకుంటాడా? రుజువు, పోలీసులు, కోర్టు విచారణ—అదో రకమైన జీవనం. ఏరకం జీవనమైతేనేం నైతిక విలువలతో సంఘానికి నిమిత్తం లేనప్పుడు?

కాని సోమయ్య అల్పుడు, సోమయ్య వ్యక్తిత్వంలేని మనిషి—సంఘంలో వొక రేణువు. సంప్రదాయం కాళ్ళకింద బురద. దులుపుతే వొదల్దు మనం దెబ్బలాడాల్సింది ఆదర్శాలతో. విలువలతో-వ్యక్తులతో కాదు. వ్యక్తులు సిద్ధంగావున్న నియమాలని ఆచరణలో [illegible] దాన్ని ఖండించి ధిక్కరించే శక్తి వారికి వుండదు; ధిక్కరించే [illegible]డికి సంఘంలో శాంతి వుండదు. నూరు రూపాయలు సోమయ్య ఖరీదు.

బ్రతికివుండగా—చనిపోయిన తర్వాత, కళేబరంలోని సామాను బజార్లో అమ్మితే, రూపాయి రెండణాల గంధకం, సున్నం.

నిధికి నవ్వొచ్చింది. సోమయ్యని క్షమించి, బైటకి వెళ్ళి పోయ్యాడు. మనిషి బ్రతుకు సరిగా లేకపోతే యిట్లాంటి పనులు చేయిస్తుంది కాబోలు ననుకున్నాడు. వొందరూపాయల కోసం ఆత్మని అమ్ముకోవాలా? అల్లా ఎందరో అమ్ముకుంటున్నారు; కొందరు వొంద కోసం; కొందరు వెయ్యికోసం. కాని వాళ్ళని చోరు అన డంలేదు. వాళ్ళని రావ్‌సాహెబ్, రావు బహదూర్ బిరుదులిచ్చి గౌరవిస్తున్నాం. అవనే, చిదవాడు చేస్తే, దొంగంటున్నాం. భారత దేశంలో ఆత్మవిలువ, రూపాయి అణా పైసల్లో నిర్ణయించవొచ్చు!

ఉండి వుండి, ఆకాశాన మేఘా లల్లుకున్నాయి. రోడ్డుమీద దుమ్ము మొహాన పడుతోంది, నక్కివున్న వర్షం చక్కిలిగింతలు పెట్టి నట్లుగా, గాలిలో చలి మెదుల్తోంది. దుకాణాలలో దీపాలు ఆరిపో కుండా, ఏవో అడ్డంపెట్టుకుని అవస్థపడుతున్నారు, కొట్టువాళ్లు. కాలవలో దీపాలరంగులు కొట్టుకుపోతున్నాయి. నిధి, యింటికి చేరు కుందామని తొందరగా నడుస్తున్నాడు. ఇంటి కెళ్ళి తనురాసిన వ్యాసం మళ్లా చదువుకోవాలి. అందులో ఏవో తప్పు లున్నట్లనిపిం చింది. సవరించాలి. ఈ వ్యాసం ప్రచురిస్తే, కబ్బు వ్యక్తులు చదువు కుని ఏమనుకుంటారో వూహిస్తే భయమేస్తుంది. వారి అనుమా నాలు ధృఢపడుతున్నాయి, క్రొత్తనిదర్శనం దొరుకుతుంది. అతన్ని పరిశోధించేటందుకు ఆ వ్యాసం తోడ్పడుతుంది. తన ప్రత్యేకమైన బాధని వెళ్ళబోసు కోడంతప్ప, ఆ వ్యాసంలో వుపయోగడే విలువ లేమున్నాయి? అస లెందుకు అతను అవి వ్రాయడం? చెడిపోయిన స్త్రీని క్షమించమని సంఘాన్ని కోరడమా? పాపాన్ని శిక్షించక ప్రేమిం చమనా అందులో సందేశం? బాగున్నవారు వేరు; పట్టుబడని వారే బాగున్నవారు; వీరు దొరికిపోయిన వారిని విలువకట్టి శిక్షించే అర్హత లేదన్నా?-ఏదో బలహీనమైన సమయంలో వాంఛకి లొంగిపోతే యింత ప్రమాదం జరుగుతుందని తెలుసుకున్న స్త్రీ అల్లా చెయ్యలేదని తెలియ పరచడమా? ఐనా స్త్రీనిమాత్రం ఎందుకు దూషించాలో? పురుషు డని నిందించరేమో!

వ్యాసాన్ని ప్రచురించే ధైర్యం అతనికి లేదు. నిజం చెప్పినంత మాత్రాన అది వుత్తమ సారస్వతం అనిపించుకోదు. అందమైన అబద్ధాలాడాలి. వ్యక్తిగతమైన కష్టసుఖాలని, సకల మానవులకూ వర్తించేటట్లు, శిల్పప్రధానంగా చిత్రించాలి. షేక్స్పియర్ అలా చేశాడు. తను, యీ వ్యాసంలో అల్లా చెయ్యలేక పోయాడు. బ్రతికివుండగా నిజం చెప్పే సాహసం అతనికి లేదని నిశ్చయించుకున్నాడు. నిజం చెప్పబోతే అతను బ్రతుకలేడు. తనకి తనే, విషాదాంత నాయకుడిలా కనిపిస్తున్నాడు. విషాదాంతనాయకుడికి, "అదో, యిదో,—ఏదో వొకటి చెయ్యి" అన్న సమస్యని పరిష్కరించే పరిస్థితు లెదురౌతాయి. ఏదో వొకటి నిర్ణయించటమే అసాధ్యం; అదే విషాదాంతంలోని సారం.

వీధిలో గాలి, దుమ్ము, మెరిసే చీకటి, అతని ఏకాంతం భయం కలగచేశాయి. ప్రపంచం విశ్వంలో ముందుకి సాగిపోతూ, అతన్ని దిగవిడిచి నట్లనిపించింది. అతనికి ప్రపంచంతో నిమిత్తం లేదు; ఐనా ప్రపంచానికి అతనితో నిమిత్తం దేనికో! అతన్ని పరుగెత్తుకు రమ్మని యాగీ చేస్తుంది. రాలేకపోతే, కుంటాడనో, గుడ్డివాడనో పేర్లు పెడతుంది అతని హృదయంలో నిశీథంలాంటి, అనంతంలాంటి ఏకాంతం కేంద్రీకరించింది. దాన్ని చూసి జడుసుకున్నాడు. ఎక్కడికి పారిపోతాడు!

తీరా చేసి యింటికే చేసుకున్నాడు. పక్కవారింట్లో గడియారం ఎనిమిది గంటలు కొట్టింది. మెట్లెక్కి, వరండాలో కొచ్చాడు. గుమ్మం అవతల బల్ల మీద కూర్చుని పూలదండ కడుతోంది అమృతం.

"ఏం బావా—నీకోసం వారయ్యని పంపాను, కనపళ్లేదూ—"

అమృతం పూలని పళ్లెంలో వుంచి, దీపాన్ని పైకెత్తి, వూది, పెద్దది చేసింది. ఆ వెలుగులో ఆమె మొహం నిండుగా కనపడింది: జడని విప్పేసి వెండ్రుకల్ని నిలువునా మెలిత్రిప్పి, మెడమీదికి జారుగా వారిగే చుట్టలా చుట్టింది. సూర్యోదయాలని దీక్షగా చూసే పవిత్రమైన నేత్రాలలా, కళ్లు స్వచ్ఛంగా మెరుస్తున్నాయి. పాపిడి యిరుప్రక్కలా ఎత్తుగా లేచిన జుట్టు నీడ నుదుటిమీద మెత్తగా పడింది.

పెదవులు కలిసినచోట, అర్ధచంద్రుడిలా లేచిన బుగ్గల 'సొగసైన' నీడలు పడుతున్నాయి. అంతటి ఠీవి, గర్వంవెనక, కెరటం వెనక అస్తమిస్తున్న సూర్యుడిలా దాగిన హాస్యదృష్టి, కారుణ్యాన్ని శాంతించిన ఆ కళ్ల నిశ్చలత్వం, కనపడని స్థిరత్వం పొందిన ఆ అవయవాల కదలికలో ఆదుర్దా— యిదివరలో ఎప్పుడూ అమృతంలో అతను చూడలేదు.

"ఏం బావా, అల్లా తెల్లబోయి చూస్తావు?" లేచి కళ్ళాన్ని దూరంగా నెట్టి, బల్ల తుడిచింది.

"నిన్ను ఆనవాలు పట్టలేదు అమృతం" అంటూ అతను బల్ల మీద కూర్చున్నాడు.

"ఏం? అంతలావుగా ఐపోయానుకదూ— మావారు 'పాతకోళ్లా వున్నా' వంటూంటారు. అంతే నన్ను పూర్తిగా మరిచిపోయావన్నమాట— బావా?"

"మరిచి పోవడం కాదు,— నువ్విక్కడ వుంటావని వూహించ లేక పోయ్యాను.— అందేత కొంచెం ఆశ్చర్యం వేసింది."

నిధి లోపలి కెళ్ళి కుర్చీ తెచ్చి వైటపెట్టి, అతను కూర్చున్నాక, అమృతం బల్లమీద కూర్చుని. పూలని ముడిమీద అలంకరించు కుంటోంది

"ఇప్పుడు చెప్పు—ఎప్పుడు రావటం? ఎక్కడ నుంచీ, ఎందుకూ—"

పూలని సర్దుతూ, పిన్నుని పళ్ళమధ్య బిగించి మాట్లాడుతోంది అమృతం.

"ఉండు మరీ—యీ జుట్టు లొంగదు—" విచ్చలవిడిగా ఎదిగి పోయిన ఆ జుట్టుని అమృతం నాలుగు పిన్నులతో లొంగదీసింది. కొన్ని వెంట్రుకలు మెడచుట్టూ, చెవులమీదా, చెక్కిళ్లమీదా పడి, వొడ్డున పడేసిన చేపపిల్లలా కొట్టుకుంటున్నాయి—

"అబ్బ ఎంతగాలి! వర్షం వస్తుందా? నువ్వు చాలా చిక్కిపోయావు బావా—" అంది అమృతం జాలిగా.

"ఏదో వూరికే అంటున్నావు."

"లేదు బావా—చూడు కణతలు వచ్చాగా ఎల్లా కొట్టుకొంటు

న్నారేమో—కళ్లు లోతుకి పోయాయి" అతన్ని ఎగాదిగా పరీక్షగా చూసింది.

"మనం పెద్దవాళ్లం అయిపోతున్నాం కదూ—"

"కాలం ఆగుతుందా మరి." గాలికి తట్టుకో లేనట్లుగా అమృతం, పమిటిచెంగుని వొళ్ళోంచి తీసి నెత్తిని కప్పుగుని, కుడి చెవిమీదికి లాగి కళ్లు, బుగ్గలు చిట్లించి నవ్వుతోంది.

"అన్నాలొడ్డించనా?—ఏమండోయ్‌! వొచ్చారే! మీ కోసం బజారంతా వెతిగా నే—లేవండి, నీళ్ళు కాగాయి, స్నానం చేద్దురు గాని—" అన్నాడు శంకరం లోపల్నించి వొచ్చి.

"నారాయ ణేడి శంకరం!" అంది అమృతం.

"అలా కాలవొడ్డు కెళ్ళాడు."

"బావా! నేను, శంకరం, పాలికాపు నారాయణా అల్లా తెనాలి వెళ్లివొస్తున్నాం. మావాళ్ల తాలూకు వొకరికి పెళ్లిసంబంధం వొచ్చింది. పిల్లనీ చూసి వొస్తున్నా. మా అత్తగారు యిదివరకే చూశారు. మావారు తీరికలేక రాలేదు. శిస్తు వొసూలు చెయ్యమని మా పాలికాపునికూడా [మా]తో పంపారు. పన్లు జరిగినై—దోవ లేనేకదా, ఓసారి నిన్ను చూసిపోదాం అని వాళ్ళనికూడా దింపాను. ఏది శంకరం, పెండ్లికూతు రెల్లా వుంది—చెప్పు." అని యాకరవు పెట్టింది అమృతం.

శంకరం పెండ్లి కూతుర్ని వర్ణించాడు. అమృతం నవ్వుతోంది. తన కర్థంకాకండా నిధి కూడా నవ్వడం ప్రారంభించాడు.

"దబ్బుని స్నానం చెయ్యి బావా,—భోజనం చేద్దాం. బట్టలంతా మట్టే—లే, లే" అని తను లేచింది. దయానిధి వెళ్ళి స్నానం చేసి వొచ్చాడు. జుట్టు పాపిడి లేకుండా వెనక్కి దువ్వి, బనీను తొడుక్కుని, పైన తువ్వాలు కప్పుగుని సిద్ధమయ్యాడు. పాలికాపు నారాయణకి మండువాలో వొడ్డించారు. రోజ్ హోటల్లో భోజనం చేసి, ముందు గదిలో పక్కవేసుగుంది. నిధి, అమృతం, శంకరం భోజనాలు చేశారు, శంకరం, స్నేహితుడితో సినిమాకి వెళ్లి స్నేహితుడింట్లో పడుకని వుదయం వొస్తానని బయలుదేరాడు.

"వర్షం వొచ్చేటట్లుగా వుంది. ఈ చలిలో సినిమా ఏం

చూస్తారూ—ఆ స్నేహితుణ్ణి తీసుకొచ్చి, యిక్కడే పడుకోరాదూ?" అన్నాడు నిధి.

"టీ తాగితే ఏ చలీ వుండదు, కాదా శంకరం?" అంది అమృతం.

"ఫరవాలేదు లెండి" అంటూ ఏదో గొణిగి శంకరం ప్రయాణమయ్యాడు. నారయ్యా, పాలికాపూ కూడా సినిమాకి తయారయ్యారు. హాల్లో డిస్ప్రింగ్ గదిముందు, పాలికాపుకి జల్లమీద పక్క ఏర్పాటు చేశారు. నారయ్య, నిధికోసం మంచం గదిముందు హాల్లోనే వేశాడు. తన చాపమట్ట మండువాలో వేసుకున్నాడు. ఈ పన్లు చేసి, వాళ్లు ముగ్గురూ వెళ్లిపొయ్యారు.

అమృతం తమలపాకులకి సున్నం రాస్తూ మండువాలోకి నడిచి దొడ్డివైపు చూస్తోంది.

ఇక్కడ ఎంతో హాయిగావుంది బావా—అచ్చంగా మావూళ్లో దొడ్డి యిల్లాగే వుంటుంది. ఇద్దరూ దొడ్లోకి నూతిపళ్లెం పిటకి నడిచారు. మేఘాలు చంద్రుణ్ణి విడిచి దూరంగా పరుగులెత్తాయి. ఆకాశం కానేపు నిర్మలంగా వుంది. నక్షత్రాలు స్వేచ్ఛగా మెరుస్తున్నాయి, ఉండి వుండి పల్చటి తెల్ల మేఘంపొర చంద్రుడిమీద పెండ్లికూతురు మొదటి రాత్రి సిగ్గు ముసుగులా కప్పి, కప్పించి, తీసేసి తొలిగి పోతోంది. గాలిలో చలి, పదునుపెట్టిన కత్తిలా శరీరాన్ని మత్యాపెడుతోంది. చెట్లల్లో ఆకులు సంగీతం కోసం గొంతులు సవరించుకుంటున్నాయి, చలిని ధిక్కరించినట్లు ఎక్కడో పక్షులు బాధలో ఆనందాన్ని రెప రెప ప్రకటిస్తున్నాయి. తపోభంగ యత్నాన్ని జయించిన ఋషిలా ప్రకృతి జపంచేస్తోంది.

"ఏం బావా మాట్లాడడంలేదు. కోపం వొచ్చిందా?" అంది అమృతం, నూతిగోరమీద చేతులానించి నీళ్ళలోకి చూస్తూ.

"నాకు కోపంవొస్తే ప్రపంచానికి నష్టంలేదు, పైగా నీమీద కోపం దేనికి?"

"ఊరికే అన్నాను. ఐతే బావా, సుశీల నా కోవుత్తరం రాసింది తెలుసా?"

"తెలీదు."

"అది చాలా విచిత్రమైన ఉత్తరం. అందులో రాసింది తన కేమైనా ప్రమాదం జరిగితే, నువ్వే బాధ్యుడవుట ..."

"ఎందుకో?"

తనకి జీవితంలో సౌఖ్యం లేకపోవడానికి నువ్వే కారణమంట, నా కేమీ అర్థం కాలేదు, నేను జవాబు రాయలేదనుకో—అబ్బ చలిగా వుంది," అంటూ కొంగు వొంటి చుట్టూ గట్టిగా బిగించుకుంది. పసుపు పచ్చ రంగుపై ఆకుపచ్చ పువ్వుల ఖద్దరు చీర, జబ్బల్ని పట్టుకున్న అంగుళం వెడల్పు జరీగల నల్లరంగు ఖద్దరు రవిక—దానిపై కుట్టిన తెల్ల పూలు, వెన్నెల్లో వింతగా కనబడుతున్నాయి.

"ఐతే బావా, ఏదో విషయం అడుగుతాను ఏమీ అనుకోవు కదా?"

"అడుగు అమృతం—నేను స్వేచ్ఛగా మాట్లాడేందుకు తగినంత చనువు నాకింకెవ్వరి దగ్గరా లేదు. నిన్ను గురించి అన్ని విషయాలూ నాతో చెప్పుకోలేక పోవచ్చు.—నీ దగ్గర నుంచి దాచే విషయాలు నాకేవీ లేవు, ఈ విషయం నీకు తెలుసు అనుకొన్నాను."

"నువ్వు ఎంతో దిగులుగా, వింతగా, మాట్లాడుతున్నావు. నాకెట్లాగో వుంది బావా."

"ప్రతివారి ముందూ ఎంత కాలం నటించగలం అమృతం? ఎప్పుడో ఒకప్పుడు ఎవరి దగ్గరో వొకరి దగ్గర మన నిజస్వరూపాలు బైట పెట్టక తప్పదు, రహస్యాలని బాధ లేకుండా చెప్పుకుంటే, విమర్శించకుండా విని, అర్థం చేసుకొని సానుభూతి చూపే వ్యక్తులు కనపడేవరకూ, స్నేహితుల కోసం అన్వేషించక మానం, సత్యాన్ని, సౌందర్యాన్ని—అన్వేషించడం అంటే, నిజంగా యిదే అర్థం—"

"ఏమిటో బావా, మొగాళ్ళ రహస్యాలు ఆడాళ్ళతో ఎందుకు చెబుతారు? ప్రతి మొగాడూ ఆడదాని ముందర కొంత దాస్తాడు."

"ఐతే నేను నీతో చెప్పే విషయాలని నువ్వు నమ్మితే వట్టి మాట."

"నువ్వు కొన్ని నిజం చెబుతావు. కొన్ని అసలే చెప్పకపోవచ్చు. స్త్రీతో చెప్పకూడనివి ఎన్నో వుండొచ్చు."

"నేను నిన్నెప్పుడూ స్త్రీగా పరిగణించలేదు అమృతం. కన్నీరు కారిస్తే తడిసి నీరై పోయిన స్వప్నకాంతలాంటి దానవు...."

అమృతం నిశ్శబ్దంగా నవ్వింది. అప్రయత్నంగా చెట్టుకొమ్మని కదిపి, ఆకుల్ని వేళ్ళతో విరుస్తోంది. కీచురాయి కదిలింది.

"అబ్బ చలిగా వుంది—జబ్బు చేస్తుంది. లోపలి కెడదాం బావా-నాకు వెన్నెట్లో నువ్వు సరిగ్గా కనపడటం లేదు" అంటూ అమృతం మండువాలోకి చేరుకుంది. ఇద్దరూ హాల్లో కొచ్చారు. పాత సంగతులు స్మరించుకుంటున్నారు. జగన్నాథం పట్నంలో కాలేజీలో చదువుతున్నాడుట. నాగమణి పెళ్ళి చేసుకుందిట; భర్తకి నాయుడు పేటలో వుద్యోగంట. తరువాత సుశీల విషయం మాట్లాడుకున్నారు.

"నాకో అనుమానం వుంది బావా-సుశీలకి నీ మీద వుండే దని" అంది అమృతం తన పాదాలకేసి చూస్తూ. నిధికి యీమాటలు వింటే నవ్వొచ్చింది.

"మీద వుండటం ఏమిటి అమృతం-ప్రేమించిందని అనొచ్చుగా!"

"ఏమో అబ్బా, ఎట్లా అంటాలో నాకు తెలీదు" అంది మూతి వంకర చేసి.

"ఫరవాలేదులే-సిగ్గు పడేటందుకు మనం చిన్న వాళ్ళంకాము. సుశీల నన్నే కాదు; ఎవర్నీ ప్రేమించలేదు!"

"అసలు ప్రేమించడం అంటే ఏమిటి బావా?"

"ఏమో నాకు తెలియదు. కాపరం చేస్తున్నదానవు నీ కెక్కువ అనుభవం వుండాలి—"

"నాకేం వుంటుంది పల్లెటూరి మొద్దుని; ఏ నీబోటిగాళ్ళో చెబుతుంటే వినడమే—"

"చాలామంది జీవితంలో 'ప్రేమ' అనుభవించకుండానే జరిగి పోతుంది. కలలోనూ, పుస్తకాలలోనూ, కళలోనూ ప్రేమని తెలుసుకుని తృప్తిపడాల్సిందే—"

"నువ్వూ అంతేనా ఏమిటి బావా?" అంది అమృతం కళ్ళ కొనలనుంచీ చూస్తూ.

"ప్రేమని ఆశించడం పురుషుడి వొంతూ-దాన్ని యివ్వడం స్త్రీ వొంతూ."

మధ్యలో అమృతం అందుకొని—

"ఐతే బావా, సుశీల విషం తాగి చచ్చిపోయిందంటారు, నిజమేనా?"

"నిజం కావొచ్చు భర్త శంకించి వుండొచ్చు. గర్వి ఈ పరాభవం భరించలేక చేసి వుండొచ్చు—"

"ఇందులో నువ్వు చేసిన అపచారం ఏముందీ?"

"ఏమీ లేదు. తన స్వార్థాన్ని స్తుతించలేదు."

అమృతం ఆవులించి. కళ్ళని తుడుచుకుని గదిలోకెళ్ళి మంచం మీద కూర్చుంది, పక్కంతా సర్ది తలగడాని వొళ్ళో వేసుగుని. కాళ్లు వూగిసలాడిస్తూ, కొంచం గట్టిగా అడిగింది,

"బావా—నువ్వు మీ ఆవిడతో కాపరం పెట్టవా ఏమిటి?"

దయానిధి గదిలో కొచ్చి, కుర్చీ వాల్చి కూర్చున్నాడు.

"ప్రేమించిన వాళ్ళు పెళ్ళి చేసుకోలేరు: పెళ్ళి చేసుకున్న వాళ్ళు ప్రేమించలేరు—అదీ యీ దేశంలో యువకుల చరిత్ర."

"నీవన్నీ చిత్రమైన భావాలు బావా!" అమృతం వికృతంగా వొళ్ళు విరుచుకుని పక్కమీదికి వొరిగింది.

"అబ్బ, పిన్నులు గుచ్చుకుంటున్నై బాబూ—" అని లేచి. పిన్నులను దిండు కింద పెట్టింది,

"నీకు నిద్రొస్తోంది-నే వెళ్లి పడుకుంటా—" అని నిధి లేవబోయ్యాడు.

"కూచో బావా—ఇల్లా కూర్చుని మనం కబుర్లు చెప్పకోడం ఏన్నాళ్లకో. నేను వొస్తాను, మనం మీ మామగారి దగ్గరి కెళ్ళి, ఇందిరని తీసుకొద్దాం?"

అతనేమీ మాట్లాడలేదు,

"బావా, కోమలెక్కడుంది?—"

"ఏమో—"

"ఓస్, ఏం తెలియనట్టు మహా, నా దగ్గర ఎందుకు దాస్తావ్?"

"కోమలి కోసం నీ దగ్గర చేసిన బాకీ ఎల్లా తీర్చాలో ఆలోచించవలసినప్పుడే కోమలి జ్ఞాపకం వొస్తుంది, ఆ రోజుల్లో బావ్యా ప్రపంచంలోని ప్రేమ కోసం తహ తహ లాడాను,"

"ఇప్పుడూ?"

"ఇప్పుడూ నాలోని ప్రేమతో సమాధాన పడుతున్నాను."

"నాకేమీ అర్థం కాలేదు."

"నేను వెళ్ళి పడుకుంటా" అని నిధి లేచి వెళ్ళి, గుమ్మం ముందు మడత మంచంపై పడుకున్నాడు. కాసేపు నిశ్శబ్దం, అమృతం పెట్టె తీసిన చప్పుడైంది. బట్టమడతలోంచి కర్పూరం వుండల పరిమళం వేసింది. సబ్బు బిళ్ళల పెట్టిలో రూపాయల గలగల వినబడింది, అమృతం గదిలో ఏం చేస్తోందో! గది తలుపులు వేసుకోమంటే? గాజుల చప్పుడు, దిండ్లని సర్దిన శబ్దం, నిలిపేసిన అపులింత—మళ్ళా నిశ్శబ్దం.

"నిద్ర పట్టిందా బావా?" అని అడిగింది లోపల్నుంచి.

"ఊఁ" అన్నాడు. కాని అది అబద్ధం అని అతనికి తెలుసు.

"అబద్ధం" అంది.

"నిధికి భయమేసింది. ఈ ఆడాళ్ళు అన్ని విషయాలూ ఎల్లా తెలుసుకుంటారో చిత్రం అనుకున్నాడు.

"అంటే పడుతో పడుతో వుంది" అన్నాడు,

"మా జగ్గు అడిగినట్లు, ఆ అవస్థ ఎట్లాంటిదో వర్ణించు బావా" అంది.

"ఓ. కళ్లు మూతలు పడడం—కుడి కన్ను తెరవడం; ఎడమది ముయ్యడం; కుడిచెయ్యి తలకింద తీసి, ఎడమ చెయ్యి పెట్టడం; వెల్లకిలా పడుకోడం; తరవాత బోర్లకిల పడుకుని, దిండులో మొహం గుచ్చుగోటం"—

అమృతం నిలిపి నిలిపి, మసీదులో మృదంగం మోగిస్తే ప్రతిధ్వనించినట్లుగా నవ్వుతోంది.

మళ్లా నిశ్శబ్దం. పక్క డాబా యింట్లోంచి, గడియారం పదకొండు కొట్టింది, పదితుణాలలో ఆ నిశ్శబ్దం భగ్నమైంది.

ఆకాశంలో బంగారపు కత్తులని ఎవరో విరిచి పారేసినట్లుగా మెరుపులు—గాలికి వొక్కసారిగా కిటికీ తలుపులు కొట్టుకున్నాయి. నేలమీది ఆకులు లేచి లోపలపడుతున్నాయి, దీపం నృత్యం చేస్తోంది. భయంకరంగా పిడుగులు దిక్కు తేల్చకుండా మారు మ్రోగు

తున్నాయి. గదిలో గోడని కేలండర్ కాగితాలు చప్పుడుచేసి కింద పడ్డాయి. గోడనున్న నిధి తల్లి ఫోటోగ్రాఫ్, కిందపడి పగిలింది. అమృతం లేచి, గాజు ముక్కల్ని పోగుచేసిన చప్పుడవుతోంది. దీపం ఆరిపోయింది.

“నాకు భయమేస్తోంది బావా” అంది,

అతను లేచి అగ్గిపెట్టె కోసం గదిలో కొచ్చి, బల్లమీద తడుము లాడుతున్నాడు. మెరుపుల వెలుగులో కనపడుతుందని నిదానంగా చూస్తున్నాడు. కిటికీ తలుపులు మూసుకున్నాయి. అంతా చీకటి, బైట రొద. అమృతం దీపంమీద చెయ్యిపెట్టి, “అబ్బ కాలింది” అని గొణిగింది. నిధి చెయ్యి ఆమె భుజంమీద పడింది. ఆ చేతికి తనమెడని ఆనించి ఒరిగింది, చెయ్యి తీసేశాడు. వెళ్ళి కిటికీ తలుపుతీశాడు. అగ్గిపెట్టె, మంచం పక్కన అలమార్లో వుంది, దాన్ని తీసి దీపం ముట్టించాడు. తలుపులు కొట్టుకోకుండా, రాళ్ళు పెట్టాడు. వెళ్లి గదిలో మంచం మీద కూర్చున్నాడు.

“నీకు భయంగా లేదు బావా?” అన్నది అమృతం. నిధి లేచాడు. అమృతం మంచం మీద కూర్చుని, దిండుని వొళ్లో వేసుకుని కాళ్లు వూగిసలాడిస్తోంది. బోర్డర్ లేని పసుపు పచ్చరంగు వెల్వెట్ పట్టుచీర కట్టుకుంది. దానిమీద ఎర్రరంగు, అంచులేని, సిల్కు జాకెట్టు వేసుకుంది.

“ఖద్దరు చీరలో నిద్రపట్టదు. సిల్కుచీర చలేస్తుంది. ఎల్లా బావా? బాగుందా చీర...”

అతనికేసి జాలిగా చూసింది.

“అమృతం...”

“ఎందుకు బావా?”

“యిల్లా ఎందు కొచ్చావు?”

“ఏం?”

“ప్రపంచానికి లేని ఆపేక్ష నీ కెందుకు?”

“అదేమిటి బావా— ప్రపంచానికి ఆపేక్ష ఎందుకుంటుంది, ఎవళ్లో వొకరిద్దరికి తప్ప—”

అమృతం కళ్లు బరువుగా, మెరుస్తున్నాయి. కళ్లకింద నల్లి

నీడలు వెన్నెట్లో మెరిసిన మంచిగంధం మ్రానులా తీర్చుకున్నాయి విప్పారుకుని, ప్రేమతో పదింతలైంది మొహం.

"అమృతం..."

అతనికి ఏమనాలో తెలియడంలేదు. వాక్యాలూ, మాటలు అన్నీ మాయమయ్యాయి.

"ఏం బావా?"

ఉప్పెనలా గాలి గదంతా కమ్మేసింది. కడసారి నృత్యం ముగించిన దీపం మూర్ఛపోయింది. అమృతం చేతులు అతని భుజంమీద పడ్డాయి. సముద్రంలో కొట్టుకుపోయే వ్యక్తికి; రబ్బరుబంతి దొరికినట్లుగా. ఏదో శక్తి అతన్ని కిందికి నెట్టేస్తోంది. అతను మంచం పైన కాళ్ళు ఊప కూలబడి పొయ్యాడు. అంతా చీకటి. అతని కళ్లు అమృతం వొళ్ళో తెరుచుకున్నాయి. అతని నుదిటిని చలిమంటలా కాల్చింది అమృతం కడుపు. కనురెప్పల్ని, ఆమె పెదాలు మెత్తగా కోసేస్తున్నాయి, ఆమె రెండు చేతులూ అతన్ని ఎక్కడికో తీసుకుపోతున్నాయి. భరించరాని సౌందర్యపు వెలుగుతో అతనికి స్పృహ తప్పింది. అమృతం జుట్టుముడి వూడింది. జడంతా అతన్ని కప్పేసింది— నిశీథిలా కన్నీటి చుక్కలచే చీరతడిసి, అమృతం లోదలు చలితో వేడెక్కుతున్నాయి. ఆకాశం తన వొక్కడి మీద నిశ్చింతగా వర్షిస్తోన్నట్టు, అతని మెడ వెనుక భాగం మీద, కన్నీరు వునికి వున్న ఇంద్రధనస్సులా ఆవరించింది. "బావా" అంది ముక్కలై అయ కోసం తడుములాడుతున్న కంఠంతో. భూమి తిరిగిపోతోంది, స్థలం సమయం గతులు తప్పాయి. విశ్వమే కదలిపోతున్నట్లుంది. ఎక్కడికో ఇంకా, యింకా దగ్గరగా కలిసి, వొకరై, అన్ని రహస్యాలనీ ఛేదించి, అన్ని లోతుల్నీ శోధించి, అన్ని శిఖరాలనీ సాధించి, వొంటి జీవంగా కొట్టుకుని, విశ్వరహస్యానికి ప్రాణం పోశారు. ఆలోచనా, విమర్శనా, తర్కం. చైతన్యం—అన్నీ ఉద్రేకాల ప్రవాహంలో కెరటంపై నురుగలా కొట్టుకుపోతున్నాయి. దేనికోసమో, రెండు ప్రాణులు సృష్టిశక్తులను కేంద్రీకరించి పెనుగులాడుతున్నాయి — ఎక్కడో అది యథార్థమై వుంటుంది, రక్తం పట్టు తప్పి నిష్య్ర ద్రావకంలా పొర్లి శరీరాన్ని కడిగి పవిత్రం చేస్తోంది, సర్వేంద్రి

యాలూ విడిపోయి జీవకణాలుగా శరీరాల్ని మార్చేశాయి. శరీరం అనుభవంతో అద్వైతమైపోయింది.

*　　　*　　　*

ఆ క్షణం సృష్టి నిల్చిపోయింది ప్రాణం స్తిమిత పడింది. నిప్పులో కాలిన మల్లెపూల పరిమళం, అమృతం శ్వాసలో చుట్టేసింది, మెత్తటి బలంతో తడిసి ముద్దయి, ఆనందంతో ఎర్రగా అలిసిపోయి, సూర్యుడి లోని వేడిమికి కరిగిన మంచుకణమై, అమృతం పక్కమీద వాలి పోయింది. ఆ శరీరం అది, ఎవ్వరూ 'యిది నాది' అనలేరు. సృష్టి అనాది నుంచి వుండిపోయి నిద్రనించి లేచి మరచిపోయిన శరీరం అది.

దయానిధి మంచం మీద నుంచి నేలమీద కూలిపొయ్యాడు.

అమృతం చేతికింద దిండు, కిందికి జారింది, దాని మీద తల ఆనించి కళ్ళు మూశాడు. ఓపిగ లేకుండా కురుస్తున్న వర్షం నిలిచి పోయింది. చప్పబడి, నీరసించి ప్రకృతి విశ్రమించింది, విషాదంగా వెన్నెల కిటికీలోంచి నీడో్కలిస్తోంది. పక్క డాబాలో గడియారం వొంటి గంట కొట్టింది. నిధి లేచి వెళ్ళి, గది గుమ్మం ముందు మంచం మీద పడుకున్నాడు. నారయ్య, నారాయణ సినిమా నుంచి రావడం, పక్కచుట్టలు సర్దుకుని, పడుకోవడం చప్పుడైంది.

దయానిధికి నిద్ర పట్టలేదు. లేచి నిలబడ్డాడు, కాళ్ళు నేల మీద ఆనడంలేదు. మరో శరీరంలోకి జొరబడ్డట్లయింది. అమృతం శరీరం పరిమళం తనని ఆవరించింది. తువ్వాలుతో మొహం తుడుచు కున్నాడు. గదిలో కెళ్ళి అగ్గిపుల్ల గీసి, దీపం ముట్టించాడు, తలుపు చేరేశాడు, అతనికి భయమేసింది, సిగ్గేసింది తనదే ఆ మొహం మరో లోకంలో కెళ్ళి, అద్దంలో నీడ చూసుకున్నట్లుంది, అలిసి కృశించిన మొహంలో ఏదో కొత్త వికాసం, వెలుగు, ప్రతిభ కనిపిస్తూంది, ఈ కళ్ళతో మళ్ళా ప్రపంచాన్ని చూడడమా! స్వప్నంలో తెరుచుకుని చూడటం నేర్చుకున్న నేత్రాలతో యీ బాహ్యప్రపంచాన్ని చూడటమా?

దీపం తీసుకుని మంచం దగ్గరకెళ్ళి పైకెత్తి, అమృతం కేసి చూశాడు, సిగ్గేసింది. ఆమె కేసి చూడలేక పోయాడు, అది నిద్రా

దేవతే నిద్రపోవడం లాగుంది, దీపం దాచేశాడు, బైట రోడ్డు మీద్కి వొచ్చేసి ఆకాశం కేసి చూస్తూ వొంతెన మీద కూర్చున్నాడు, బనీను లోపల మెడ వెనుక ఏదో పట్టుకున్నట్లయింది, తడిమి బైటకితీశాడు, నల్లటి పొడుగాటి వెంట్రుక, అమృతం జడలోది, అతనికి భయ మేసింది, తనకే తను వింత మనిషి లాగున్నాడు. అతని పూర్వపు భావాలు, ఆదర్శాలు, అభిప్రాయాలు—వాటికీ తన నిజతత్వానికీ ఎంతటి భేదం వుందో తెలుసుకుంటే అతనికి భయమేస్తోంది. అతని తత్వం అతనికే తెలీక పోవడం ఆశ్చర్యం. తను ఆ వాతావరణంలో వుండలేడు. అదంతా మైలపడి పోతుంది. సూర్యోదయం కాగానే అమృతాన్ని ఎల్లా చూడగలడు? అమృతం తన నిజస్వరూపాన్ని తనకి చూపించి, హాయిగా నిద్రపోయింది. ఈ కళ్ళతో యీ వ్యక్తులనీ, యీ స్థలాన్నీ చూడలేడు, చంద్రుడే చిత్రంగా కదులు తున్నాడు. పక్కింటి గడియారం రెండు కొట్టింది. లోపలి కొచ్చి మెట్లమీద కూర్చున్నాడు. సుశీల చావుకి కారణమైన తను కృష్ణమూర్తికి మందు లిచ్చినతను, అవకాశం వున్నా, కోమల్ని తాకకుండా బైటకొచ్చిన తను, షేక్స్పియరు సమస్యని పరిష్కారం చేయదలచిన తను—

లోపలి కెళ్ళి, చప్పుడు కాకుండా, డ్రాయర్లోంచి, షేక్స్పియర్ వ్యాసం తీసుకుని, బైట కొచ్చి, మెట్లమీద కూర్చొని, నిప్పు పుల్ల వెలిగించి, కాగితాలని తగలబెట్టాడు. మళ్ళా లోపలి కెళ్ళి, అమృతం పెట్టితీసి సబ్బుబిళ్ల పెట్టిని వెళ్లగించాడు. అందులో రెండు వందల ఎనభై రూపాయ లున్నాయి. భూములమీద శిస్తు కాబోలు. అంతే? మిగతాది నారాయణ దగ్గరుంది కాబోలు. ఎనభై పెట్టెలో వుంచి, రెండువందలు తీసుకున్నాడు. తాళాల గుత్తి దిండుకింద వుంచాడు. అమృతం తలవెంట్రుక కవర్లో పెట్టాడు. తొందరగా వహోల్డాలు సర్దుకున్నాడు. అమృతం బరువుగా కదిలి, పక్కకి తిరిగి పడుకుంది. పక్కింటి గడియారం మూడు గంటలు కొట్టింది. ఓ వుత్తరం రాసి, నారయ్యా చాపకింద పెట్టాడు. మరో వుత్తరం రాసి అమృతం గాజు వెనక పెట్టాడు. "ఋణం తీర్చుకో సాహసించ డానికి నే నెవర్ని?" అని. అది చదివి ఏమనుకుంటుందో! "ఏం

శన్నం వుంటుంది. అందులో నుండి సూర్యరశ్మి సోకితే తప్ప వెలుతురు లేదు, కాలవ, పిల్ల కాలవ. చెఱువు, నుయ్యి ఏమీ కనపడవు.

ఆవులు, గేదెలు, గొఱ్ఱెలు, ఆ కొండ గుహాలలో సత్యాన్ని అన్వేషించే వేదాంతులులా సంచారం చేస్తాయి. ఏ రాతి ప్రక్కనుంచో గాడిద దర్శనం యిచ్చి. భయపడి పారిపోతుంది ఎక్కడో నల్లకుక్క కుంటుకుంటూ కదిలిపోతుంది వాటి యాత్రకి ముగింపు లేదు ఉండి ఉండి అస్థి ఆకులూ రాలిపోయి, మొండి కొమ్మల చెట్టు, కొమ్మల్ని చాచి అస్థి పంజరం ప్రదర్శిస్తుంది. ఆ చెట్లకి ఆకులే వుండవేమో! ఆకాశంలో గద్దలు యీ ప్రకృతి సంపదకి గస్తీ తిరుగుతుంటాయి. కాకులు, నల్ల గోరువంకలు తరుముకుంటూ ఎగురుతాయి. వెళ్ళగా వెళ్ళగా ఎక్కడో వొక నుయ్యి వుంటుంది, దానికి వర లుండవు; అది మనుషుల కష్టాన్నేమో. చచ్చిపోయిన మనుషులే దానికి కావాలేమో! అవతల ప్రపంచంలో వాళ్లు అందులో నీళ్ళు సులభంగా తోడుకోవచ్చు, ఆ స్థలంలో సూర్యుడు తీక్ష్ణంగా ప్రకాశించలేడు. ఆరాళ్ళ వెనక సూర్యాస్తమయం చూస్తే ఏడవాలనిపిస్తుంది.

ఎక్కడా మనుషులే కనబడరు. అది వూరు. నాలు గిళ్లు - వది గొఱ్ఱెలు - మూడావులు - రెండు కోళ్లు - వొక ముసలిది ఎండలో కూర్చుని ఏదో చేస్తుంటుంది, నల్లటి చీర-వొంటికి చాలదు; పంచుల్లా వేళ్ళాడే చేతులు - తెల్లబడగా మిగిలిన జుట్టు, మూసుకు పోయిన కళ్లు, విప్పుకొన్న పెదవులు, వొంగిన నడుం - ఆమె కూడా మనిషి సంతతే. ముసలివాడు రాళ్లు కొడుతున్నాడు; కట్టెలు కొడుతున్నాడు, మోకాళ్ళపైకి పంచి; నల్లటి మొలతాడు; దుమ్ము రంగు పాగా. అక్కడ వార్ధక్యమేగాని యవ్వనం లేదు, ఆ మనుషులకి యవ్వనదశే వున్నట్లు తోచదు, రాళ్ళల్లో ఆడుకుంటూ ఆల్చిప్పల్ని ఏరుకుంటున్న కుర్రాళ్లు కూడా ముసిలి నవ్వులు నవ్వుతారు, వాళ్ళ మొహాలలో సంతోషం, చైతన్యం, యవ్వనం, ఉత్సాహం ఏమీ లేవు. గ్రామదేవత సంతానం, ఆకలిదప్పులు. 'నన్ను చూడండి' అంటూ వారి స్వరూపాలు దాల్చి పుట్టి వస్తున్నాయి, ఆ ప్రదేశంలో. ఆ స్థలాలతో మనుషులకి నిమిత్తం లేదు, దైవానికే తప్ప. అక్క-

డుండే మనుషులు కూడా, ఆ స్థలంలోనివారే. వారికి వేరే వునికి, వ్యక్తిత్వం లేదు, అన్నీ రాళ్లు. రాళ్ళు; వారు కదిలే రాళ్ళు. నిజంగా అది రాయలసీమ కాదు; ఎవరో అన్నట్లు రాళ్లసీమే!

నిధికి, అనంతాచార్యులుగారితో మొదట మునిమాడుగులో పరిచయం కలిగింది. ఆయన పెద్దకూతురు లక్ష్మీదేవికి జబ్బు చేసిందంటే చూడ్డానికి వొచ్చాడు. ప్లేగ్ అని తెలవగానే ఆమె మామగారు, భర్త వేరే చోటికి వెళ్ళిపోయారు. తండ్రి వొచ్చిన రెండు రోజులకే నాలుగు సంవత్సరాలు వయస్సుగల కూతురు యీ ఘోర వ్యాధికి గురియై చనిపోయింది. రాత్రి ఎనిమిదింటికి నిధి, అనంతాచారిగారు ఆ పిల్లని పూడ్చి వొచ్చేశారు. రాత్రంతా తల్లిని వోదార్చటంలో గడిచింది. రాత్రికి రాత్రి, యిద్దరు కూలీలను తీసుకు వెళ్ళి నిధి, రెండుమైళ్ళ దూరంలో వొక పాకలాంటిది వేయించి, తెల్లవారేదాకా ముగ్గురూ అక్కడే గడిపారు. తరవాత నాలుగు రోజులకి లక్ష్మీదేవి భర్త వొచ్చి ఆమెని కర్నూలు తీసుకు వెళ్ళాడు.

అనంతాచార్లుగారిది అనంతపురం జిల్లాలో వజ్రకరూర్‌కి ఆరుమైళ్ళ దూరంలో వున్న న్యాయంపల్లి * అనే గ్రామం. కాంగ్రెస్‌లో చేరి ఎంతో సేవ చేసి చుట్టుపక్కల పేరు, పలుకుబడి గలవాడు. ఇటీవల సంచారం తగ్గించి, స్వంత పనులు, వ్యవసాయం చూసుకుంటున్నాడు. రాత్రుళ్లు పురాణ కాలక్షేపం చేస్తూ, నిశ్చింతగా గడుపుతాడు. ఆయనది చాలా పెద్ద కుటుంబం. ఆయనా, భార్యా, నలుగురు ఆడపిల్లలు, ముగ్గురు మొగపిల్లలు; ఇద్దరు ఆడపిల్లలకి పెళ్ళిళ్లు చేశాడు. కాత్యాయని, రాధ పెళ్లికున్నారు. రాధ ఆఖరిది. చిన్నపిల్ల, కాత్యాయనికి పదిహేనో ఏడొచ్చింది. పెద్ద పిల్లవాడు రాఘవుడు, ఇంజనీరింగు చదువుతున్నాడు. కడం యిద్దరూ స్కూల్లో చదువుకుంటున్నారు. స్థిరపరుడు కాకపోయినా, ఆయన కుటుంబం, గుంభనంగా, లోటులేకుండా ఎట్లా గడిచిపోతుందో చాలా మందికి తెలీదు. ప్రజాసేవకుడనీ, పండితుడనీ తాలూకాలో పెద్దమనుషు లందరూ ఆయనకేదో యింత ముట్ట

* న్యాయంపల్లి, ఊహించిన గ్రామం.

చెబుతుంటారు. ఆయన అన్నగారు బళ్ళారిలో పెద్దవకీలు. కాని వారికీ వీరికి సంబంధాలులేవు. అనంతచారిగారు జైల్లోవున్న ఏడాదీ, చుట్టుపక్కల స్నేహితులు ఆదుకున్నారు కాని, అన్నగారేమీ సహాయ పడినట్లు లేదు. ఐనా, అన్నగారింట్లో ఏ కార్యం వొచ్చినా, ఎవరికి జబ్బుచేసినా, యీాయన వెళ్ళి తగినంత సాయంచేసి, వొస్తూంటారు. ఆయన భార్య రాజమ్మగారి కిదంతా నచ్చకపోయినా, యీా విషయం తేల్చకుండా, భర్తకి చాలా అనుకూలంగా వుంటూ, సంసారం గౌరవంగా దిద్దుకుంటుంది. ఆవిడకి యిల్లే ప్రపంచం.

అనంతాచార్లుగారు నిధిని తనతో వొచ్చెయ్యమన్నాడు. ఆ జిల్లాలో డాక్టర్ల అవసరం ఎంతో వుందనీ, తన భుక్తికి ఏమీ లోటు ఉండదనీ, తన శ్రేయస్సు కోరేవాళ్ళు స్వంత స్థలంలో ఎవరూ లేనందున అతను యిక్కడే వుండటం మంచిదని నచ్చజెప్పి, నిధిని వొప్పించారు. అనంతాచార్లుగారే కర్నూలు వెళ్ళి పెద్దకూతుర్ని తీసుకుని నిధితో కలిసి వారం రోజుల్లో న్యాయంపల్లి వొచ్చేశారు. అప్పటికప్పుడే ఆ తాలూకాలో కూడా కలరా ప్రాకింది. అనంతాచారిగారు నిధికి ఓ సైకిల్ సంపాదించి పెట్టారు. దానికి బాగ్ తగుల్చుకుని మళ్ళా పల్లె పల్లెకి తిరిగి పని చెయ్యడం సాగించాడు. ఒక్కొక్క సమయంలో రాత్రుళ్లు భోజనం లేకుండానే, ఏ పాడబడిన గుడిలోనో, పేషంట్లతోనో గడపడం జరిగేది. గుడికి దూరంగానే దేవుడి సమక్షాన, ఎన్ని శవాలని తగల బెట్టాడో!

ఇరవై రోజుల్లో పరిస్థితులు బాగుపడ్డాయి. నిధికి తిరగడం తప్పింది. అనంతాచారిగారింట్లో ముందుగదిచ్చారు. ఇల్లు అంత పెద్దది కాదు. దొడ్డిమాత్రం చాలా పెద్దది. ఇంటి వెనకాల అంతా ఖాళీ. ముందు గదిలో వొక పురాతనపు ఈజీచైరూ, పుస్తకాల బీరువా వున్నాయి. గది చిందర వందరగా వుంటుంది. బీరువాలో పురాణ గ్రంథాలు—రామాయణం, భాగవతం, భగవద్గీత, భట్టి విక్రమార్క కథలు, కాంగ్రెస్ కార్యక్రమానికి సంబంధించిన గ్రంథాలు వున్నాయి. ఉదయం యింత కాఫీతాగటం, సైకిల్ మీద వజ్రకరూరో, చుట్టుప్రక్కల పల్లెకో వెళ్ళి పేషెంట్లని చూడటం, మధ్యాహ్నం భోజనం, నిద్ర, సాయంత్రం మళ్ళా పని మీద వెళ్లటం,

రాత్రి పురాణ కాలక్షేపం, లేకపోతే రామాయణాన్ని పఠించటం - ఇదీ అతని దినచర్య.

ఒక రోజున దొడ్లో స్నానానికని, వంటింట్లోంచి వెళ్ళబోయ్యాడు నిధి. అనంతాచార్లుగారి రెండో కుర్రాడు రేపు అట్లా వెళ్ళకూడదని చెప్పి వేరే గదిలోంచి దొడ్లోకి తీసుకెళ్ళాడు. భోజనం కూడా అతనికి ముందల గదిలోనే పెడుతున్నారు, ఇతను అనంతాచార్లుగారితో వాదించటం, ఆయన భార్య రాజమ్మని కూడా తెయ్యడం జరిగింది. ఇతన్ని వంటింట్లోంచి వెళ్లనిస్తున్నారు కాని భోజనం మాత్రం వేరేనే పెడుతున్నారు. ఇంతలో రెండో అమ్మాయి మాధవి పురిటి కొచ్చింది. మాధవి భర్తకి సికింద్రాబాద్‌లో పుగాకు పరిశోధనాలయంలో పని. ఆ అమ్మాయి నెత్తిమీద ముసుగేసుకు ఉంది. ముఖమల్ జోళ్ళతో కాని యింట్లో నడవదు. ఒకటి రెండు రోజులు తల్లి, ఆమె ఘర్షణ పడ్డారు. జోళ్లు తీసేసింది. కాని ముసుగు తియ్యలేదు రాజమ్మగారు నచ్చజెప్తే, కొంతవరకు అంగీకరించి, 'వూ' అనే రకం కాని, మొండి పట్టుదల మనిషి కాదు. పూర్తిగా వొప్పుకోకుండా, సగం సగం అంగీకరిస్తుంది. మాధవితో కూడా, కొడుకు 'గోపు', ఇంట్రోతు రెహమాను, ఆడబడుచు అండాళమ్మ కూడా వున్నారు. ఎవరికో ఏదో జబ్బు చేస్తూనే వుండేది, నిధి వారికి మందులిస్తూనే వుంటాడు; బళ్ళారి వెళ్ళి, వొంద రూపాయల మందులు తీసుకొస్తానని, వారంరోజులు బళ్లారి వెళ్ళి వొచ్చాడు నిధి. క్రితం రాత్రే మాధవి ప్రసవించి ఆడపిల్లని కంది. పురిటిమంచం ముందు గదిలో ఏర్పాటు చేశారు. అనంతాచార్లుగారితో చెప్పి దొడ్లో దూరంగా—అంటే ఫర్లాంగు దూరంలో - మొండి చెట్టు కింద రాళ్లు పరిపించి, నాలుగు కర్రలు నాలుగు మూల్లా పాతించి, తాటాకూ పూరిగడ్డి వేయించి, చిన్న కుటీరం లాంటిది నిధి ఏర్పాటు చేయించుకున్నాడు, ఆ కుటీరానికి 'శాంతి' అని పేరు పెట్టుగుని, తన హోల్డాలు, బేగ్, వోబల్ల, కుర్చీ, రెండు పొడుగాటి నేలమట్టం బల్లలపైన పక్కా, అందులో వేయించుకున్నాడు. అందుకే వొంటిగా వుంటూ భోజనానికి, కబుర్లకీ అనంతాచారిగారింటి కెడుతూ కాలం వెళ్ళబుచ్చుతుండేవాడు.

ఒక రాత్రి భోజనం చేసి దొడ్లో చెయ్యి కడుక్కుంటూంటే రాజమ్మగారికి తేలు పట్టింది. ఆ బెంగ [illegible] చెప్పి 'వామోయ్ మంత్రగబ్బిని' కేకేసి వంటింటో పడుకుని ఏడవడం సాగించింది,

మూడయిపోయే కుర్రాడు పిలవగానే నిధి తన లాంతరు వేస్తు ఏసుకు వచ్చాడు, ఈ లోగా అనంతాచార్యులు పెద్దగా వేపం తీసుకుని వెదికి, ఆకుల తేలే లేదు, ఏ గండుచీమో, దానికింత గోడవేమిటని భార్యని కేకలేస్తున్నాడు. రాజమ్మగారు, మొగుణ్ణి కసురుకుని భోరున ఏడవడం సాగించింది, ఆమె చుట్టూ అఖరు కుర్రాడు రంగడు, కాత్యాయని, బాధమూర్తి చూస్తున్నారు, దొడ్లో నిధి నుంచుని, 'లోపలికి రమ్మంటూ రా?' అని అడిగాడు. రాజమ్మ గారు తెరిపి చేసుకుని వచ్చి 'దయ్యాన్ని మందీ వాయనా, మంత్రగబ్బే' అన్నది. నిధి వంటింట్లో కెళ్ళి నెప్పి కనపడకుండా శ్రాజక్ష నిచ్చాడు. ఈలోగా హనుమంతప్ప మంత్రగాణ్ణి తీసుకొచ్చాడు. వాడు మంత్రం వేశాడు రాజమ్మ తెల్లారగట్ట నాలుగింటి దాకా బాధ పడుతూ మూలుగుతునే వుంది. అందరూ మెల్లి మెల్లిగా పక్కల మీద వాలి గారు. అనంతాచార్లుగారు, ముందువాలో ముసుగుతన్ని పడుకు న్నారు. పిల్లలంతా పడుకున్నారు. నిధి మాత్రం ఆవిడ పక్కనే పత్రిక చదువుతూ, వోదారుస్తూ తెల్లవార్లూ జాగారం చేశాడు. మూడింటికి రహమాన్, తనో తేళ్ళకుటుంబాన్ని, రోడ్డు పక్కన బండకింద సాయంత్రం చూశానన్నాడు, నిధి అతనితో యీ విషయం ఎవ్వరితోనూ చెప్పొద్దని, రహమాన్‌తో కలిసి వెళ్ళి, వో పెద్ద చూడుతున్న తేలుని తీసుకొచ్చి, దొడ్లో రాజమ్మగారు చెయ్యి కడుక్కున్న చోటున పడేయించి, నాలుగింటికి దీపంతో దొడ్డంతా వెదికి తేలుని పట్టుకున్నట్లు అభినయించి, ఆ తేలుని చంపి, రాజమ్మ గారికి చూపించాడు, అది మంత్రగబ్బ కాకపోయినా, ఆజాతిదే అని ఆవిడతో చెప్పాడు. దాన్ని చూసింతర్వాత, ఆవిడ బాధంతా తగ్గి మూలగడం మానేసి, నిధిని మెచ్చుగుని భర్తని కాసేపు సణిగి నిద్ర పోయింది, ఐదు గంటలవుతోంది. నిధి దొడ్లో గేదెని పాలు పితక డాని కెళ్ళాడ, అది సరిగ్గా నిలబడటం లేదు. ఇంతలో 'నెప్పి తగ్గిందా అమ్మా' అంటూ కాత్యాయని లేచింది, అమ్మ మాట్లాడలేదు, దొడ్లో

నిధి గేదెతో పడుతున్న అవస్థ చూసి, దొడ్లో కొచ్చి, గేదెని పలుపుతో పట్టుకుని నిలబెట్టింది. అతను పాలు పితికాడు. గబగబా వంటింట్లో కి పరుగెట్టి, కాత్యాయని కుంపటి ముట్టించి పాలు కాచి కాఫీ తయారు చేసింది. నిధి రాజమ్మగార్ని లేపాడు. ఆవిడ మొహం కడుక్కుని, 'మా నాయనే—ఎంత మంచి కాఫీ' అని నిధిని మెచ్చుకుంటూ మళ్ళా నిద్రపోయింది. ఇది జరిగిం తర్వాత ఇంట్లో అందరి వైఖరీ మారింది, అందరూ నిధిని ఎంతో ఆప్యాయంగా, వారింట్లో వాడిలా చూడటం మొదలెట్టారు.

నిధి, తన పెళ్ళి విషయం రాజమ్మగారితో చెప్పక తప్పింది కాదు. ఆవిడ జాలి పడింది. తను వెళ్ళి తీసుకొస్తా నంది. వాళ్లింట్లోనే కాపరం పెట్టొచ్చునంది. ఇతను నవ్వి వూరుకున్నాడు. అప్పుడప్పుడు నిధి, అనంతాచార్లు గారితో కలిసి గ్రామ పర్యటనం చేసేవాడు. ఆచార్లుగారు సభలలో ప్రసంగించేవాడు. రాత్రుళ్లు పురాణ కాలక్షేపం చేసేవాడు. కొన్ని సభలలో నిధి కూడా వుపన్యసించేవాడు. వీరినిఎంతో మంది గౌరవించేవారు, చాలామంది స్నేహితులయ్యారు. కొంతకాలం వజ్రకరూర్‌లో వుచిత చికిత్సాలయం పెట్టించడానికి డబ్బు పోగు చెయ్యడంలో జరిగిపోయింది, రాజకీయరంగంలో ప్రవేశించిన రాజభూషణం, ఆంధ్రరాష్ట్రం విషయం రాయలసీమలో ప్రచారంచేసే జట్టుతో వొచ్చాడు. నిధి ఎక్కడున్నదీ తెలుసుకుని, అక్కడికొచ్చాడు, రాజభూషణం. ఉదయం తొమ్మిదిగంట లైంది. అనంతాచార్లుగారు ఏదో వూరెళ్ళాడు, అతనితో రాజమ్మగారే మాట్లాడింది. దూరంగావున్న పాకలో వుంటాడు, అక్కడికి వెళ్ళం డంది.

పాకలో నిధి కాళ్లు స్తంభానికి ఆనించి పడకకుర్చీలో కూర్చున్నాడు, పక్కన బల్లమీద కూర్చుని కాత్యాయని మందు గ్లాసులు, శీవీ సర్దుతోంది, పక్కన రంగడు గోలీ లాడుతున్నాడు. రాజభూషణం రాగానే కాత్యాయని వెళ్ళిపోయింది.

అనంతాచార్లుగారి కుటుంబం అందరిలోకీ బొత్తిగా ఎవరితోనూ మాట్లాడనిపిల్ల కాత్యాయని. ఇంట్లో ఎప్పుడూ ఏవో పని చేస్తూనే వుంటుంది గాని, చురుకుగా, చలాకీగా వుండదు. పెళ్ళి కాలేదని వెంగని వాళ్ళమ్మ అంటే రెండు రోజులు ఎవ్వరికి కనబడ

కుండా, ఏడుస్తూ కూర్చుంది. రాజమ్మగారిని మొగుడు కూకలేశాడు, నలుగు రాడపిల్లలలోకీ. కాత్యాయని చక్కంటనీ, మంచి మొగుడు వొచ్చి, వాళ్ళయత్నం లేకుండానే పెండ్లిచేసుకుపోతాడనీ, రాజమ్మ గారి ధైర్యంమీద అనంతాచార్యులుగారు, వివాహ యత్నాలు గట్టిగా చెయ్యడంలేదు. కాత్యాయని లక్ష్మీదేవంత ఎఱుపు కాదు; రాధంత నలుపూ కాదు, మధ్యరకంఛాయ. తల్లి తండ్రులిద్దరి, ఆకారాలని మిశ్రపోయించి, అందమైన లక్షణాలు కాత్యాయనిలో వున్నాయి. రాజమ్మగారి నల్లగా మెరిసే పెద్దజుట్టూ, విశాలమైన సుందరమైన బుగ్గలూ, అనంతాచారిగారి 'నిమీలిత' నేత్రాలూ, చక్కటి చిన్నినోరూ,—అన్నీ వచ్చాయి. కాత్యాయినికి, పైపెదవి, కోటి చివరిది, వూడింది. మాట్లాడినప్పుడు అది కనపడదు. నవ్వినప్పుడు కనిపిస్తుంది. కాని కాత్యాయని ఎప్పుడో కాని నవ్వదు. "ఈలోకంలో ఎందుకు పుట్టాంరా బాబూ" అనుకొన్నట్లు దీనంగా వుంటుంది. తండ్రి సంస్కృతం చెప్పాడు, లక్ష్మీదేవమ్మ పోరితే, ఒక మేష్టర్ని పెట్టి హిందీ చెప్పించాడు. ఇప్పుడు పిలుచ్చెప్పి డబ్బా లేదే విధి అమెకి ఇంగ్లీషు నేర్పుతున్నాడు. కాత్యాయనికి పాఠం చెప్పడం చాలా కష్టం. ప్రశ్నకి సమాధానం చెప్పదు. తెలిసిందా? అని అడిగితే తల వూపుతుంది.

ఇంట్లోనుంచి కప్పులో కాఫీ తీసుకొచ్చి బల్లమీద పెట్టింది. రంగణ్ణి కేకేసి చెవులో ఏదో చెప్పింది. రంగడు వొచ్చి రాజభూషణాన్ని "ఏమండీ మీరు సజ్జరొట్టె తింటారా?" అని అడిగాడు.

"మరి గత్యంతరంలేదు, గుజ్జాలు తిండితప్ప - ఏదో వొకటీ-" అంటూ నవ్వాడు రాజభూషణం. అక్కడున్నవా రెవ్వరూ యిందు లోని స్వారస్యాన్ని గుర్తించినట్టు లేదు. కాత్యాయని యింట్లో కెళ్ళి, రెండు సజ్జరొట్టెలు తీసుకొచ్చి, మళ్ళా వెళ్ళిపోయింది.

"ఐతే, భాయీ. యీ తిరోత్తమ మూగదా ఏమిటి ఖర్మ" అని అడిగాడు రాజభూషణం.

"కాదు, కాదు సిగ్గు."

"సో, అవివాహిత అన్నమాట. ఇహనే! ఇక్కడ నీకన్ని

ఏర్పాట్లు బాగున్నాయి కనుకనే, నాగరికతని వొదిలేసి ఆశ్రమ వాసంలో వున్నావు."

"నువ్వలా అనడం న్యాయం కాదు రాజా! ఇక్కడ మాత్రం నాగరికత లేదా? వీరుమాత్రం మనుషులు కారా?"

"ఇక్కడ వుండి, వీళ్ళ వుప్పు తింటున్నావు కాబట్టి, నువ్విలా వెనకేసుగుని రావడం సమంజసమే—కాని, యిది నాగరికత అనుకోవడం ఆత్మవంచన. వీళ్ళకి వో సంస్కారమా, వో భాషా, వో కళలా—వెనక కృష్ణదేవరాయల టైమ్‌లో గొప్పగా బ్రతికామన్న డాబులు తప్ప, వీళ్లు నిజంగా అడివి మనుషులే. నువ్విల్లా వుండగలుగుతున్నావో ఆశ్చర్యమే" అన్నాడు రాజా.

"ఇప్పుడేగా, కాత్యాయనిన్ని చూసి తిలోత్తమ అన్నావు. ఇంతలో అడివిమనిషై పోయిందా" అన్నాడు సిధి నవ్వుతూ—

"అవిడలో అడవి పుష్పం వుండొచ్చుగా—"

"నీకు రాయలసీమంటే అల్లాంటి అభిప్రాయం వున్నప్పుడు, ఇక్కడ ప్రచారం చెయ్యడం ఎందుకు?"

"ఏదో పదిమందితోనూ కలిసి వొచ్చాను. కానీ, నాకు నిజంగా నమ్మకం లేదు. మేం సర్కారు వోళ్లతో కలవం మొర్రో అంటున్నారు కానీ, నా అభిప్రాయం వాళ్లు కలవకుండా వేరే వుంటేనే మంచిదని. మనతో కలిస్తే వాళ్ళని మనతో సమానంగా చెయ్యాలంటే, మూడు పుష్కరాలేనా పడుతుంది."

"పోనీ, వాళ్లని నీతో సమానంగా చేసింతర్వాతనే, ఆంధ్ర రాష్ట్రం కావాలను. చిన్నితమ్ముడు చదువుకోలేదు కాబట్టి ఆ స్త్రీలో వాడికి వాటా వొద్దనా నీవాదన?"

"ఆంధ్ర రాష్ట్రం వొస్తేగాని యీ ఆశయాలు నెరవేరవు—అనేగా యీ గంద్రగోళం అన్నాడు రాజా.

"ఈ ఆశయాలు నెరవేరకపోతే రాష్ట్రం రాదు; రాష్ట్రం రాకపోతే యీ ఆశయాలు నెరవేరవు—ఎలాగో ముందు రాష్ట్రం రావాలని నీ వాదం; ముందు యీ ఆశయం కొనసాగాలని నా సంకల్పం."

"ఐతే దీనికి నువ్వుచేసే కృషి ఏమిటో తెలుసుకో వొచ్చా?

ప్రక్కన ఇన్స్పిరేషన్ వుంది గాబట్టి, నువ్వు కృషి చేస్తే చెయ్యనూ వొచ్చు." అని రాజభూషణం విగ్గరగా నవ్వాడు.

"తను 'పని ఋది' అనుకోకుండా, నిశ్శబ్దంగా పనిచేసే వాళ్ల వల్లే, ప్రపంచం అసలు కదులుతోంది. - దానిమాట అల్లా వుంచి. నువు కాత్యాయన్ని వుద్దేశించి అలా హేళనచెయ్యడం నాకిష్టం లేదు-"

"హేళన కాదు, నేను నిజంగా అంటున్నాను. ఇన్స్పిరేషన్ లేకపోతే నువ్వు పనిచెయ్యలేవు - ఉంటే చప్పుడు కాకుండా, నువ్వన్నట్లు నిశ్శబ్దంగా చేసేస్తావు - సుశీల విషయంలో నువ్వు చేసిన కృషి...'

'ఫూల్ - నోరుముయ్ - ' అంటూ నిదె స్తంభాని కానించిన కాళ్లను దించి, బలహీనంగా లేచి నుంచున్నాడు.

"ఏం కొడతావా ఏమిటి -?" అంటూ రాజా వొకడుగు వెనక్కి వేశాడు.

"ఈ ధోరణిలో మాట్లాడితే తప్పకుండా కొడతాను—"

"అవును. నిజం చెబితే ఎవరు సహిస్తారు? కాని స్నేహితుణ్ణి కాబట్టి చెబుతున్నాను. నిన్ను గురించిన యథార్థం నువ్వు తెలుసుకోడం అవసరమే గా - నీకు వివాహం జరిగిందన్న సంగతి యిక్కడి వాళ్లకు తెలుసా?"

"తెలుసు."

"సుశీల, నాగమణి, కోమలి - అమృతం - ఇందిర, యిప్పుడు, కాత్యాయని - "

"గెట్ ఔట్ పో, వెళ్ళిపో-"

"వెళ్ళిపోతాను. సత్యాన్ని నువ్వు దాచలేవు —"

"పో—"

"సత్యం ప్రపంచానికి నోరిప్పి చాటుతుంది. ప్రపంచం నమ్మకపోతే, తనే నీపీక పిసుకుతుంది." అంటూ, రాజా తొందరగా నడిచి వెళ్లిపోయ్యాడు. నిధి నీరసంతో మూలుగుతూ కుర్చీలో వాలిపోయ్యాడు.

మళ్లీయా వ్యాధి నించి కొంచం తేరుకుంటున్న మనిషిని, యీ ఘట్టం కదపేసింది. తల పగిలిపోతుంది. అద్దంలో తన మొహం

చూస్తున్నాడు. దట్టంగా గడ్డం పెరిగివుంది; చేసుకోడానికి వోపిక లేదు. లోకమక్కలా రాజభూషణం తన కొత్తప్రపంచంలో కొచ్చి ఐశ్వర్యాన్ని నాశనం చేశాడు. ఏవేవో జ్ఞాపకాలు. మెదడు అనేది లేకుండా వుంటే బాగుండును. లేకపోతే, మెదడు నెత్తిమీద వొక డిప్పలాగ ఉండి వుంటే దాన్ని బైటకి లాగి వుఫ్ మని వూది, దుమ్ము దులిపి తుడిచి, బాగుచేసి, మళ్లా తగిలించవొచ్చు కదా! వర్తమానం తప్ప, భావికాలం, భవిష్యత్తు వుండకూడదు మనిషికి, ఆ రెండు వర్తమానాన్ని నిరంతరం హత్య చేస్తుంటాయి, భావికాలం తీర్పు చెబుతుంది; భవిష్యత్తు శిక్షిస్తుంది; ఆ రెండింటిని గురించి చింతించి, క్షోభించి, శల్యమై, మనిషి వర్తమానంలో ఆత్మహత్య చేసుకుంటాడు.

అల్లా గంటలు గంటలు పడుకొని, కళ్లు తెరిచాడు. ఆకులు, గడ్డి గాలికి లేచి అతని మొహాన పడుతున్నాయి. మేఘాలు గొర్రెల మందలా పడమటి ఆకాశంలో సూర్యరశ్మిని మేస్తున్నాయి. గడ్డి బయలులాంటి రశ్మి, కరిగిపోతోంది, కొండలపై మొండి బండలు కదల్తున్నట్లున్నాయి. భూమి తపస్సుకి మెచ్చుకుని ఆకాశం సంతసించి వర్షిస్తోంది. రాళ్ల మధ్య పడే ఉనుకులు మామూలు వర్షమే బంగారపు తునకలు కావు; మధువు కాదు; క్షీరం కాదు. కావరిలా సూర్యుడు, కిరణాల కత్తులని మేఘాల మధ్య ఝాడిస్తున్నాడు. పక్కకి తిరిగి చూశాడు. కాత్యాయని అవీ యివీ సర్దుతోంది.

"అబ్బో, పెద్ద చినుకులు" అంది ప్రకృతిని సంబోధిస్తూ.

"వానలో తడవొద్దు, నువ్వు యింటికి వెళ్ళు" అన్నాడు నిధి.

"చలి—జబ్బు చేస్తుంది. లోపలికి రండి" అంది.

"ఫరవాలేదు—హాయిగా వుంది ప్రాణా."

"శాలువా తీసుకురానా?"

"ఒద్దు."

కాత్యాయని, తువ్వాలు నెత్తిన కప్పుకుని, గబగబా లోపలి కెళ్ళింది, రంగడు ఫ్లాస్క్ తీసుకొచ్చి గ్లాసులో కాఫీ పోసియిచ్చాడు.

"అమ్మ రమ్మంటోంది."

"ఫరవా లేదు. యిక్కడ బాగుందని చెప్పు."

వర్షం రాళ్లమధ్య యిసికలో చారలు చేసుకొని, చిన్న కాల

వలా పాకచుట్టూ పాకుతోంది.

"నా కో పడవచేసి పెట్టరూ?" అన్నాడు రంగడు.

పత్రిక కాగితం చించి, రెండు పెద్ద పడవలు చేశాడు నిధి. రంగడు వాటిని నీళ్ళలో వొదిలాడు. అవి కొంత దూరం జారి బెడ్డలమధ్య యిరుక్కున్నాయి. వర్షం నిలిచిపోయింది. మేఘాలు వేగంగా ఓడిపోయాయి. నీళ్లలో స్నానానికి దిగి చలికి పట్టుకోలేక చేతులు విప్పి కదిలించినట్లు, సూర్యుడి కిరణాలు దూరంగా వ్యాపి స్తున్నాయి. కాత్యాయని యింట్లోంచి వొచ్చి వో కవరు అతని కిచ్చింది. చించి చదివాడు. అది జగన్నాథం వ్రాసింది. అందులో వొకటే విశేషం వుంది అమ్మాయికి ఆరో మాసంట

దయానిధి లేచి తొందరగా పడమటి వైపుకు నడవడం మొదలెట్టాడు. సూర్యాస్తమయానికి యింకా రెండు గంటలు పడుతుంది వర్షం వెలవగానే తలంటు పోసుకున్నట్లు సూర్యుడు పవిత్రంగా ప్రకాశిస్తున్నాడు. ఆ కాంతిలో శరీరాన్ని తడిపి, ఎండబెడితే, పాపం తొలిగిపోయి పవిత్రం అవుతుంది శరీరం. ఫర్లాంగుపైన కాలిబాట సన్నగిలి రాళ్లల్లో అంతర్ధానమైంది. గుట్టల నీడలు చల్లగా నిశ్చలంగా పడుతున్నాయి. ఇసుక కాళ్ళకింద చలితో వొణికిపోతోంది. పిచ్చి మొక్కలన్నీ సంతోషంతో సొమ్మసిలి పోయాయి. పశులు జాతి నీతిని తిరస్కరించి సూర్యుని వైపు జంటలుగా లేచి పోతున్నాయి. వేడి కోసం తపిస్తూ రాళ్లు కూడా పడమటి దిక్కుకు దగ్గరగా జరుగు తున్నట్లున్నాయి. గిలిగింతలతో విడిపోయి, యిసుక మాయమైంది— కాళ్ళ కింద రాళ్లు నవ్వుతాయి; గడ్డి నిద్రలో శ్వాసలా కదుల్తుంది; గుట్టలు, రాళ్లు, పశులు, పురుగులు— అన్నీ సూర్యుడి కేసి ప్రయాణం.

గంట నడిచాడు, కాళ్లు తేలిపోతున్నాయి; గుండెలు బరువెక్కాయి. సగం అరిగిన నల్లరాయి మీద కూర్చున్నాడు. దూరం నుంచి పసుపు పచ్చగా కనిపించింది. దగ్గరనుంచి చూస్తే అది నల్ల రాయే. ఊరుని, జిల్లాని, రాష్ట్రాన్ని, దేశాన్ని వొదిలి పారిపోవచ్చు; కాని తన శరీరంలోంచి ఎట్లా పారిపోగలడు?

జగన్నాథం వ్రాసిన వుత్తరం మళ్లా చదువు కున్నాడు. ఆరో

మాసంట, కారణం అతనేనని అతని భయం. అమృతం ఏం చేస్తుంది? అమృతం భర్త అమృతాన్ని శంకిస్తాడా? భర్త విడిచిపెడితే అమృతం ఏమవుతుంది? రాజభూషణం ఏమంటాడు? సత్యం తన మాట ఎవరూ వినకపోతే, తనే అతని పీక నులుముతుంది—అన్నాడు. తన పీక తనే నులుముకున్నట్లు జరిగింది. అతను ఏలూరు నుంచి వొచ్చి ఐదు మాసాలేగా అయింది, అమృతానికి యిప్పుడు ఆరోమాసంట. సరిగ్గా ఎన్నో మాసమో ఎవరు నిర్ణయించగలరు? అమృతం అబద్ధం ఆడిందేమో! సత్యం ఎట్లా తెలుస్తుంది? అమృతానికి తన ద్వారా సంతానము కలగకపోతే, కష్టి ప్రమాదం లేదు; సత్యం తన నోట్లోనే గుడ్డలు కుక్కుకుని చస్తుంది. అంతేనా నీతి? మంచితనం అంటే పట్టుబడని చెడ్డతనమేనా?

తను చేసిన పని మంచిదో చెడ్డదో నిర్ణయించుకోడం ఎంత కష్టం! ఆ కార్యానికి ఫలితం చూసి ప్రకృతే విలువ కడుతోంది; సంఘం దాన్ని ఆధారం చేసుకుని నిర్ధారణ చేస్తుంది. ఐతే తన అభిప్రాయం ఏమిటి? ఆ పరిస్థితులలో, ఆ వ్యక్తులు అట్లా చెయ్యక తప్పదు. ఏ యిద్దరు వ్యక్తులైనా, ఆ పరిస్థితులలో అట్లా చేసి తీరుతారు. 'అహం', 'వ్యక్తిత్వం', 'స్వార్థం', 'నేను అనే చైతన్యం'—అన్నిటినీ నాశనం చేసే మహత్తర అనుభవం. దానికి అతీతం ఐన వ్యక్తులు దేవతలో, మహాఋషులో కావొచ్చు. కాని మానవులు కాలేరు. 'మానవత్వం' మంచిదే అవొక్కటే మంచేమో కూడా! దాని ఫలితాలతో నిమిత్తం ఎందుకు? కాని సంఘానికి ఫలితాలు కావాలి. చిహ్నాలు, బహిర్గత చిహ్నాలు కావాలి, మానవత్వం వున్నవాడు, ఆ కృత్యాన్ని సమర్థించగలడు, అది లేనివాడి విమర్శకి విలువే లేదు, ఆ విధంగా అది 'మంచే' అని నిర్ణయించుకున్నాడు. సానుభూతి, ప్రేమ, నిర్మలమైన ఆనందం—యివి మహోజ్జ్వలమైన విలువలు. వీటిని ఈ అనుభవం యివ్వగలిగింది యిద్దరి వ్యక్తులకు. ఈ విలువలని మానవులందరూ సాధించగలిగినప్పుడు, ప్రపంచం స్వర్గతుల్యం. మానవత్వం లేని మనుషుల క్షేమం కోసం సంఘం ప్రతిపాదించిన 'వివాహం' మొదలైన సంస్థలపై తిరుగుబాటు చేసి, తమ మానవత్వాన్ని ప్రకటించినప్పుడు, సాధించలేనివారు సాధించినవారిపై తీర్పు చెప్పి, శిక్ష విధించడం సమంజసమే. శిక్షార్హుల సంఖ్య

అతి స్వల్పం. యుగానికి యిద్దరో ముగ్గురో; దేశానికి యిద్దరో ముగ్గురో. తను చేసిన పని తనకి నచ్చాలి; మంచిదని స్థిరపరచుకోవాలి; అది ముఖ్యంగాని, యితరులు కళ్ళద్వారా చూసి విలువ కట్టి వాక కార్యాన్ని ఖండించడం, నైతిక పిరికితనం. దుర్నీతిపరుడు తన్ను తాను విమర్శిస్తాడు,

కాని యీ ఆలోచనలు నిధికి శాంతిని యివ్వడం లేదు. ఇవన్నీ తన ప్రవర్తనని సమర్థించడం కోసం, తార్కిక జ్ఞానాన్ని, భాషని, భావాలని వ్యభిచరింప చెయ్యడంలా తోస్తోంది. "చెడిపోవడం ఆధునికులు తెలుసుకున్నా మనుకోవడం పొరపాటు. అది అనాది నుంచి వుంటున్నదే; కాని దాన్ని సమర్థించి, పిరికైతే బహిరంగంగా మెచ్చుకోవడం ఆధునికం; నేటి నాగరికత" అన్న రాధాకృష్ణన్ వాక్యాలు స్మరణకొచ్చాయి. బుద్ధి విచిత్రమైంది. మనం మంచిదనుకున్నా సమర్థించేందుకు ఎన్నో కారణాలు వెదకి పెడుతుంది. మన ప్రవర్తనకి మన ఉద్రేకాలు కారణం. ఉద్రేకాలు శరీరాన్నుంచి జనిస్తాయి; ఇంతకీ మంచి చెడ్డల నిర్ణయం కూడా శరీరమే చేసేస్తుంది. బుద్ధి మరో ప్రపంచంలో వుదయించిన సూర్యుడిలా వృథాగా చూస్తూ కూర్చుంటుంది.

తనలోంచి తాను పారిపోలేడు. తను తన శరీరంలో నేవాయినా కాపరం వుండాలంటే మంచిగాలి, వెలుతురు, చోటు వుండాలి. ఇవి లేకపోతే శరీరంలో వుండలేడు. ఇవిలేనాడు కిటికీలు మూతలుపడతాయి; మెదడు బూజు పడుతుంది. స్వప్నంలో బంధించబడిన అడవి మృగాలైనా వాంఛలు గర్జిస్తాయి; విషసర్పాలు విషం కక్కుతాయి. ఎంతకాలం అల్లా వుండటం? మరణమే శరణ్యం.

నువ్వు నీ శరీరంతో వాదించలేవు. వేదాంతం, తర్కం, నీతి — వీటితో సంఘాన్ని మెప్పించలేవు ప్రపంచాన్ని నీ వెంపుకు తిప్పుకోలేవు; నువ్వు ప్రపంచంవేపు తిరగలేవు. నీమరణమే శరణ్యం అప్రయత్నంగా అతని కళ్ళమ్మట నీళ్లు కారుతున్నాయి. ఎన్నో జ్ఞాపకాల కారుణ్యాన్ని భరించలేని నేత్రాలు: కన్నీటిని వొదలేశాయి, భవిష్యత్తు లేని భావికాలం దాచలేకపోయిన కన్నీరు ప్రతి బిందువూ నల్లరాతి మీద పడి విరిపోతోంది. అమృతం హృదయం ఆ బిందువులలో భగ్నమైపోతోంది, మృత్యువుకూడా అంతమొందించలేని బాధ.

నిశి పొంటిని నిద్రాదేవి వరించింది. తపస్సు చేస్తున్న “భయం” అనే వొక ఋషిని, ప్రశాంతం అనే కన్యక తన నాట్యం చేత, భంగపరిచింది, కను రెప్పలకి కట్టిన దారాలకి. నిద్రాదేవి నక్షత్రాలకి ముడి వేసింది.

మండు వేసంగిలో, ఏప్రిల్ ఇరవై యో తేదీని ఆంధ్రరాష్ట్ర కమిటీవారు కడపలో సభ చేశారు. ఆ సభకి, అనంతాచార్యులుగారు, దయానిధిగారూ వెళ్ళారు. దత్తమండలం జిల్లాలనంటే, ఎంతో నాయకులు, పెద్దలు, సభ్యులు వొస్తారు, వారందరి పరిచయం పొందడం అవసరమని, ఆచారిగారి ప్రోత్సాహంమీద, నిధి అక్కడికి రావడం జరిగింది. అతన్ని ఎలక్షన్‌లో నిలబెట్టి, నెగ్గించి, పెద్దవాణ్ణి చెయ్యాలని ఆచారిగారి సంకల్పం. కాని అతనేమీ వుత్సాహం చూపడం లేదు. ఐనా వెళ్ళక తప్పింది కాదు.

సాయంత్రం ఐదుగంటలవుతోంది. రెండు మూడొందలమంది జనం మూగారు. ఉపన్యాసాలు ప్రారంభమయ్యాయి. మూడో వుపన్యాసకుడు రాజభూషణం, పదివాక్యాలు మాట్లాడింతర్వాత, జనంలో కలకలం బైలుదేరింది.

“—ఈ జిల్లాలలో కొందరిమటుకు, ఆంధ్రరాష్ట్రం అక్కర్లేదనీ, దాని అవసరం వారికి కనబడలేదని, అసలు రాష్ట్రం ఏర్పడకుండా చెయ్యడానికి వారు కృషిచెయ్యడానికి అభ్యంతరం లేదనికూడా, వారు అల్లా అనడంలో ఆశ్చర్యంలేదు. ఎందుకంటే, ఆంధ్రరాష్ట్రోద్యమం సర్కారుజిల్లాలలో బైలుదేరింది. ప్రతి వుద్యమంలోనూ, సారస్వతోద్యమం కానివ్వండి, మరేయితర నూతన వుద్యమం లేవదియ్యాల్సివొచ్చినా, సర్కారుజిల్లాల వారే ముందంజవేసేది. వారే మార్గదర్శకులు, రాజకీయ, ఆర్థిక, కళా, సాంఘిక అభ్యుదయానికి పునాది రాళ్ళువేసింది వారు. ఆంధ్రనాగరికతని భద్రపరచింది వారే. అంచేత వాళ్ళేదో బాగుపడి, గొప్పవాళ్ళయి పోతున్నారని, మిగత జిల్లాలవారు, అసూయపడి వెనక్కితగ్గి, వారి అభివృద్ధికి అంతరాయం కల్పించడంలో ఆశ్చర్యం లేదేమో. నాకీ జిల్లాలతో పరిచయం లేకపోలేదు. కారణాలేమైతే నేం, యిక్కడి ప్రజ హీనస్థితిలో వుంటున్న సంగతి అందరికీ తెలిసిందే. కట్టుకునేందుకు బట్టలేదు, తినేటందుకు

తిండి లేదు; తిండి, బట్టా లక్ష్యం చేసుకొని, తిరికగా వుంటూ, ప్రాణం నిలబెట్టుకునేందుకు వుపకరించని వాటిని సాధించటమే నాగరికత అవే కళలు, మతం, శృంగారం, ఆధ్యాత్మిక విలువలు. తిండి, బట్టా లేని యీ బీద ప్రజకి ఆ నాగరికత అలవడాలంటే వాగి యీర్ష్య లని, పట్టింపులనీ దిగమింగి, సర్కారు జిల్లాల వారితో ఏకమై రాష్ట్రం కోసం కృషి చెయ్యడమే కర్తవ్యం.''

కొందరు చప్పట్లు కొట్టారు. వారిని మరికొందరు మందలిం చారు! మాటా మాటా అనుకున్నారు. గంద్రగోళమైంది. కొంచెం సేపటికి కలకలం తగ్గింది. మళ్ళా మొదలెట్టాడు.

''—ఉదాహరణకి—నేను మొదట్రాఘువ ... దిగాను. నాకు ... అయితే ... భాష తెనాలి ... ఒకరు తెనుగు ...; వొకరు సంస్కృతం; మరి ... కన్నడం-అత్తగారు తమిళం మాట్లాడుకుంటారు. నైజాం సరిహద్దుల దగ్గర వుండడంవల్ల కాబోలు, ... కొద్దిగొప్పో హిందుస్థానీ వొచ్చే వుంటుంది. వీరికి మాతృభాష లేదేమో అనిపిస్తుంది. ఒక పత్రికా సంపాదకుడు గాని, గొప్ప గాయకుడు గాని, చిత్రకారుడు గాని, కవిగాని, రాజకీయవేత్తగాని, ప్రతిభాశాలిగాని, ఎవరైనా మనం ఎరుగుదుమా? వీరు తెలివి తక్కువవారననను. తెలివి తేటలు బైటపడి, రాణించే ఆర్థిక, సాంఘిక, పరిస్థితులు ఏర్పడలేదు. అవి ఏర్పడాలంటే మాతోకలవడమే సాధనం. మాతో కలవండని ప్రాధేయపడుతున్నామని విరిస్తారేమో! ఎవరైనా ఏదేనా కోరితే, వారు చెట్టెక్కడం మానవ లక్షణం. ఆ పక్షంలో మేం భయపడి మా వుద్యమం విరమిస్తామనీ, ఆంధ్రరాష్ట్ర రథం కదల్దనీ కలలోకూడా భ్రమించవద్దని విన్నపం. వీరిని మినహాయించి, మిగతవాళ్ళమే రాష్ట్రం సంపాదించుకొని తీరతాం—''

వాక్యం పూర్తికాకుండానే ప్రజలు అతన్ని ఆపుచెయ్యమని గొల్లరి చేశారు. అతడు చేసిన సవాల్, అక్కడ పెద్దల కూడా ... గాతోచింది. మధ్యలో వొకాయన నిలబడి ''నాకు మాట్లాడ అవకాశం యివ్వండి'' అని అధ్యక్షుణ్ని కోరాడు. జనం చప్పట్లుకొట్టి ఆయన్ని

ఉపన్యాస వేదికమీదికి తీసికెళ్ళి నిలబెట్టారు. ఒకాయన లేచి ఆ ఉపన్యాసకుణ్ణి పరిచయం చేశాడు.

“వీరిపేరు తిప్పేస్వామి. వీరు కర్నూలు కార్మికుల సంస్థకు కార్యదర్శిగా వుంటున్నారు. పరివాండ్ల కరువు వేళనాల ప్రణాళిక తయారుచేశాడు. అంతకంటె వేరే చెప్ప నక్కరలేదు.” అని కూర్చున్నాడు.

తిప్పేస్వామి యిల్లా ప్రారంభించాడు.

“నేను యీ సాయంత్రం మాట్లాడాలని వొచ్చుండలేదు. కొంచెం ముందు చెప్పినాయన చాలా జోరుగా సాగిస్తుంటే ఇందికి ప్రశ్న వేద్దామనిపించింది. ఆ ఛాన్సు ఇచ్చినందుకు అధ్యక్షుడికి నా హృదయపూర్వకవందనాలు.

మా సర్కారు మిత్రులు—క్షమించండి, సర్కారు జిల్లాల మిత్రులు యీ కరువు సమయంలో ధాన్యం ధర్మంగా ఐదువేలు రొక్కం యిచ్చిన మాట వాస్తవం. దానికి వారికి మేం కృతజ్ఞులం. ఇట్లాంటి కరువు సంభవించడానికి మా తెలివి తక్కువతనమే కారణం అన్నట్లుగా వారు మాట్లాడటం విన్న మీ అందరికీ నవ్వొచ్చిందంటే ఆశ్చర్యం లేదు. ఎందుకంటారా? కలరా, ప్లేగులు, వుప్పెనలు, వరదలు, వానలు పడక పంటలు నాశనం కావడాలు—యివన్నీ, సర్కారు జిల్లాలలో కూడా వుండటం అందరికీ తెలిసిందే. ఐతే వారు మమ్మల్ని చూసి జాలిపడటం అందరికీ తెలిసిందే. ఐతే వారు మమ్మల్ని చూసి జాలి పడటం వారి ఎక్కువతనాన్ని చూపెడుతుంది కాబోలు. వారికి సంభవించే యిక్కట్లని చూసి సంతోషించి జాలిపడుతున్నాననుకోకండి.

నాగరికతను గురించి వారు రేపో సెలవిచ్చారు; నేను అనాగరీకుణ్ణి గనక నాకది అర్థం కాలేదనుకోండి. తిండి, బట్టా వున్నవాళ్ళకే యీ నాగరికత అనే జాడ్యం పడుతుందని వారి వుద్దేశం కాబోలు, వారి జిల్లాలలో జమీందార్లు తిండీ బట్ట వున్నవారలే. వారు నాగరికులా? కార్మికులను, కర్షకులను, కవులుకిచ్చిన వాళ్ళని పీడించి, వూటీ, సిమ్లా, బొంబాయిలలో త్రాగుడు, జూదం, స్త్రీలోలత్వంతో ఆ డబ్బంతా తగలెయ్యడం నాగరికత? మహానుభావులు, గొప్పవాళ్లు

చాలామంది బీదవాళ్లేనని చరిత్ర చదివిన వారికి తెలుస్తుంది. బీదతనమే వారి కృషికి కారణం అంటాను. పూర్వీకులు కష్టపడి సంపాదించిన సంస్కారాన్ని నాగరికతని తగలెయ్యడంలో ప్రథమస్థానం సర్కారు వారిదే-క్షమించండి - సర్కారు జిల్లాలవారిదే. నేను మొన్న బెజవాడ రైల్వే స్టేషన్‌లో వొక హాస్యరచన గ్రంథం కొని చదివాను. దాన్నిబట్టి అక్కడి జనం ఎట్లాంటివారో తెలుసుకొన్నాను. దబుక్కులు-వారు దాని కోత అంటారు—యీర్ష్య, సోమరితనం, [illegible], కుళ్లు, దగా, మోసం, స్వార్థపరత్వం-యివి వారి జాతీయ లక్షణాలుగా, నా మిత్రులు బాధపడతారు. ఆ గ్రంథం హాస్యరచన కాదు. విషాద గీతం. అది చదువుకొని వారు ఏడవటానికి బదులు నవ్వుతున్నారని నాకు ఏడవాలనిపిస్తూంది.

ఈ జిల్లాలలో కవులు లేరట. మా రీడింగ్ రూమ్ కొస్తే, నలభై పేజీల గ్రంథం వుంది. అందులో నూటతొంభై మంది కవుల పేర్లున్నాయి. మిత్రవాదులు లేరట-కి శేషను వెంకట్రావు పేరు యీ చర్చలోకి దింపడం నాకిష్టం లేదు.

ఇక ఆంధ్రరాష్ట్రం మాట. మేం రాష్ట్రం వొద్దనడంలేదు. మేం దానికి తగం అన్నట్లుగా ఆ జిల్లాల వారు మాట్లాడతారు ఎందుకో! మా ప్రాజెక్టులు ఫలించి, ఆర్థికంగా సమానత్వం తెచ్చుకున్న తర్వాత, రాష్ట్రం అవశ్యం తెచ్చుకుంటాం. ఈత రానివాడిని అవతలొడ్డుకి తీసికెళదామంటే యిద్దరూ మునిగిపోతారు.

మా సర్కారు మిత్రుడు - క్షమించండి — సర్కారు జిల్లాల మిత్రుడు-రాఘవశ్రేష్ఠిగార్ని గురించి వ్యక్తిగతంగా మాట్లాడాడు గనక, ఆ హక్కు నేను చలాయించుకుంటాను. ఇక్కడికి 80 మైళ్ళ దూరంలో న్యాయంపల్లి గ్రామంలో వొక సర్కార్ల వ్యక్తి వున్నాడు. ఆయన డాక్టర్ ఇక్కడికి పకీరుగా వొచ్చాడు. రాళ్ళసీమలో వజ్రం దొరికింది. ఇప్పుడు లక్షాధికారయ్యాడు. వజ్రాల గని త్రవ్విస్తున్నాడు. హాస్పిటల్ పెట్టాడు. ఆ సిరిసంపద మాదేనా కసర్కారు జిల్లాల వారిదా? రాఘవశ్రేష్టిగారింట్లో నాలుగుభాషలున్న విషయం మీరు విన్నారు. సర్కారు డాక్టర్‌కి - క్షమించండి, సర్కార్ జిల్లాల డాక్టరుకి నలుగురు భార్యలున్నారని వినికిడి-"

జనంలో గోల బైలుదేరింది. అధ్యక్షుడు ఆయన్ని నిలిపివేసి కూర్చోమన్నాడు. బలవంతంగా అందరూ ఆయన్ని కిందికి దించి తీసుకుపోయ్యారు. అక్కడ అమర్చిన రెండు గ్యాస్‌లైట్లలో వొకటి ఆరిపోయింది. ఉపన్యాసకుల వేదిక దగ్గరది మాత్రం వెలుగుతూనే వుంది. ఆ తర్వాత నిధిని వేదికపైకి రమ్మనమని ఎవరో పిలిచారు. నిధి కోసం ఆచారిగారు అటూ యిటూ చూశాడు. ఎక్కడా కనిపించలేదు. అప్పుడు సింహాచలంగారు ఆయన వొంట్లో బాగుండలేదని, అంతేత మాట్లాడే స్థితిలో లేడనీ సర్ది చెప్పి, శ్లోకాలు, వుపమానాలు, గీతా వాక్యాలు చదివి, సర్కార్ జిల్లాలకీ, దత్తమండలాల వారికీ ఐక్యం వుండాలంటూ వుపన్యసించి సభికులను రంజింపజేశారు.

దయానిధి వెంటనే కార్లో యింటికి వొచ్చేశాడు. రాత్రి పన్నెండు గంటలు కావొస్తోంది. నిశ్శబ్దంగా మేడమీదికి నడిచి వెళ్ళాడు. నారయ్య హాల్లో గుఱ్ఱుపెట్టి నిద్రపోతున్నాడు. 'గట్టి' మందు వాడి పడుకున్నాడు. పక్కగదిలో కోమలి పడుకుంది. సన్నగా దీపం వో మూల వుంది. కిటికీలోంచి నిశ్శబ్దంగా, చల్లటి వెన్నెల కోమలి మంచం మీద పడింది. మెడలో నగలు లేకపోవడం వల్ల ఆమె కంఠం గుండ్రంగా, మెత్తగా కనబడుతోంది. వెన్నెల యింద్రజాలాన్నుండి తప్పించుకోవాలని, రహస్యమైన శ్వాసతో రొమ్ములు లయతో లేచిపడుతున్నాయి. వికసించడం మరిచిపోయిన ఎఱ్ఱ మందారం మొగ్గల్లా కళ్లు మూసుకున్నాయి. కోమలి అందం అనంతం; క్షణక్షణానికీ, రోజురోజుకి, యుగయుగానికీ అభివృద్ధి పొందే సౌందర్యం అది. వయస్సు, చక్కదనంలోని చాంచల్యాన్ని తొలగించి మార్దవాన్ని, గాంభీర్యాన్ని యిచ్చింది. జీవితంతో రాపిడి, యవ్వనంలో వుండే కుటిలత్వాన్ని తొలగించి, వైరాగ్యాన్నిచ్చింది.

అతను ప్రక్కన సోఫాలో కూర్చున్నాడు. పర్వతం ఎక్కి, శిఖరం చేరుకున్నట్లుగా వుంది, ఆమె ప్రక్కన కూర్చోవడం. వెన్నెల వాతావరణాన్ని కోమలి ఘనీ ప్రశాంతంలో బంధించివేసింది. గోళం మరి తిరగదు. అతనికి ఆమెని తాకాలని లేదు; మందారపు రేకులని విప్పి వికసింప చెయ్యాలనీ లేదు. ఆమె గతం వూహిస్తే భయమేస్తోంది. తిప్పేస్వామి వుపన్యాసం ఆమె కంఠంలో వినబడు

తోంది. ఎన్నో ముళ్లు, ఎన్నో కీటకాలు ఆ శరీరాన్ని మైలపరిచాయి.
—ఏమీ తెలీనట్లు యిక్కడ అమ్మ నిద్రపోతోంది. అతనిలో వొక కోరిక జనించింది ;—ఆమె కంఠాన్ని తన రెండు చేతులతో పట్టుకుని, నులిమి, ఆ సడలిపోని సౌందర్యంతో చంపి వెయ్యాలని అది వొక వ్యసనం లాంటిది; వొక తృష్ణ; బడబాగ్ని, శిఖరం కూలి సముద్రాన్ని ఎండింపచేసే ప్రాచీన శక్తి అది. అతని కోర్కెలు, తీరని వాంఛలు, యథార్థంకాని కలలు, అనుసరించలేని ఆదర్శాలూ, అంతరంగికమూ—అన్నీ కోమలై నిద్రిస్తున్నాయి. ఆమెని చంపితే హత్య కాదు; ఆత్మహత్య. ప్రపంచంలో మరి 'చెడుగు' వుండదు. అమ్మలు, అమృతాలూ, దయానిధులు వుండని సంతోషమయ ప్రపంచం, ఆ సంకల్పంతో పెద్ద పోరాటం సాగించాడు అధోలోకంలోని క్రూరమృగాల వేట అది. బాల్యంలో బంధించబడ్డ జంతువులు సంకెళ్లు త్రెంచుకుని స్వేచ్ఛా విహారానికి గర్జిస్తున్నాయి లోపల అధికారం, అఘాతం, చీకటిలోయ, మృగాల సంచారం. ఆకాశంలో తలుపులు తెరుచుకున్నాయి. అతను మూసి, దిగివొచ్చి మధ్య నిలబడి పెనుగులాడుతున్నాడు.

సోఫా మంచానికి దగ్గరగా లాగి కోమలికి జడుగుమూలంలో కూర్చున్నాడు ఎవరో హృదయంలోని ఆలయపు తలుపు తెరిచారు. కోమలిపై అతనికున్న ద్వేషం, చంపాలన్న కోర్కె, వెనక్కి ప్రయాణంచేసి, జన్మస్థానం వెతుక్కుంటోంది. అమ్మపై ద్వేషంగా మారిన తన సహజప్రేమ వాటి జన్మస్థానం ఆ దృశ్యం నిజంగా జరిగిందా? లేక తను వూహించిందా? తన తండ్రి, తల్లిని పీక పిసుకుతున్నట్లు, అతనెక్కడో, ఎప్పుడో చూశాడు. తన ఆదర్శాలని, అందాన్ని, స్వప్నాలని ఎవరో పీకనులిమి చంపిన దృశ్యం అది. అమ్మమాత్రం యథార్థం; జగత్తంతా మాయ. ఆ సత్యాన్ని ఎందుకో, పీకనులిమి, హత్యచేశారు. హంతకుడు మృత్యువాత పడ్డాడు తను ఎవర్ని చంపడం? అందం, ఆదర్శం, స్వప్నం అన్నీ అమ్మని మూసి నేర్చుకున్న కోమలినా తను చంపడం? ఆలయంలో గంటలు మ్రోగాయి. ఆ ధ్వనిలో తిప్పేస్వామి కడపటి వాక్యాలు గిరగిరా తిరుగుతున్నాయి; తెర, చినిగి జారింది; ఆకాశం అంతా

వాకే తెరచిన తలుపు; మొగ్గలే లేవు, అన్నీ వికసించిన మందారాలే, వెన్నెల మేఘాల సంకెళ్లు విప్పుకుంది. వాతావరణం స్వాతంత్ర్యం తెచ్చుకుంది. కోమలి అతన్ని అధో లోకాన్నుంచి విముక్తి చేసి; సత్య సామ్రాజ్యానికి రాణీ అయింది. ఆమెను ముట్టుకోకూడదు.

మూలనున్న దీపం తెచ్చి పెద్దదిచేసి, ఆమె మొహంవైపు చూశాడు.

అప్రయత్నంగా తన కుడిచెయ్యి అతని చెయ్యిమీద వేసింది. "అబ్బో, అంతా తెలుసు" అన్నట్లుగా నిద్రలో నవ్వుకొంది. క్షణం వెలుగు చూశాడు.

ఆమె కుడిచెయ్యి అతన్ని శోధిస్తోంది—అతని బుజంకోసం వుద్దేశింపబడిన ఆ అరిచెయ్యి దాని దగ్గరకే చేరుకుంది అప్రయత్నంగా; వొళ్లు విరిచి, గీర్వాణంగా సింహాసనంమీద కదిలి సౌందర్యాన్ని దిక్కులకు నెట్టి వేసింది రాణి. చెయ్యి దీపాన్ని కొట్టింది. దీపం కిందపడి చప్పుడైంది. తటాలున లేచి కూర్చుంది.

"మీరా!....ఎప్పుడొచ్చారు? ఎందుకు లేపలేదు—!" —ఏవో మసగ ప్రశ్నలు ఆవలిస్తూ అడిగి, అతన్ని మంచంమీదికి లాక్కుంది.

"కోమలీ—నీకు తెలుసా? చిత్రం జరిగింది" అని అడిగి, ఆమె చేతులని తొలిగించి, పాదాలదగ్గర కూర్చున్నాడు.

"ఏమిటి?"

"నాకు నలుగురు భార్యలున్నారని ఇక్కడ మనుషులు చెప్పుకుంటున్నారు."

"అందులో చిత్రం ఏముంది? అందరు మొగాళ్ళూ అంతేగా! చేసుకున్న పెళ్ళాలు కారనుకోండి. మొన్న రాజమ్మగారు చెప్పింది.- ఇక్కడ చాలామందికి యిద్దరు పెళ్ళాలుండటం మామూలేట. ఒస్ యింతేనా?" మొహం పక్కకి తిప్పి తలగడ వేసి నవ్వింది.

"దాని అర్థం నీకు తెలుసా?"

"ఆ ఎందరు పెళ్ళాలుంటేనేం? ప్రేమించడం ఎప్పుడూ వొకర్నేగా, నేనంతేగా—"

"ఈ విషయం విన్న తర్వాత నీకు నామీద అసహ్యం వేయలా?"

"వెయ్యాలా-మిమ్మల్నింకా, యిదిగా ప్రేమిస్తున్నాను."

"నాకు నామీదే అసహ్యం వేస్తోంది, నా మనస్సు నిజంగా ఎల్లాంటిదో తెలుసుకున్న వారెవ్వరూ నన్ను ప్రేమించరు."

"నాకు తెలుసు-అందుకనే ప్రేమిస్తాను కూడా" అన్నది కోమలి.

అతను లేవబోయ్యాడు.

"ఉండండి-గాజు పెంకులు తీస్తాను" అంటూ కోమలి లేచి, అతన్ని పక్కగా నడిపించింది. ఇద్దరూ బైటికి వొచ్చారు. అతను గబ గబా మెట్లెక్కి, పై డాబామీదికి వెళ్ళాడు. కోమలికూడా వెనకాలే వెళ్ళింది. వారి రహస్యాలు వినేందుకన్నట్లు వెన్నెల చాలాదగ్గిరిగా వొచ్చి విశాలంగా తొంగి చూస్తోంది. చంద్రుడు మచ్చని మేఘంలా రహస్యంగా దాచుకున్నాడు.

"నాకు ప్రేమించబడే అర్హత పోయింది కోమలీ-"

"నేను బ్రతికివుండగా పోదు-" అని అతని భుజంమీద తల కాయ ఆనించింది. వేడి నిట్టూర్పు వెన్నెలలో చల్లబడింది. ఆమె కళ్ళల్లోకి చూస్తే విశ్వాసిక అవతలొద్దు కనిపించింది. అతను అవతలికి అడుగు వెయ్యలేదు.

"మనం స్నేహంగా వుండగూడదూ?" అన్నాడు.

"ఉన్నాంగా—"

"ఇంతదగ్గరగా కాకుండా వుండలేమూ?"

"ఇంతకంటె దగరగా ఎవ్వరూ వుండలేరు."

"శరీరాలులేని ఆత్మలమైతే ఎంత బాగుండును!" అన్నాడు.

"ఆత్మలు విడివిడిగా వుంటాయి-వొక్క శరీరాలే దగ్గరగా కలిసి వుండేది—"

"నీ కెవరు చెప్పారు?"

"నేనూ చదువుతున్నాను భగవద్గీత."

"నీ కర్థ మౌతోందా?"

"ఓ-అసలది నాలాంటివాళ్ళ కోసమే వ్రాశారు ఎవరో."

"అంటే?"

"ఏమో నాకు తెలీదు. చదువుతున్నప్పుడు అదంతా నిజంగా వుంటుంది. పుస్తకం మూసేస్తే ఏమీ వుండదు."

"అట్లాంటప్పుడు, నువ్వెందుకూ ప్రేమించడం?"

"ప్రేమ పవిత్రమైంది-"

"ఓస్"

"నిజం."

"మరి నా మీద కోరికెందుకు?"

"అది మనస్సుకి కాదు శరీరానికి. అదేగా పెను తాపత్రం."

"అట్లా వొద్దు-అసలు కోరికలే వొద్దు-ఇద్దరం యిట్లాగే స్నేహంగా వుందాం. రెండు శరీరాల స్నేహం ద్వేషంగా మారుతుంది. ఆత్మలని చంపేస్తుంది-"

"అబ్బో-అంత అట్లాగ నేనుండలేను-"

"మరి ఆ అలవాటు వొదుల్చుకోవాలి. అదే యోగం, తపస్సు అంటే...."

"కష్టం కాదు? ఎప్పుడూ, చచ్చిపొయ్యేదాకా అట్లాగే-?"

"ఆ!"

"అమ్మో—వొక్కసారి కూడా వొద్దా వొక్కసారి. మళ్ళా వొద్దు-"

"అట్లా చేస్తే మనం అందర్లాగే అయిపోతాం.-అట్లా చెయ్యక పోవడంలోనే వుంది అందం. జీవితం వింతగా వుంటుంది. బ్రతుకు మీద విసుగు పుట్టదు. గొప్పగొప్ప పనులు చెయ్యొచ్చు" అన్నాడు.

"అట్లాగైతే మీరెవరిలాగో వుండరు, కొత్తగా వుంటారు" అన్నది.

"అట్లా వుంటేనే తమాషాగా వుంటుంది. చూడు. నీ ముఖంతో నాకు పరిచయం వుంది. కాని శరీరంతో లేదు. మనం రోజూ చూసే వాటిని, బాగా ఎరుగున్న వాటినీ ఆదరంతో చూసి ప్రేమిస్తామా? అట్లా చెయ్యం. రోజూ వుండేదే-యింతేగా-అనుకుని అసహ్యించుకుంటాం. కాని, తెలీనిదాన్నీ, కొత్తదాన్నీ తెలుసుకుందామని శోధిస్తాం-ఆ పరిశోధనే ప్రేమంటే. ప్రియుడు ప్రియురాల్ని ఎంత వరకూ ప్రేమిస్తాడు?—ఆమె పరిచయం దొరికి, భార్యగా చేసుకునే

వరకూ-అంతే....తర్వాత, వాళ్ళు మామూలు మొగుడు-పెళ్ళాల లాగా కీచులాడుకుంటూరు. పిల్లలు పుడతారు. మళ్ళా వాళ్ళ శరీరాలు కొత్తవవుతాయి. ఐనా వాడిని సహించలేదు. ఆమె పిల్లాడిని ప్రేమిస్తుంది. అయ్యో నన్ను మరిచిపోయిందే అని మొగుడు ఏడ్చి, ద్వేషిస్తాడు. అల్లాగే చిత్రకారుడు అందాన్ని ప్రేమిస్తాడు. ఎంత వరకూ? అది తన రంగుద్వారా, పటంలో అభ్యాముద్యోతరకూ. అందాన్ని బంధించిన తర్వాత, అతను బాహ్య ప్రపంచానికి దాస్యం చేస్తాడు. కవుల విషయం అంతే-'సత్యాన్ని' నూటలలో బంధిస్తారు. సత్యానికి దగ్గరగా వానకమే కవిత్వం'. భక్తుడు దైవాన్ని అన్వేషిస్తాడు. జీవితం అంతా వొక అనంతమైన అన్వేషణ, జీవిత రహస్యాన్ని శోధించడం, రహస్యం తెలుసుకున్న తర్వాత అన్వేషణ మానడు, అర్థంకాక అన్వేషణ మానెయ్యడం జరుగుతుంది. అల్లాగే మనం వొకరికి వొకరు అర్థంకానంతవరకూ, శరీరాలు పరిచయం కానంతవరకూ ప్రేమి చుకుంటాం."

అతను మాట్లాడుతుంటే, ఆమె అతని కళ్ళల్లోకి నిశ్చింతగా చూచింది. మెదడులో, మోల్డం మరిచి పోయిన వూహాలు పీడిస్తున్నాయి. మెదడు గుండెలదగ్గరగా వెళ్ళినట్లయింది. కోమలికి అదొక వింతఅనుభవం. కోమలి తన్మయతతో అతన్ని బిగించేసి, నేలమీదికి కూలి, అతన్ని కిందికి లాగేసింది.

ఆమె పడుకుని, అతని తొడపై తల ఆనించి ఆకాశంకేసి చూస్తూ. ఆమెలో మరి కోరిక లేదు. ఊహాని కలవరపెట్టే కొత్త అనుమానాలే అన్నీ.

' ఐతే జీవిత రహస్యం అంటే ఏమిటి?'' అని అడిగింది.

అతని నవ్వొచ్చింది.

" మాశావా-నీచేత యీ ప్రశ్న అడిగించేటట్లు చెయ్యడమే జీవిత రహస్యం!"

"పోండీ-మీదంతా వేళాకోళం చెప్పకపోతే, పోనీలెండి. నేనే కనుక్కుంటూ-''

''తప్పకుండా-నిద్రపో స్వప్నంలో కనబడుతుంది లే-" అని అతను కూడా వెన్ను వాల్చాడు.

"నే కనుక్కున్నా రహస్యం, మీరే-"

అని మత్తుగా నవ్వి నిద్రలో చూపు తెరిచింది- తెల్లారింది, సూర్యకిరణాలు చెవుల్లో గిలిగింతలెట్టి వారిని లేవగొట్టాయి.

# 10

## ఆకులు రాలడం

నెల గడచిం తర్వాత, ఇందిరికి జబ్బు తీవ్రరూపం దాల్చింది, నిధిని వెంటనే రమ్మనమని టెలిగ్రాం వొచ్చింది, శీతాకాలం, చలిరోజులవి. టెలిగ్రాం చూసుకుని దయానిధి మేడమీద గదిలోకొచ్చాడు. కోమలి రాట్నం వొడకుతూంది. అతను తొందరగా సామాన్లు సర్దుకున్నాడు.

"టపా చూసుకున్నారా? యిందాక, వొచ్చాయి-" అంటూ ఉత్తరాలకట్ట అతని కిచ్చింది.

అందులో వొకటి రిమాటిక్ సీనూ దగ్గరనుంచి. అందులో కొంత భాగం :

"నాకు నిన్ను చూడాలనుంది. నేను వొస్తాననడం, మళ్ళా రాలేకపోవడం, నీకూ, నాకూ మామూలైపోయింది, ఈసారి వొస్తున్నానని వ్రాస్తే నువ్వు నమ్మలేవేమో, గొల్లవాడు తోడేలు కథలో మాదిరి. బినా హిందూదేశం యింత పెద్దది కావడం, భారతీయుల దౌర్భాగ్యం అనుకుంటూ. దేశం వైశాల్యమే, యీ దేశం యొక్క అభివృద్ధికి అంతరాయం అనుకుంటూ, ఒక్క రోజు చూడక పోతే సూర్యుడు అస్తమించ డనుకునే బాల్యస్నేహితులు, నెలలు సంవత్సరాలు, కలుసు గోకుండా, ఎవరి యిళ్ళల్లో వాళ్ళు బంధించబడి, జీవితం ముగిస్తారేమో. చిన్నప్పుడు అంతా ప్రేమ, స్వేచ్ఛ, వెలుగు, రోజులు గడిచిన కొద్దీ వెలుగు సన్నగిల్లుతుంది. జైలు కడ్డీల నీడలు పొడుగవుతుంటాయి. బాల్యస్నేహాలు, శృంగారంతో కొట్టుకునే హృదయాలు, వొక్కటొక్కటే విడిపోయి, జారిపోతాయి. ఒక్క

రొక్కొకే చెట్ల ఆకుల మాదిరి రాలిపోతారు. జనసమూహంలోంచి, ఏకాంతంలోకి నడవడంలాంటిది. నా వుద్యోగం, నా కుటుంబం, నా పిల్లలు, నావూరు, నాదేశం, నామతం - యీ 'నా'లో మానవుడు బంధించ బడతాడు, 'నా' లేకుండా వుంటే ఎంత బాగుండును! ఇల్లాంటి వెన్నో నీతో మాట్లాడుకోవాలనుంది, రేవు సాయంత్రాం బండికి వొస్తున్నానంటే నవ్వకు సుమా!''

ఆ వుత్తరం చదువుకుని, సర్దిన పెట్టిని వొక మూలగా నెట్టి వేసి, సోఫాలో కూర్చున్నాడు. కోమలి సోఫా వెనకాల కొచ్చి, అతని బుజం మీద చెయ్యివేసింది.

'నన్ను కూడా తీసుకెళ్ళరూ, ఇందిరని చూస్తాను.' అన్నదై,

'నేను వెళ్లడం లేదు రేవు వొక స్నేహితు డొస్తున్నాడు.'

'ఎక్కువగా వుండటగా, వెళ్ళకపోతే బాగుండదు, స్నేహితుడికి రావొద్దని టెలిగ్రాం యివ్వండి.'

"ఐనా నేను వెళ్లి చేసే దేముంది?''

"అ దేమిటి అల్లాగంటారు? పెళ్ళాంకి ప్రాణంమీదికి వొచ్చినా వెళ్ళి చూళ్ళే ని, మిమ్మల్నే అంటారు -''

"ఇప్పు డనడం లేదు గనకనా? - ''

'పైగా నామూలాన్నంచి అంటారు, తెలిసిందా?''

"నువ్వు నాతోకూడా వొస్తే, యింకా యేమనుకుంటారో అని భయం లేదు నీకు?''

''ఉందనుకోండి - నేను యిట్లాంటి వాటికి అలవాటు పడ్డ దాన్ని, తెగించిన దాన్ని - ''

' నేనూ అంతే—''

''నే నొచ్చి, ఆవిడకి సంరక్షణ చెయ్యాలని వుంది.''

"నిన్ను నన్నూ చూస్తే, జబ్బు మరింత ఎక్కువయి అప్పుడే కళ్లు మూస్తుంది, ఏ స్త్రీ, మరో స్త్రీని హర్షించదు.''

''ఏం మ్మాట లంటవి? ఆడదాని మనస్సు మీకు బొత్తిగా తెలీదు. పోనీ మీరు రేవు వొద్దురు గాని, యీలోగా నేనూ, నారయ్య వెళ్ళి రామా?''

ఇంతలో మెట్లమిద అడుగుల చప్పుడైంది. ఐదారుగురు పని

వాళ్ళు, మేస్త్రీ సెక్టేకల్ తొందరగా లోపలి కొచ్చి ‘‘యిక్కొరండి’’ అని సంజ్ఞ చేశారు. దయానిధి, కోమలి గబ గబా మెట్లు దిగి కిందికి వెళ్లారు. ముందు వరండాలో నారయ్య చాప మీద పడుకున్నాడు. భుజాల మీద రెండు పెద్ద గాయాలు. నెత్తిమీద చిన్న గాయం తగి లాయి, రక్తం కారుతోంది, తొందరగా బాగ్ తీసుకొచ్చి, నిధి చికిత్స చేస్తున్నాడు.

‘‘సోమప్పగాడి పనండి’’ అన్నాడు మేస్త్రీ,

‘‘ఏం?’’ అని అడిగింది కోమలి.

‘‘మీరేం సెప్పక్కర్లే, మీ పన్లమీద మీరు పోండి’’ అని నారయ్య మూలిగాడు.

‘‘నారియ్య పెద్దంగా రెడ్డిమీద ఉరుస్తాడు, ఓసారి పని కాడ దంగీ యిప్పమంటుండాడు నారయ్య. నే యిచ్చేది లేదంటుండాడు రెడ్డి. అపటికి నారయ్య తెగిసిపోయుండడు. రెడ్డి, సోమప్ప ఏదేంది సవోళ్ళిటూ లోడి ఏని యీణ్ణి గదమాయించినోరు. ఈపు, ఆళ్ళని అరిసి, తంతానన్నడడు, అది తాగుబోతు, అన్నుండోరు,’’

కోమలికి యీ కథ యేమీ అర్థం కాలేదు, తెల్లబోయి నిధి కేసి చూస్తూ నిలబడింది. మరో పని వాడు సింగప్ప, చెప్పడం మొద లెట్టాడు,

‘‘ఈ పీకులాట దడ్డుక డొచ్చుండది అయ్యావారు! అయ్యా వారితో సెప్పి, రెడ్డి బత్తెంలో బొట్టు తగ్గిస్తా నన్నడడు నారయ్య. ఇది యినంగానే సోమప్పకి సివమెత్తింది, మారెమ్మ లేదండి సామే, రెడ్డితో పరాచికాలాడుతుంది అని నారయ్యకి పట్ట లేదండయ్యవోరా దాని జోలికి పోవద్దని, నారయ్య పెద్దగా అరిసి పరు చేసుండడు. నారయ్యకీ మారెమ్మకి యేందో వుందని రెడ్డి తెగటినాడు, మారెమ్మని, రెడ్డిని ఒకాడనే వొద్దన్నీ, యేరేరుంగా తొవ్వండని నారయ్య డొకాయించినోడు. మారెమ్మ సోమప్పతో సెప్పుకుంది, అది రెడ్డికి కన్నెర్ర. ఇద్దరూ ఏకమై మెత్తగా తన్నుండోరు,’’

ఈ కథ కూడా కోమలికి పూర్తిగా అర్థం కాలేదు, వాళ్ళని కూకలేశాడు నలుగురు పనివాళ్లు జారిపోయ్యారు,

గిరి గుప్పన్న మాత్రం మిగిలాడు. దీనంతటికి కారణం అతను చెప్పడం మొదలెట్టాడు.

"ఇదంతా అల్ల కర్నూలు సాముండనే, ఆడెక్కించిన విష—"

"కర్నూలు స్వామెవరు?" అన్నాడు నిధి.

"ఆడా యీడా" గుంపుల్లో ఎగడ ఏదో సెప్తుంటాడు. ఆ మద్దిన మీరు యీడకొచ్చిరు సామీ కర్నూల్లో మీటింగం చేసుండాడు. ఏనోళ్ళని దమ్మని డబులేయిస్తే, సేపోయుంటివి. ఆదు, దుడ్డు బాగా యిస్తేగాని, పనుల్లో కెళ్ళొద్దని, యిసుకిచ్చిండాడు. రెడ్డికి సివమెత్తింది. నారయ్య దగ్గ కోయిస్తాంటుండు అయ్యవారితో చెప్పి. యీణ్ని ఏస్కోవాలె పో అని సోమప్పతో సెప్పి, మారెమ్మ సాసు మీద బాగా తన్నుండరు."

తన బాధ్యత తీరిపోయినట్లు, అతను కూడా వెళ్ళిపోయాడు. మూడు కథలు విన్న తరువాత నారయ్యని, వాళ్ళు ఎందుకు కొట్టారో నిధికి బోధపడింది. నారయ్య మాట్లాడడం మానేశాడు. కట్లు కట్టిం తర్వాత నిధి లోపలికి వొచ్చేశాడు.

"మీకేమన్నా బోధపడిందా?" అని అడిగింది కోమలి.

"నారయ్య రెడ్డిమీద అధికారం చలాయించ బోయ్యాడు. మారెమ్మతో రెడ్డి సరసాలాడటం నారయ్యకి నచ్చలేదు, తిప్పేస్వామి, పనివాండ్రని ఎక్కువ జీతాలకోసం సమ్మె చెయ్యమని ప్రోత్సహించాడు. ఇవన్నీ కారణంగా, రెడ్డి సోమప్ప కలిసి, నారయ్యకి పాఠం చెప్పారు. ప్రజాప్రభుత్వం ఎట్లా గుంటుందో కాస్త రుచి చూపించారు."

"ఐతే మీ రెళ్ళరూ?"

"ఎట్లా వెళ్ళను?"

మాట్లాడుకుంటుండగా ఇందిరకి మరీ తీవ్రంగా వుందని మరో టెలిగ్రాం వచ్చింది. తనే మద్రాసుకి వస్తున్నానని శ్రీనివాసరావుకి నిధి టెలిగ్రాం యిచ్చి ప్రయాణం కట్టాడు, సాయంత్రం బండికి. మధ్యాహ్నం రెండు దాటింది. స్టేషన్‌కి బండికోసం కబురు చేశాడు నిధి. ఈలోగా అనంతాచార్లుగారు చక్కా వచ్చాడు. అయన్ని

చూడగానే కోమలి లోపల గదిలో కెళ్ళిపోయింది. తలుపు వెనక నిలబడి, వారి సంభాషణ వింటోంది.

"మొన్న దేవరకొండలో మళ్ళా గంద్రగోళమైంది విన్నావా?" అన్నాడు అన ఆచార్లుగారు.

"చూచాయగా తెలిసింది."

"మళ్ళా మీ రాజభూషణమే అల్లరిపెట్టాడు, పేటింగు ముగిసిం తర్వాత గుండప్పగారింట్లో భోజనాలేర్పాటయ్యాయి. అక్కడ పెద్ద వాదం జరిగింది, గుండప్పగారికి యిద్దరు భార్యలు. ఇతను అయన్ని ఆక్షేపిస్తూ మాట్లాడుతున్నాడని అనుమానపడి, గుండప్ప, సర్కార్ల వాళ్ళకి నీతి, మర్యాద లేదని జాడించేశాడు, ఆ ఘర్షణలో పేచీ రొచ్చింది, కోమలి పేరు కూడా ఎత్తినట్లు నాకు గుర్తు—"

"గుండప్పగారి ఫిర్యాదు ఎల్లాంటిది?"

"ఏముంది? ఏవో అనవసరపు ప్రదేశాలు తెచ్చుకుని, మాటా మాటా అనుకోడం పెండ్లి లేకుండా పరాయి స్త్రీతో వుండటం కంటె ఇది మెరుగే అంటాడు. భార్యని ఇతరులు అపహరించకుండ కాపాడుకోడమే పెండ్లని రాజభూషణం అన్నాడు, దాని మీద అయన రెచ్చిపొయ్యాడు కొట్టుకు నేందుకు సిద్ధపడ్డారు. నేను అడ్డం పడి సర్ది చెప్పాను, నన్ను మట్టుకు వొదిలారనా?"

"ఏం?"

"ఏముంది, తుంటర్లు! కాత్యాయనికి పెండ్లి కావడం కష్టం అంటాడు గుండప్ప. పోన్లే మా అమ్మాయి విరాగిణిగానే వుంటుందిలే, నీ కెందుకన్నాను. ఇంతకీ రాజభూషణం ఆ రాత్రే, మా ఎవళ్ళకీ కనబడకుండా వెళ్ళిపొయ్యాడు. ఈ రెడ్లు, పాపం, నారయ్యని చావదన్నారు చూశావా?"

"అవును మరి నారయ్యదే తప్పనుకుంటా" అన్నాడు నిధి.

"పడిశాడు వెధవలు, వాళ్లు పొగరెక్కి ఇద్దర్నీ పనిలోంచి తీసెయ్యాల్సిందే—" అన్నాడు అచారిగారు,

దానివల్ల సమస్య పరిష్కారం కాదు. అంతకీ కారణం ఏదో వుంటుంది. దాన్ని తొలిగించాలి. మీ కేమన్నా తెలుస్తోందా?"

"నా కేమీ కనబడ్డం లేదు."

"జాతి వైరం, సరిహద్దు కొట్లాట, పేదలకీ ధనికులకీ నిరంతరం జరిగే యుద్ధం. ఆర్థిక సమానత్వం వుంటేగాని మానవుడు అందరినీ సమానంగా ప్రేమించడం నేర్చుకోడు."

"సోషలిజమ్ రావాలనా నీ వూహా?"

"నా వూహా కాదు దయాదాక్షిణ్యాలు, ఔదార్యం, ప్రేమ-వుల్లాంటి విలువలకి. భౌతిక సంపదకీ అంతటి దగ్గర సంబంధం వుంటే వుత్తమ ఆధ్యాత్మిక జీవనం అన్నింటినీ త్యజించి చీకూ చింతా లేని యోగికే సాధ్యం అవుతోంది గాని, కుటుంబీకుడికి సాధ్యపడటం లేదని నీకు తెలియంది కాదు. అందరూ యోగులు ఎల్లానూ కాలేరు. కారు; కాకూడదు కూడానేమో! అంచేత, అందరికీ సమాన భౌతిక సంపదని సమకూర్చడం తప్ప గత్యంతరం లేదనుకుంటా. దాన్ని సోషలిజమ్ అనండి, మరోటనండి."

"అవన్నీ గాలిలో మేడలు కాని, జరిగేవనా? జరిగినా, మనిషికి కావల్సింది, తిండీ, బట్టా అంతేనా?"

"అంతే అనను. అవి లేందే, యింకేవీ రావంటాను. అంతే; ప్రభుత్వం, ద్వీపాంతరవాస శిక్షలో వున్న వాళ్ళకి, తిండి, బట్టా సమానంగా ఏర్పాటు చేస్తుంది. ప్రేమ, ఔదార్యం, ఆధ్యాత్మిక చింతన మనం వాళ్ళల్లో చూడొచ్చు. ఉత్తమ గ్రంథాలు, జైళ్ళల్లో వ్రాయబడినవే-బట్టని విసర్జించిన వ్యక్తి న్యూడిస్టు కాలనీలో మోక్షం పొందుతాడేమో చెప్పలేను కాని, తిండిని విసర్జించి మోక్షం పొందిన జీవిని ఎవ్వరూ చూడలేదు-"

అనంతాచార్లుగారు ఆలోచనలో పడ్డా, ఏదో ప్రశ్న అడగడానికి సందేహిస్తున్న వాడికిమల్లే వున్నారు. రెండుమూడుసార్లు ఆ ప్రశ్న నోటిదాకా వొచ్చింది, ఐనా దిగమింగేశాడు; మరోప్రశ్న తెగించి అడిగేడు,

"పోనీ, మనిద్దరం వెళ్ళి నీ భార్యని తీసుకొద్దామా?"

"జబ్బుగా వుందిట. ఇప్పుడే వెళుతున్నా, చూడ్డానికి. తప్పు తెరవై అడుగుతేనా పూర్తయినట్లు లేదు."

"వారంలో అవుతుంది, పనివాళ్ళు పల్చబడకపోతే,"

"గని తవ్వించడం విరమిద్దామా అని వుంది,"

"ఇంతవరకూ వొచ్చి, యిప్పుడు మానెయ్యడం ఎందుకు? ఆ పనులన్నీ నే చూస్తాలే, నువ్వెళ్ళి నింపాదిగా వుండి తరవాత తీసుకురా,"

ఇంతలో, కోమలి రొట్టెముక్కలు పంచదార పళ్ళెంలో వేసి కప్పుతో పాలు తీసుకొచ్చి, ఆచారిగారి ముందు బల్లమీద పెట్టింది. ఆమెని చూడగానే ఆచారిగారు కుర్చీలో కదిలాడు.

"నేను కూడా వొస్తానంటున్నానండి."

"ఇక్కడ వొక్కదానివు వుండనక్కర్లేదులే. మా యింట్లో వుందువుగాని" అన్నాడు ఆచార్లుగారు.

"నా మూలాన మీ కుటుంబానికి కష్టం ఎందుకు కలగాలి?"

"కష్టం ఏముంది?"

"కష్టం కాకపోతే, పోనీ నీకు కాత్యాయనికి పెండ్లయితే, ఎవ్వరికీ బెంగ వుండదు."

ఆచార్లుగారు మాట్లాడలేదు. పాలు తాగేసి వెళ్లొస్తానంటూ, వెళ్ళిపోయ్యారు.

"పాపం నారయ్యని వొదిలి వెళ్ళనా?" అన్నాడు నిధి.

"నే చూస్తానుండండి, ఏం భయం లేదు. డాక్టర్లు, నర్సులు యింత మందున్నారుగా!" అంది కోమలి.

ఇంతలో బండి వొచ్చింది. కోమలి పెట్టె, బెడ్డింగు బండిలో పెట్టింది, నిధి నారయ్య దగ్గర కెళ్ళాడు.

"సులువుగానే వుంటుంది. మీరెళ్ళి రండి. కోమల్ని తీసుకెళ్ళమోకండేం" అంటూ నీరసంగా అన్నాడు నారయ్య.

"లేదు, వొక్కణ్ణే వెడుతున్నాను."

"అసలు తగువంతా దాని మూలకంగానే వొచ్చిందండి."

"ఏం?"

"ఆళ్ళ కూతలకే. గాని, ఆ రెడ్డి, కోమల్ని గురించి ఏదేదో అనబోయ్యాడు. మూతిమీద వొక్కటి ఉంటిచ్చాను. దాన్నే ఆళ్ళు వాడికి, యీళ్ళు వాడికీ పంపి, నేనూ పి.రూ. డబ్బుగబిస్తున్నా మన్నారండి. తొత్తుకొడుకులు, నాకు సీద దేసి వుతిగారండి. ఇట్టా నేసి వారు ముండాకొడుకులు, తెగనీడి మక్క లిరగదంతాము."

''నారయ్యా! మన పరిస్థితులు సవ్యంగా లేనప్పుడు, లోకులు అనేకం అనుకుంటారు, అవి నిజం కానప్పుడు, మనం కోపగించు కోటం దేనికి? మంచితో వాళ్ళని జయించాలి గాని, పగ సాధిస్తే, సర్వనాశనం అవుతుంది''

''ఈ నా కొడుకుల్తో మంచేటండి? ఏ ఎండకి ఆ గొడుగ్గే నండి''

''సరేలే-పడుకో-''

''ఏం భయం లేదు, ఎళ్ళిరండి.''

నిధి వెళ్ళి బండీలో కూర్చున్నాడు.

కోమలి నిలబడి, బండిలోకి వొంగి, అతని చేతులు పట్టుకుని, కళ్ళల్లోకి జాలిగా చూసింది.

''దబ్బుని రావాలి.''

''ఎన్ని రోజు లవుతుందో ఏం చెప్పగల్ను?''

''మిమ్మల్ని చూడకపోతే వుండలేను. నేనూ వొచ్చేస్తా రేపో మాపో కోపగించుకోకండేం?''

''నారయ్యని వొదిలే!''

''ముసిలాడివి దుక్క శరీరం, చావడు'' అని నవ్వింది,

''వొచ్చేటప్పుడు అమృతంగార్ని, అవిడ తమ్ముడునీ, అందర్నీ తీసుకురండి-''

బండి కదిలింది, కోమలి పడబోయి, వెనక్కి తుళ్ళిపడి, బండి సందు తిరిగేదాకా చూస్తూ నిలబడింది, దూరంగా ఎర్రచీరలో, చిన్ని చుక్కలాగై, ఎండలో కలిసి, మెరిసి, మాయమైంది కోమలి.

* * *

స్టేషన్‌కి ఎవ్వరూ రాలేదు. బండి దిగి మామగారింట్లో అడుగు పెట్టేటప్పటికి సాయంత్రం నాలు గైంది. ఇంట్లో మను షుల సందడి లేదు. పనిమనిషి మందువా వూడుస్తోంది, మధ్యలో నిలబడి ''ఎవరికోసమండి?'' అని అడిగింది. నిధికి ఏం సమాధానం చెప్పాలో తెలిసింది కాదు. ఎవర్ని వరసపెట్టి పిలవడం అలవాట్లేదు, పెడ్డింగు బల్లమీద పెట్టించి, అరుగుమీద పచార్లు చేస్తున్నాడు, ఇంతలో పదెనిమిదేళ్ల వయస్సుగల కుర్రాడు, అతని దగ్గరగా వొచ్చి ''ఆ

బల్లకింద నా బొంగరం యిరుక్కుంది, తీసిపెట్టరూ?'' అన్నాడు.

"ఎవరమ్మా నువ్వు?''

' మాధవయ్యగారబ్బాయిని. మీ రెవరు?''

''ఇందిర తమ్ముడివా?''

"ఊ, నా బొంగరం తియ్యరూ?''

అబ్బాయి మొహాన్ని బట్టి ఇందిరని వూహించ యత్నిస్తున్నాడు నిధి, బల్లకిందికి పాకి, కఱ్ఱతో బొంగరాన్ని యివతలికి లాగాడు, దాంతోపాటు చచ్చిన ఎలక కూడా యివతలి కొచ్చింది.

"నే నెవర్నో ఎరగవు?"

''ఉహూ!'' అంటూ తల పంకించి, బొంగరంతో రోడ్డు మీదికి నడిచాడు కుఱ్ఱాడు.

' అయ్యగారు లోప లుంటారు, రమ్మంటుండారండి'' అన్నది పని మనిషి. లోపలి గదిలో చాపమీద గోడకి జార్లపడి కూర్చున్నాడు మాధవయ్యగారు. మొహం చేతుల్లో దాచుకుని కాళ్ళమీద ఆనుకుని చతికిల బడ్డాడాయన. ఇతన్ని చూడగానే—

"ఆ ఎవరు-ఆ'' అంటూ నివ్వెరపడి చూస్తూ, వొక్కసారి లేచి, ముందుకు నెంతి, 'వొచ్చావా, 'వొచ్చావా' అంటూ నిధిని వెఱ్ఱిగా కౌగిలించుకుని, కళ్ళమ్మట నీళ్లు రాకుండా అతని భుజాన మొహం నొక్కి వుంచాడు.

''ఇంక నువ్వే బతికించావు. మమ్మల్ని దేవుడు ఏట్లోకి నెట్టే శాడు." అంటూ కూలబడి, నిశ్శబ్దంగా బాధ పడుతున్నాడాయన.

''ఇంది రేదీ?'' అన్నాడు నిధి మొహం అవతలికి తిప్పేసుకుని.

బాధ పడుతున్నవాళ్ల మొహాలు చూడడానికీ అలవాటు పడ్డా, అతనికి యిదో వింత అనుభవం. ఈ దృశ్యంలో అతనికి బాధ కనపడ లేదు కాని, వొక అశాంతరాన్ని తొలిగించేటందుకు, మరో అశాంతరాన్ని ఆహ్వానించినట్లుగా వుంది,

''నిన్ను, పోగొట్టుకున్నాను-శాస్తి జరిగింది. కర్మఫలం పూరికే పోతుందా?'

''ఏవేవో అంటూ మాధవయ్యగారు కూర్చున్నవాడు లేచి, తొట్రుపాటుతో పచార్లుచేస్తూ, పైనతువ్వాలు వేసుగుని నిధిని తీసు

గుని బైటికి నడిచాడు, ఇద్దరూ నడవడం మొదలెట్టారు. నిధి మాధవయ్యగార్ని పరకాయించి చూశాడు, జీవితం ఆయన్ని ఎత్తు నుంచి లోయలోకి గిరవాటెట్టింది. కాలం ఆయన్ని మళ్ళా లేవదీసి, పైకి గిరవాటెట్టింది. ఏనా పైన వుండే అర్హత పోగొట్టుకున్న వ్యక్తి కిమల్లే పదేపదే లోయలో పడి, గాయాలు తగిలించుకున్న మనిషి. పైన రెండు పళ్ళు లేవు; వెంట్రుకలు బుర్ర వేడికి తట్టుకోలేక వూడిపడ్డాయి, వూడడానికి వోపికలేని తెల్ల వెంట్రుకలు నెత్తినే ఆశ్రయించుకున్నాయి చర్మం ఎముకల్ని పట్టుకునే శక్తిలేక జారి పోయి. నీళ్ళమధ్య రాతిగుహలో జారి వ్రేళ్లాడే వృక్షజాలం మాదిరి, నిలబడి వుంది. శరీరం లోపల చూడొచ్చు వినొచ్చు నటించేటట్లుగా వుంది,

ఊరవతల చెఱువుగట్టుకి చేరుకున్నారు, దూరంగా పాక, ముందు పందిరి కనిపిస్తున్నాయి ఊరు తగలబడుతున్నట్లు, పాక వెనుక పడమటి ఆకాశాన్ని సూర్యుడు కాలుస్తున్నాడు, దూరంగా ఆవుల మంద కదుల్తోంది. పక్షులు వాటి నిస్సత్తువకి వెక్కిరించినట్లుగా, వెన్నెంటి గుంపులుగా లేచి, చెఱువులో పడుతూన్నాయి.

“ఊళ్ళో వుంచడానికి వీల్లేదన్నారు. ఏ శానిటోరియమ్‌లోనూ ఖాళీ లేదన్నారు. ఏం చెయ్యాం? ఇక్కడ ఏర్పాటు చేశాను” అన్నాడు మాధవయ్యగారు. పాకవెనుక, వొక ముసిలావిడ గిన్నెలు తోముతోంది.

“మా వొదినగారు. పాపం ఆవిడే రాత్రి, పగలూ—”

మంచంపైన మిగిలిన ఇందిర పడుకుని వుంది, పక్కనవున్న ట్రంకుపెట్టె లాక్కుని మంచంప్రక్కన కూర్చున్నాడు. దయానిధి. వికృతంగా నవ్వింది ఇందిర అస్థిపంజరం, ప్రక్కకి కదిలింది—చెయ్యి ఇవతలికి తీసింది—ఆ చర్మంలో శిశువు జన్మించిన ఆశ్చర్యం వుంది.

“కదలకు—బెడ్ సోర్స్” అంటూ బైట నిలబడి మాధవయ్యగారు అరుస్తున్నారు.

అతనికేసి నిశ్చలంగా చూసింది ఇందిర. ఎవరో ఎక్కడికో లాగేస్తున్న చూపులని, బలవంతంగా వొక్కసారి లాగి నిలబెట్టింది. అన్ని శక్తులూ, కంఠంలో వొక్కసారిగా ప్రజ్వరిల్లాయి, గుండెల్ని కాసేపు

కొట్టుగోడం అవుచేసి శబ్దరూపం దాల్చిన అంత్య శక్తుల ఆళ్ళాటం అది,

"వొచ్చారా?—"

ముసలమ్మగారు యీదృశ్యం చూడ లేక లోపలి కెళ్ళి ఏడవటం సాగించింది.

"ఇక్కడ పారేశారు నన్ను—నన్ను వొదిలి వెళ్ళకండేం—"

అని వోపిగలేక ఇందిర కళ్ళుమూసింది.

దయానిధి మనస్సు నిశ్చలంగా వుంది. చుట్టూ శిఖరాలు కరిగి, కదలి పడిపోతున్నాయి. నదులు జన్మస్థానానికి ఎగబ్రాకుతున్నాయి. నేలమీద పడిపోయిన ఆకులు పైకి లేచి చెట్లని కలుసుగున్నాయి, ఇంతఅనిశ్చలమైనవాతావరణంలో తనొక్కడే స్థిరంగా, ప్రశాంతంగా వున్నాడు. అతనికి వుద్రేకం లేదు, బాధ లేదు, బెంగ లేదు, దిగులు లేదు. ఇందిరతో కలిసి సూర్యోదయ సౌందర్యంతో ఆవులించ లేదతను; చందమామ చల్లటి అందంలో నిద్రలో ప్రేమతో కదలలేదతను; నక్షత్రాల కనుసన్నలకి కామంతో వొణకలేదతను; చల్లటి నీళ్ళ పులకరింతలతో సొమ్మసిల్లలేదతను; గుండెలూ, గుండెలూ విశ్వగానంతో మేళవించి కలిసి కొట్టుకోలేదు, అన్ని నదులూ కలిసి పొయ్యే మహాసముద్రంలాంటి ప్రేమ ప్రవాహంలో వారి రక్తాలు వేరువేరుగానే ప్రవహించాయి. సృష్టికోసం పెనుగులాడటం నేర్చుకుని అమాయకపు ప్రాణుల పిచ్చిప్రశాంతం అతన్ని ఆవరించింది. పాటలు పద్యాలు, యజ్ఞాలు, యాగాలు, క్రతువులు, ప్రార్థనలు,— ఎన్ని చేసినా, చందమామ అంతకంటె ఎక్కువగా ప్రకాశించదు. గాలి అంతకంటె జోరుగా వీయదు; కెరటాల సంఖ్య పెంచుకోలేదు సముద్రం; ప్రేమించదు మానవహృదయం సుఖపడటం నేర్చుకోని వాళ్ళకి బాధపడటం చేతగాదు.

మళ్ళా ఇందిర చూస్తున్న లోకంలో తలుపులు తెరుచుకున్నాయి; కళ్ళు తెరిచిందా—!

"నన్ను ఎప్పుడూ వొదిలి వెళ్ళకండేం—" శరీరంలోంచి విడిపోయిన చెయ్యి అతని చేతిని ప్రమాదంగా స్పృశించింది. చేతి చర్మం తిరగేసినట్లుంది. ఇంకా యీ పెనుగులాట ఎందుకో! ఎవరి

కోసమో యీ గుండెలు కొట్టుగోడం, ఎందుకో! చర్మాలని పట్టుకొని పీక్కుతినడా లెందుకో! యీ లోకంలో ముసుగులి మరోలోకంలో తెరుచుకొన్న ఆమె నేత్రాలకి యీ చీకటిలో వాగుడు మూత లెందుకో!

ఏమనాలి? ఏం చెయ్యాలి? అతనికి తెలీడంలేదు. లేచి బైటకి వొచ్చాడు. పడమటి ఆకాశపు మంటలోపడి సూర్యుడు దగ్ధమై పోయాడు, నుసై మేఘాలు కొట్టుకుపోతున్నాయి, ప్రకృతిబాధతో చీకటైంది. పాకచుట్టూ పెనవేసుగుని గాలి మూలుగుతోంది. టెలిగ్రాఫ్ స్తంభంపై కాకి ఏకాంతంగా ఏడుస్తోంది. ఎవరికోసమో లోపల్నుంచి "నాన్నా" అని పెద్ద కేక వినబడింది. "మాడు నాయనా" అంటూ మాధవయ్యగారు నిధిని లోపలికి గెంటాడు. "వెళ్ళిపోతారా?" అని ఇందిర రెండుకళ్ళని ప్రశ్నార్థకంగా త్రిప్పి; మావు నిలబెట్టి వేసింది. అది మృత్యువు జీవాన్ని అడిగిన ప్రశ్నని అతనికి తెలుసు. అతని చేతిని పట్టుగుని వూపింది. ఆ పడవకి అంగరి అందదు; ఏ శక్తీ దాన్ని నిలబెట్టలేదు, మృత్యువుని స్పృశించాడు. జీవంయొక్క కడసారి మాధుర్యం అతని చేతుల్లో తన్నుకులాడింది. సృష్టి రహస్యాల్ని అతను శోధించినట్లుయింది. అతని హృదయంలో ప్రశాంతమైన వెలుగు వాహిని, సుఖదుఃఖాలని విసర్జించి, వుద్రేకాలకి అతీతమైన మహత్తర చైతన్యం అతన్ని వుత్తమ మానవుణ్ణి చేసింది.

లోపల ముసలమ్మ, బైట మాధవయ్యగారు, ప్రపంచానికి అర్థమయ్యే ఏడుపు సాగించారు, ఏడ్పులో గాంభీర్యం, పరిపూర్ణత వుంది. దానికి అంతరాయం వుండకూడదు, మానవుణ్ణి జీవితానికి కట్టి పడేసేది కన్నీరు. అది అంత్యాలున్నది కన్నీ రొకటే, దానికి అతీతమయ్యాడు దయానిధి. మానవ జీవితాన్ని కన్నీటి బిందువుగా మార్చి, అరచేతిలో వుంచుకొని, దాన్ని పరీక్షగా చూసి, కరిగించి వేసే సమయం అది. ఆ కన్నీటి బిందువులో కలిసిన వెన్నో ప్రేమ వాహినులు; ఎన్నో నవ్వు అలలు; మనిషినీ మనిషినీ బంధించిన తుంపరల గొలుసు. యవ్వనంలో వేడెక్కి, వార్ధక్యంలో మంచు గడ్డయి, మృత్యువులో పరమార్థం పొందిన కన్నీటి బిందువుకి అర్థమే

లేదా? లేదు. కన్నీటికి అర్థం లేదన్న తలంపుకి కన్నీరు తప్ప, కన్నీటికి వేరే అర్థంలేదు.

కర్మకాండ ఢంకా తనే జరిపాడు. ఇందిర మహాయిల్లాలన్నారు; పుణ్యం చేసుగుని పునిస్త్రీచావు చచ్చిందన్నారు. పిల్లలు లేకపోవడం మెరుగన్నారు పెద్దలు. అతన్ని మళ్ళా పెళ్ళిచేసుకో మన్నారు పెద్దలు. శవాన్ని తగుల బెట్టి నడిచి వొచ్చిన కాళ్ళతో పెండ్లి పీటల మీద కూర్చోమన్నారు. చితికి అగ్గిపుల్ల గీసిన ఆచేత్తో, అగరొత్తులు ముట్టించమన్నారు. ఆత్మశాంతికోసం అర్థం లేని ధ్వనులు చేసిన ఆనోటితో గదిలో జాటసారి చెవులో ప్రేమమంత్రం పఠించమన్నారు. ఈ మనుషులు గోనిబస్తా మనుషులు. ఏ బస్తా ఖాళీగా వుండకూడదు: అందులో పుష్పాలు వెయ్యాలి; లేకపోతే రాళ్ళు వెయ్యాలి; కట్టెలు వెయ్యాలి. ప్రతివాణ్ణి ఆ బస్తాలో పడేసి, చెట్టు కొమ్మకి వ్రేళ్ళాడ తీస్తారు.

ఐదువేలు కట్నం అన్నారు; పదివే లన్నారు; ఎవరి పీకకో తాడుకట్టి నులప మన్నారు; అందుకు లంచం ఐదువేలు - అందమైన, గుండ్రని మృదువైన అమాయకపు పీకలు. అతను రైలు ఎక్కేదాకా అంటూనే వున్నారు; అతన్ని సెకండుక్లాస్‌లో కూర్చోబెట్టి, పక్కపెట్టెలో కొంత దూరంవరకూ ప్రయాణం చేశారు పెద్దలు. వారిని తప్పించుకుని బైటపడ్డాడు ప్లాట్‌ఫారం మీద ఆడాళ్ల పీకలు చూసి భయపడ్డాడు. టికెట్ యిచ్చేసి, వొంటెద్దుబండి కట్టించుగుని గోదావ రోడ్డుకేసి పోనీ మన్నాడు.

* * *

గోదావరి గట్టమ్మటే నాలుగుమైళ్లు వెళ్ళింతర్వాత దయానిధి, జగన్నాథం ఆశ్రమానికి చేరుకున్నాడు. తొమ్మిది గంటలైంది. గట్టుకి ఫర్లాంగు దూరాన, పల్లంలో, ఒక పెద్ద పూరిపాక, రెండు మూడు చిన్న గుడిసెలు వున్నాయి. ముందు రెండు పెద్ద చెట్లు చల్లటినీడల్ని వేస్తున్నాయి, వెనక గడ్డివామి, రెండు మూడావులు, దూడలు గంతులేస్తూ మేస్తున్నాయి, ఒడ్డున సగం నేలపైకి లాగిన పడవ, కట్టకి కట్టే వుంది. నిధి బండిలోంచి తన బెడ్డింగు దించి, బండివాడికి డబ్బు లిస్తుండగా, దూరంగా లోపల్నించి వొక సన్నటి

పొడుగా టాయన పరుగెత్తుకుంటూ వొచ్చాడు. మధ్యపాపిడి, వక్కలకి అణిచి దువ్విన పొడుగాటి వెంట్రుకలు. సన్నగా ఎత్తుగా తేచిన ముక్కు, కొంచం పైటికి వొచ్చే కింది పెదవి, తెల్లటి పొడుగు ఖద్దరు పైజమా, బొత్తాలు లేని కంటి మెడ లాల్చీ, పైన తువ్వాలు, ఎడం చేతిలో పొట్టి కఱ్ఱ—ఆ వ్యక్తి జగన్నాథం.

"రుగావజా, రుగావజా-" అన్నాడు, పూర్తిగా బొంగురు కాని కంఠంతో. యవ్వనంలోని అబలత్వం యింకా ఆ కంఠంలో వుంది.

నిధి వెనక్కి తిరిగాడు, జగన్నాథం రెండు చేతులూ, అతని మెడచుట్టూ వేసి. కౌగిలించుకుని "రుగావజా, కిళ్ళన్నావు, కిళ్ళన్నావు...." అన్నాడు. ఆప్పిలా అమర్చబడ్డ నల్లటి కనుబొమ్మలు అతని కళ్ళకి వొక తీవ్రత నిచ్చాయి ఆ తీవ్రత ప్రదేశంలో చలించింది.

"తమిళం నేర్చుకుంటున్నావా?" అన్నాడు నిధి.

"మా పాఠశాలలో చేరినవారై, శిష్యత్వం స్వీకరించి, వొనమూ లభ్యసించొచ్చు, లైక్ మై లైఫ్-నా జీవితంలాగా, నా భాషయున్ గూడ తల్ క్రిందులైందని గ్రహించరేల, రుగావజా!" అన్నాడు. ఇద్దరూ కసిగా నవ్వుకున్నారు. అతని రెండు చేతులు పట్టుగుని కళ్ళల్లోకి చూశాడు నిధి. పక్కున నవ్వాడు,

"ఓస్-మనమూ చెయ్యగలం" అంటూ జగన్నాథం కూడా పక్కున నవ్వాడు. అట్లా యిద్దరూ, నిలిచి, నిలిచి, నాలుగైదుసార్లు అర్థం లేకుండా నవ్వుకున్నారు. బండివాడు తెల్లబోయి, పక్కన నవ్వి, ఎద్దుని హుషార్ చేసి, యీల వేసుగుంటూ, బండిని తోలుకు పొయ్యాడు,

'కఱ్ఱతీసుకొచ్చావ్, కొడతావా ఏమిటి?"

జగన్నాథం, చేతులో కఱ్ఱని పైకెత్తి, దానికేసి చూస్తూ—

"A dog hath a bone to lick
A girl hath a flower to pick
The king hath a bed to fall sick
But a Lord of the world (అంటే జగన్నాథ్) has only a stick.

మదీయ జీవగఱ్ఱ—జ్ఞాపకం వుందా. జీవము + కఱ్ఱ—అగము నంది— The staff of my life—

ఏ కొండకోనల మశిసియుంటిరి? ఏ సీమ దాగియుంటిరి?—యిన్నినాళ్లు. చెప్పండి—" అని కఱ్ఱని రెండుసార్లు గాలిలో విదిల్చాడు,

జగన్నాథం తువ్వాలుతో పాగాచుట్టి. బెడ్డింగ్ నెత్తి నెట్టుకుని, "ఆర్యా స్వాగతం, సుస్వాగతం—తదీయ రాకచే-యక్స్‌క్యూజ్ బాడ్ గ్రామర్-మదీయగృహాంబు-ఫ్యూర్లీ ఫర్ ది సేక్ అఫ్ రైమ్-పావనంబయ్యె—దయచేయుడు—లేదా—ది గుడోల్డ్ మిడీవల్ ప్రెడిషన్—శ్రీ శ్రీ శ్రీ మహా, మహా. తత్ ఓం, ఓం, ఓం-శ్రీ శ్రీ శ్రీ,-బహుపరాక్-" అంటూండగా యిద్దరూ నడిచి యింట్లోకి చేరుకున్నారు.

ఇంకా నలుగురు కుఱ్ఱాళ్ళు చెట్లక్రింద చాపలమీద కూర్చుని చదువుకుంటున్నారు. వాళ్లు లోపలికొచ్చారు, ఒకబ్బాయి నిమ్మరసం నీళ్ళల్లో పోసి, పంచదార కలిపి తీసుకొచ్చాడు. ఈలోగా జగన్నాథం తువ్వాళ్ళు తీసుకొచ్చాడు.

"స్నానం ఆచరింతమా?"

"ఓ. ఐతే నీ ఆశ్రమానికి ఏం పేరెట్టావ్?"

"ఈ పుణ్యభూమిని ఆశ్రమం అనడం పాపమని గ్రహించండి స్వామీ. ప్రపంచంతో నిమిత్తంలేని వారి కిది తావులేదు.—టుయూస్ సారయ్యాన్ లేంగ్వేజ్, ఫర్ చేంజ్-సంఘంలో వుండవల్సిన వారికి యిక్కడ మార్గం చూపుతాం, అజ్ఞానాంధకారంలో వున్న నిరక్షరాస్యులకి—ప్రబంధశైలి మహాశ్యా—జ్ఞానం కలిపించి, వెలుగు చూపుతాం—"

"ఆ సంకల్పం వున్నవాడవు, వూళ్ళోవుండక, యీ నిర్జన ప్రదేశంలో ఎందుకు?"

"అంతరాయం లేకుండా కార్యనిర్వహణ కొనసాగించడానికి-'కాలవర్షం'—ఇంతకీ బావగారు, మనలో మనమాట, పొట్ట కూటికోసం, వుద్యోగంకోసం అడ్డమైన వాళ్ళ లెగ్సు పట్టుగోటం నాకిష్టం లేదు, చాలా కాదు. కొన్నాళ్లు ఆ అవస్థలన్నీ పడ్డాను, ఎవడో మనకి

వుద్యోగం యిచ్చేదేమిటి. మనమే యిద్దాం, అనుకుని, అట్టే ఆలో చించితే, బుఱ్ఱ కెరటం వొచ్చింది. ఈ అజ్ఞానంలో పడ్డాను - bye the bye 'అజ్ఞానం' అన్నది, మీ రింతకుపూర్వం 'ఆశ్రమం' అని వ్యవహరించినారే, దాని నామాంతరం. Why so, you may ask."

ఒడ్డుకు చేరుగున్నారు. నీళ్ళల్లోకి దిగారు.

"ఇది మన జీవిత నౌక, నావ, సుకుమార డింగీ. సాయంకాల విహారానికి,—" అని జగన్నాథం, ఆ పడవ మీదకి ఎక్కి అందులోంచి, నీళ్ళల్లోకి దూకి, యీది స్నానం చేస్తున్నాడు.

ఒళ్లు తుడుచుకుని, చెట్టుకింద కూర్చున్నారు.

"ఐతే బావగారు, ఇందిర పోయిందంటగా-"

"అవును."

"జీవితం చిత్రమైంది సుమండి. మనిషి అడ్డుతగలకపోతే, జీవితం, సమస్యలని అదే పరిష్కారం చేస్తుంది."

"అది పరిష్కారం కాదు, సమస్య లేకుండా చెయ్యడం పరిష్కారం ఎట్లా గవుతుంది? సమస్య లేకపోవడం మృత్యువు చిహ్నం. అవుతే, జగన్నాథం, నీకు పెండ్లాంతో కాపరం జేసే యీడొచ్చింది—"

"ఎవరి పెండ్లాంతో మహాత్మా? వుడ్‌హౌసియన్ జోక్— నాకు స్త్రీలు అర్థంకారండి—వాళ్లతో నిమిత్తం కనపళ్లేదండి— బొమ్మలతో మాదిరి, వాళ్ళతో ఆడుకోవాలనిపిస్తుంది. కాని, ఏ వొక్కరితోనూ, ఫర్ ఆల్ టైమ్ వుండడం అంటే భయం, అండి.— నా వుద్దేశం—మొదటి మనిషికి తోచక యిదవుతుంటే కాలక్షేపానికి, 'స్త్రీ'ని సృష్టించుకున్నాడని నా అనుమానం - హాల్డేన్‌కి వుత్తరం రాసి కనుక్కోవాలి-"

"నీకు వాంఛ-"

"Say, passion."

"అదే-పోనీ-లేదు నీకూ?"

"ఏమీ పనీపంగు లేనివాడికి కవన్నీని-చేతినిండా పనుంటే, అదో పెద్ద బాధ కాదు-టేక్ మైలైఫ్—ప్రొద్దున్నే లేస్తాను. గోదావరిలో

రింట స్నానం చేస్తాను. స్వయంగా పాలు పితుకుతాను-తరవాత మొక్కలు, తోటా చూసుకుంటాను. అన్నం వొండుతాను - మధ్యాహ్నం పత్రికా పఠనం, చదరంగం, పాఠాలు చెప్పడం-సాయంత్రం, తేలికైన తేయాకు డ్రింక్ - ఇండియన్ టీ - దెన్ బోట్ షైర్-రోయింగ్ ఎ గ్రేట్ ఎక్సర్‌సైజ్-నైట్‌ని, చెట్టుకింద వో పాతికమంది పోగవుతారు-పదింటివరకూ వాళ్ళకి చదువు నేర్పడం-కానీ ఖర్చులేదు, రాజాలాంటి జీవితం-ఎవరిదగ్గరా దమ్మిడి పుచ్చుకోను, శిష్యబృందం వొకడు చింతపండు, మరొకడు మిరప కాయలు యిస్తారు, ఇంటిదగ్గర నుంచి బియ్యం వొస్తాయి. ఆ ఆవు చూడండి, శిష్యు లిచ్చిందే-అసలు వాళ్ళే వొండిపెడతా మంటారు. బట్ ఫర్ మి ఎందుకు? ఐదేళ్ళలో యిది పెద్ద యూనివర్సిటీ అవు తుంది. అప్పుడు మన దర్శనార్థం, మాళవ్యాజీ, గాంధీ చక్కా వొస్తారు. జీవిత రహస్యం అదే—ఏదీ కోరకుండా ఏదో పని చేసుకు పోండి—ప్రపంచం మీ కాళ్ళముందు వాలుతుంది, ఏమన్నా అడిగారా. చెట్టెక్కుతుంది—ప్రపంచం, వరల్డ్."

వంటలయ్యాయి, భోజనాలుచేశారు. కాసేపు పడుకునిలేచారు. సాయంత్రం టీ తాగి, పడవ షికారు బైలుదేరారు. దూరంగా నదిలో సూర్యుడు కోయలకి కావలా వేస్తున్నాడు. గొఱ్ఱెలమందలా మేఘాలన్నీ, మంచినీళ్ళకోసం అన్నట్లు, నీట్రి అంచుమీద గుమి కూడాయి, నీటి ప్రవాహం అలసిపోయి, ఆకాశాన్ని పైనకప్పుకుని నిశ్చలంగా నిద్రిస్తోంది. తెల్లుగడ్డి వయ్యారంగా వింజామరేస్తోంది. పక్షులు భయంతో గానం చేస్తున్నాయి. ప్రేమని అన్వేషి స్తున్న కెరటాలు చీరమడతలు విప్పుకుని, పడవని స్పృశిస్తున్నాయి. నది నిద్రనుంచి లేచి, ఆవులించి పడవకి దోవ చేస్తోంది.

"జగ్గూ!"

"మిమ్మల్ని మీరు పరిజేసుకోండి-"

"పోనీ నాథ్-"

"ఇందాకటిదే బాగుంది-నాథ్ ఫర్ వాట్? జగత్ మదీయ శరీరం-నాథ్ మదీయ ఆత్మ—"

"ఆల్‌రైట్ - జగన్నాథా"

"దట్ ఈజ్ బెటర్. ప్రొసీడ్."

"ఐతే మీ అమృతం కూతురెట్లా వుంటుంది?" అని నిధి నీళ్ళల్లో చెయ్యిపెట్టి కెలుకుతూ అడిగాడు.

"నాకు తెలిసినంతవరకూ, ద్వంద్వాలమీద నడుస్తోంది, విపులీకరిస్తాను: రెండు కాళ్ళు, రెండు చేతులు, రెండు కళ్లు, నాసికారంధ్రద్వయా - 'యా' తరవాత అరసున్నుందో లేదో శర్మగారికి రాసి కనుక్కోవాలి,-ఏస్ అథారిటీ ఆన్ అరసున్న."

"అది కాదోయ్-ఎవరి పోలికని?"

"అందంగావుంటే అమ్మపోలిక, మొద్దయితే నాన్న పోలికా-"

"నీ పుద్దేశంలో-"

"కోతి జాతికీ, మనిషి జాతికీ మధ్య మరోజాతి వుండేదిట. ఆ జాతి తాలూకు, ప్రాచీన అస్థిపంజరాల సమీకరణ శాస్త్రజ్ఞులకు లభ్యంకాలేదు. ఆమధ్య జాతిద అనొచ్చు-"

'అసందర్భంగా మాట్లాడావంటే, పడవ ముంచుతాను" అంటూ నిధి పడవని కదల్చడం మొదలెట్టాడు.

"ఏమండోయ్-కన్నీరై, అగాధుడై, అపరిచితుడై, అగౌరవుండనై

Unwept, unsung, unknown, unhonoured,
One, two, three
Timeless waters of Godavary,
Swallowed Jagnnath's mystery,
And flowed into the sea of Eternity.
But కాని, who is the boatman? నావికుండెవడు?—
The wealth of kindness,
Dayanidhi
He, the botman, made a childish mess,
Of loving humanity,
With kindness killed,
With burning passion, chilled, —

అయ్యో, మనం కేవలం వూరికే వుండటం వొక్క ఆంధ్రదేశానికి, వొక్క భారతభూమికి కాక, జగత్తంతకీ నష్టం అనవొచ్చు.

మనవహ్యాలు, వొక్క తెనుగు, అంగ్లంలోకాక, నార్వీజియన్ భాషలో కూడా తర్జుమా కాబడే దినం దగ్గరలో రానున్నది. అన్ని హక్కులూ దయానిధివి, వలయుహారు, కేర్ ఆఫ్ కోమలి, నాగుమణి గ్రంథమాల, తప్పొప్పుల పట్టిక, సుశీల టిప్పము, నారయ్య ఆఖరి కూర్పు, వెయ్యి ప్రతులు, వెల—'తెలుసుకోలేరు'—"

తరవాత జగన్నాథం సంగీతం మొదలెట్టాడు. ఇసిక తిన్నె మీదికి చేరుకున్నారు.

"నీ జాబితాలో అమృతం పేరు వొదిలేశావేం?"

"మీకు కోపం వొచ్చినట్లుంది, తమాషా కన్నాను."

"నాకేమీ కోపం లేదు, ఐతే నేనొక టఇగుతాను చెప్పు."

"సెలవియ్యండి—"

"నువ్విల్లా, చిత్రంగా మాట్లాడతా వెందుకు? స్వభావమా, తెచ్చి పెట్టుకున్నదా?"

"తెచ్చి పెట్టుకొనేది ఏదీ లేదు."

"ఎప్పుడేనా నువ్వు నువ్వుగా వుంటావా?"

"నేను నేనుగా వుండే అవసరం, పుస్తకాల్లో మనుషులకి తప్ప మామూలు లైఫ్‌లో మనుషులకి రాదు. వొస్తే వాళ్ళు చస్తారు."

"ఇప్పుడు మాట్లాడుతున్నట్లుగా, ఎప్పుడూ ఎందుకు మాట్లాడవు?"

"ఇట్లా మాట్లాడితే, ఎవ్వరూ లైక్ చెయ్యరు—"

"నీ సంభాషణంతా వొక నటనన్నమాట"

"అసలు జీవితమే నాటకరంగం; మనం అందరం పాత్రలం; సంభాషణ నటనెందుకు కాకూడదు? నటుడు నటించడం మానేసి, తన నిజస్వరూపం ప్రదర్శించి గొడవలు మొదలెడితే, ప్రేక్షకులు ఏం చేస్తారని మీవూహ? అందుకనే భర్తృహరి ఏమన్నాడంటే—! భర్తృహరి గాడి స్పెల్లింగ్ రాదండి—"

"ఇక్, మళ్ళా మొదటికొస్తున్నావు—"

"ఆయన హృదయ ద్వారంబుల్ మూసి, చిల్లు పడ్డ డోలు

వలె.—ఆర్ టు వేరీ ది మెటఫర్,-తల్లి పాలు తాగిన పాపవలె—పూరకుండును-"

"కేర్ ఆఫ్ కోమలి అన్నావుకదా, నీ వుద్దేశం?"

"..........."

"చెప్పు, నిన్నే—అబ్బో, కోపం కాబోలు!"

మళ్ళా యిద్దరూ పడ వెక్కి, వొడ్డుకు తోసుకొస్తున్నారు.

ఆ రాత్రి, భోజనంచేసి, చెట్టుకింద మంచాలు వేసుగున్నారు. దయానిధి అప్పుడన్నాడు.

"కోమలి నాతో వుంది—తెలుసా? అందుకనే కేర్ ఆఫ్ కోమలి అన్నావనుకున్నాను."

"నా జీవిత రహస్యాన్ని ఛేదించే వరకూ మీరు నిద్రపోరను కుంటాను. కోమలి పేరెత్తారంటే, నేను నిష్కారణంగా పాయిట్రీలో దిగిపోతాను.

Where art thou roaming
  O, Komali;
In the wasteful valley
  Of poisoned honey?
In the arms of strong stupidity?

వండ్రఫుల్ గరల్ భావకవిత్వం మీద వ్యాసాలు దంచేస్తున్నారీ మధ్య, ఆంధ్రకవిపుంగవులు, కోమలి ఫోటోగ్రాఫ్ కింద వీళ్ళంతా సంతకాలు పెడితే సరిపోను."

"నిన్ను చూడాలి, తీసుకురమ్మంది. నువ్వు నీళ్ళల్లోకి గెంటావుట—రానీ తగిన శాస్తి చేస్తానంటోంది."

"చప్పునే ఆంధ్రరాష్ట్రం వొస్తుందని బెంగ కాబోలు—"

"అంటే?"

"ఏదో అన్నాను పోనిస్తురూ, చంపక—"

ఇంతలో వో పదిమంది చదువుకోడానికొచ్చారు, వాళ్ళతో కలిసి జగన్నాథం యింట్లో కెళ్ళిపోయాడు, తెల్లారింది, బండి వచ్చింది, నిధి ప్రయాణం కట్టాడు,

"నువ్వు తప్పకుండా రావాలి సుమా!"

"తప్పకుండా వొస్తాను—కోమలి కవి నా మాటలుగా చెప్పండి -

ఏపూఁర నున్నయున్, నీసల్లటి తలంపే, గాఢ్పుని వరగండ్లు చేయవా

పదీ హారొన్నాసిష్టా, ఖిలహారిలో, నాలుగున్నర,-

ఏ మందలో చేరినా,

ఏకాకివై, అలికి ముగ్గెట్టంగ

నోసుకోని, నీ బ్రతుకు తెరువు,

సూసుకో, వొయ్యారమైన,—

అన్నై యీపూట రావడం లేదండి—ది రీజన్ యీజ్, రహస్యంగా మొదలెట్టి పాటలోకి దిగాను—ఎనివే,-దీపావళి కొస్తాను —మా అమృతాన్ని చాలా, చాలా అస్కానని చెప్పండి-" బండి దూరంగా వెళ్ళిపోయింది.

దయానిధి అమృతంగారి వూరు చేరుకునేటప్పటికి సాయంత్రం ఐదుగంట లైంది. సామానులు స్టేషన్‌లో పెట్టేసి, వొక్కడూ, వూళ్ళోకి నాలుగు మైళ్లు బండిమీద ప్రయాణం చేశాడు. బండి వొం తెన దగ్గర నిలిచింది. బండివాడు అమృతంగా రింటి గుర్తులు చెప్పి వెళ్ళిపోయాడు. దయానిధి చీకటివడే వరకూ వూళ్ళోకి వెళ్ళదలు చుకోలేదు. దూరంగా కుడివైపున పొలా లు కనిపిస్తున్నాయి. పొలా న్నించి అందరూ యిళ్ళకొచ్చే సమయం అది. అమృతం భర్త కాంతారావు ఎదురవుతాడేమో ననిపించి, నిధి ఎడం వైపు చెఱువు కేసి నడవడం సాగించాడు.

జగన్నాథం నవ్వినప్పుడూ, తల తిప్పుతూ చెప్పినప్పుడూ, అత నిలో ఎక్కడో అమృతం ఛాయలు కనిపించినట్లు, నిధికి గుర్తొచ్చింది. ఎవ్వరూ చూడకుండా, అత నొక్కడూ, అమృతం కూతుర్ని 'రహ స్యంగా' చూసి వెళ్ళాలని సంకల్పం. అందరికి తెలిసేటట్లుగానే వెళ్ళి, బహిరంగంగా ఎందుకు చూడగూడదూ అని ప్రశ్నించుకుంటే సమా ధానం లేదు. అందులో వొక నిగూఢమైన, రహస్యమైన ఆనందం వున్నట్లుంది. అది ఎవ్వరితోటి చెప్పుకోడానికి వీల్లేనిది. ఇతన్ని చూసి అమృతం సిగ్గుతో తలొంచుకుంటుంది. పిచ్చి సంతోషంతో పారిపో

తుంది. "ఎందు కొచ్చావు బావా? నువ్వు శాశ్వతంగా నాదగ్గరే వుంటావు. నిన్ను వలచుకున్న ఫలితం బావా, యీపిల్ల" అని, పొట్టలోకేసి చూపి, అంటుంది కాబోలు. ప్రపంచానికి అర్థంకాని ఆనందంతో అమృతం మూగదై బాధపడుతుంది. ఆ అమృతం బాధని ఏకాంతంగా చూడాలి. ఆపిల్ల ఏడుపులో, అనాదినుంచీ మానవుడు రహస్యంగా పడిన తపన వినబడుతుంది. పుణ్యాలూ, పాపంకూడా అమరత పొందుతుంది కాబోలు. "నే నెవర్ని?" అని ఆ పసిది వేసే ప్రశ్నకి ఏ వేదాంతి సమాధానం చెప్పగలడు? "ఆత్మ", "పరమాత్మ" "శక్తి రూపం" "సృష్టి రహస్యం" "జీవాత్మ"-అంటారా! లేక—"అంధత్వం", "చీకటి" "అజ్ఞానం, పశుత్వం"-పోనీ, సాధారణ భాషలో "గోడ దూకడం," "తలుపుసందు" "ముసుగు" "మోసం" "మంచంకింద"—అంటారా! "కారాగారం" "కోర్టు తీర్పు", "హత్య", "ద్వీపాంతరవాసం" అంటారా! జన్మాంతర వాసం కాబోలు! తలుచుకుంటే కవిత్వం వొస్తుంది.

"గుళ్ళను, గోపురాలను, గులకరాళ్ళను-
ప్రేమ ప్రవాహం కరిగించిందీ-
రక్తమై గట్టునచేరిందీ-
రాత్రంతా అడవిలో ధ్వనించింది.
ఉదయాన వూపిరికోసం, పసిదై ఏడ్చింది.
ఇదే అనుభవాన్ని ఆధునిక కవి ఏవిధంగా చెప్పగలడో!
కాళిదాసుకేం తెలుసు కావమ్మ సొగసు!
స్విచ్ నొక్కు, సెకండ్ షోకి పోదాం.
ఆమె 'జూలియట్'
అతను "మజ్ను"
ఫైనల్లీ, "ఫోలియస్, జెర్ జకి"—
టాక్సీలో సన్నటి నడుం 'కోజప్'
భవభూతికేం తెలుసు ఆ షోల్డర్ బ్లేడ్ సొంపు!
జుట్టంతా రేగింది, గ్రామ్‌ఫోన్ పెట్టు వాటన్స్.
రాత్రి టోపీ వోవర్లీన్ బిగుతైంది.
క్లియోపాత్రా లిప్‌స్టిక్‌కి బదులు,

ఎంకి చొంగతో తృప్తిపడదాం!
శకుంతల 'కాసియో' కిచ్చిన కర్చీఫ్
బెరి బెరి బెర్నార్డ్ షాకి తెలీదు; బుచ్చమ్మ విడోడ్ బ్రెస్ట్‌లో
భర్తృహరికీ తెలీదు మా గాంధీ అన్నాడంటే.
పొలిటికల్ స్టంట్—పొమ్మన్నారు."

ఈ భావాలు వూహాలో తిప్పుకుంటూ సధి చెఱువుగట్టున కూర్చున్నాడు. అలలు మెల్లిగా గట్టుమీద వూపిరి తీసుకుంటున్నాయి. మట్టిలో వేడిగాలి, పైకి వెళ్ళలేక భూమినే ఆవరించుకుంది. పొడుస్తున్న చుక్కల ప్రతిబింబాలు, చెఱువులో పడ్డాయి. ఎడ్లు నీళ్లు తాగడాని కొచ్చి, తామరాకుల్ని కెలికేశాయి. వాడు కాంతారావుగారి పాలేరాడు కాడుగదా! ఐనా తన కెందు కంత భయం? అమృతం వుందిగా, చమత్కారంగా ఏదో సద్ది చెప్పకపోతుందా? అంచేత వీధి గుమ్మాన బహిరంగంగా వెళ్ళకం మంచిది. తను చాలా గొప్పవాడ, ధనికుడు,—అతన్ని ఎవ రేమన గలరు? డబ్బుంటే ఫరవా లేదు. ఎన్నింటినేనా కప్పేస్తుందన్న వేమన పద్యం జ్ఞాపకం రావడం లేదు. ఆకాశం నిర్మలంగా వుంది; చంద్రుడుకూడా లేడు. నక్షత్రాలు ప్రశాంతంగా మెరుస్తున్నాయి, మేఘాలన్నీ పడమటి ఆకాశంలో—స్నానానికిదిగి, మునిగి పోయినట్లు మాయమయ్యాయి. ఎక్కడో వోపక్షి, నేనూ వున్నా నంటూ' అరుస్తోంది. పిల్లలు, కర్రకి మేకు దిగేసి, యినప చక్రాలని దొర్లించుకుంటూ పోతున్నారు. జనం పల్చబడ్డారు. సందడి తగ్గింది. అతనికి ఆకలేస్తోంది. వొంతెన దగ్గర కిళ్లీ దుకాణం దగ్గర కొచ్చి, రెండరిటి పళ్లు తిని, సోడా తాగాడు. ఎనిమిది దాటుతోంది. అమృతంగారింటి సందులోకి చేరుకున్నాడు.

"అబ్బి, కాంతారావుగారి యిల్లు, ఏదీ-" అని అడిగాడు, గడ్డిమోపు తీసుకెడుతున్న అసామిని. "అమృతంగారిల్లు-?" అసామీ కాసేపు నిదానించి "అద్దు గదిగో,—ఆ మూలగా వున్న మేడేనండి.. కామందు కాంతయ్యగారిల్లేనండి-" అని ఆ వ్యక్తి వెళ్ళిపొయ్యాడు. అది విశాలమైన సందు; అన్నీ మట్టిగోడల యిళ్లు; పాకలు; దూరంగా ఖాళీలాంతరుస్తంభం వొరిగి వుంది. కాని వెలగడంలేదు; అక్కడంతా స్థలమే-ఎదురుగా, పసుపుపచ్చ మేడ వుంది.-అదీ అమృతంగారి మేడ.

దయానిధికి వీధిగుమ్మంలోంచి బహిరంగంగా వెళ్లే ధైర్యం లేకపోయింది. ఇంటిముందునించి నడిచి వీధిచివరికి చేరుకున్నాడు. ఆ వీధిలోంచి అమృతం చెరువునుంచి నీళ్ళబిందె తీసుకుని ఎన్నిసార్లు నడిచిందో! వెనకాలసందులో కెళ్ళేటందుకు మరో దోవలేదు. ఇంటి చుట్టూ పచ్చగోడ కావలాకాసింది. గోడమీద గాజుపెంకులు గుచ్చి వున్నాయి.-పాపం, ఏ నల్లటి రాకుమారుడో అర్ధరాత్రి గోడదూకి దొడ్లో వయ్యారాల వూగుతున్న అమృతాన్ని ఎత్తుకుపోకుండా కాబోలు? గోడచుట్టి దొడ్డివైపుకి వెళ్ళాడు. తలుపుంది. తలుపు సందులోంచి లోపల దొడ్డంతా కనిపిస్తోంది. పెద్ద పెద్ద చెట్లు, మొక్కలు, వసారాకి మెట్లు, కాగు, గంగాళం నూతిపళ్ళెం, బాదం చెట్టు-పెద్ద తలుపు సందే!

మనుషుల అలికిడిమాత్రం లేదు. 'కీ' యివ్వటం మరిచిపోయాడు కాబోలు రిస్ట్‌వాచీ సాయంత్రం నాలుగింటికి నిలిచిపోయింది. లోపల భోజనాలు చేస్తుంటారు కాబోలు. కాంతారావు పొలాన్నుంచి వొచ్చాడా? అమృతం గుళ్లోకి వెళ్ళిందేమో! అంతగా అతన్ని చూసి "యిదేమిటి?" అని అడిగితే, "యిదే వీధిగుమ్మం అనుకున్నాను" అంటాడు.

ఎవరో: "సామాన్లేవి?"

అతను: రైల్లో వొదిలేశాను."

ఎవరో: "ఇప్పుడేం రైలుంది?

అతను: "అందుకే....అందుకే..."

(నవ్వి) అమృతం: "బావ మధ్యాహ్నం రైల్లో వొచ్చాయి అత్తయ్యా. బావకి తిన్నగా యింటికొచ్చే అలవాట్లేదు. దోవలో ఆగుతూ, వింతలు చూస్తూ నడిచి వొచ్చివుంటాడు - కాదు బావా?"

ఎవరో: ఈ వూళ్ళో ఏం వింతలుంటాయే? నీది మరీ సోద్యం!

అమృతం: మీకు తెలీదత్తయ్యా— బావకి ప్రతిదీ వింతగా తోస్తుంది— తొట్టిలో మన పాపాయిలాగ, కాదు?

అంటూ పాపాయి బుగ్గగిల్లుతుంది.

అప్రయత్నంగా అతనిచెయ్యి తలుపుమీద ఆనింది—తలుపు కిర్రుమని జరిగింది, తీసే వుందన్నమాట! గబుక్కున చెయ్యి తీసేసి

తలుపుని దగ్గరగా మూశాడు. అమృతం దొడ్లోకి రాకుండా వుంటుందా? వొచ్చినా, దూరాన్నుంచి అతను గుర్తుపట్టగలడా? ఆత్తగార్ని అ ప్ఫుం పిలిస్తే, యింకేమన్నా వుందీ? దొడ్డి చాలా పెద్దది. కుడివైపున గడ్డివామి కనబడుతోంది - దూడ మెసల్తోంది; పేడకంపు ఏ అర్ధరాత్రో అమృతానికి నిద్రపట్టక వసారాలో కొచ్చి బాదం చెట్టుకింద కూర్చుని నక్షత్రాల కేసి చూస్తూ వుంటుంది. అతన్ని చూస్తుంది.

అమృతం: ఎవరది?

అతను: నేను.

అమృతం: బావా, నువ్వా!— (ఏడుస్తుంది)

అతను: ఎందుకు ఏడ్పు?

అమృతం: బావా, — నీకు తెలుసు. ఘోరం జరిగింది. నీ దగ్గర వుండే సాహసం లేదు; నిన్ను వొదిలివుండే గుండె కాదు. నేను బ్రతకను బావా—

అతను: నన్ను మరచిపో అమృతం. అది చెప్పడానికే వొచ్చాను.

అమృతం: నీలా సులభంగా మరచిపోలేను బావా. మరిచి పోయినవాడు, యీ అమృతం విషంకాదూ! నిన్ను మరిచి స్త్రీత్వాన్ని గోల్పోతానా?—(కొంగు నెత్తిన కప్పుకుని. మల్లెపూలు వూడదీసి పారేసి అతని బుజాలని కన్నీటితో తడిపేస్తుంది).

అతను: ఎక్కడికి అమృతం?

అమృతం: నిశీథిలోకి—

అతను: నేను రానక్కరలేదా?

అమృతం: జ్ఞాపకాలులేని యీ మనుషులతో నాకు నిమిత్తం లేదు. ఎక్కడో గుండె రాయి చేసుకుని, సముద్రంలో కెరటాలమధ్య శిలగా మారతాను... బావా.

అతను: మరి నీపాపాయి? ప్రపంచానిది. ఆ పాప జ్ఞాపకాలే నా సంతతి—

అల్లా మాట్లాడుతుంది శాబోలు అమృతం. ఊహించుకుంటే అతనికినవ్వొచ్చింది, భయమేసింది. స్త్రీలు ఎంత సాహసమేనా చేస్తా

రంటారు, పెద్దలు, స్త్రీలు ప్రేమలేకుండానే. పిల్లల్ని కనగలరు; మహాయిల్లాలులూ కాగలరు, ఖ్యాతి గడించగలరు. చరిత్రలో అమరత గడించగలరు, వారేకనక నిజంగా ప్రేమించగలిగితే, యింకేమన్నా వుందా? సంఘం తారుమారవుతుంది.

ప్రపంచం తలక్రిందు లవుతుంది. ఆకాశం నెత్తిమీద పడటం లాంటిది, దాన్ని భరించి మోసే పురుషుడు యీ జగత్తులో వున్నాడా! భారత స్త్రీ ప్రేమించక పోవడం— నిజంగా మంచిదే. చరిత్రలో యుద్ధాలనా తగ్గుతాయి. గాంధీగారు నిశ్చింతగా నిద్ర పోవొచ్చు.

ఎంత కాలం అతను అల్లా నుంచోడ! ఎంతో సిగ్గుగానూ, చిన్న తనంగానూ వుంది. తన కెందుకు, చూడాలన్న కుతూహలం? అమ్మ కాని! లేని చింత తన కెందుకు? అదుగో, ఎవరో వసారాలో కొచ్చి నట్టున్నారు, అదుగో ఆమెయే అమృతం తలుపు తెరిచి లోపలి కొచ్చాడు. చేతులో వున్న పెట్టి దూరంగా గోడవారగా పెట్టి, చెకిళ్ళు తిరిగి చూసి,—"ఎవరు?" అంటూ మెట్లు దిగి—

"బావా, దా, దా,—"

"ఉస్" అన్నాడతను, చూపుడువేలు నోటిమీద వుంచుకుని "బిగ్గరగా మాట్లాడకు—నే వొచ్చినట్లు యెవరికి..."

ఇంకా అతని వాక్యం పూర్తి కాకుండానే అమృతం, సంతోషంతో నవ్వుతూ, "బలే బావవే యింట్లోకి రా, యిదేం చిత్రం - అత్తయ్యా బావ వొచ్చాడు" అని ఇంటివైపుకి తిరిగి బిగ్గరగా కేకేసింది.

"బండి పొద్దుపోయింది కాబోలు లోపలికి రా బావా" అంటూ దొడ్డి తలుపులు మూసి, గడి యెట్టింది,

ఇంతలో అత్తగారు వసారాలో కొచ్చింది,

"ఎవరది? దీప మేజా పెట్టారు కారేమర్రా" అన్నది,

"మా నిధి బావండత్తయ్యా — రైలు ఆలస్యమైంది, పాపం వీథిగుమ్మం తెల్సింది కాదు. రా బావా, మా అమ్మాయిని చూద్దువు గాని—"

ముగ్గురు లోపలి కెళ్ళారు.

"కాంతారావుగా రేరి?" అన్నాడు నిధి.

"నరసయ్య మేష్టారింటికి పేకాట కెళ్ళారు. చూశావా మా ఇల్లు, నీకేం, నువ్వు జమీందారయ్యావు, మేం కనిపిస్తామా – నీ బంగాళా బాగుంటుందంటగా, నన్ను తీసుకెళ్ళి చూపించకూడదా ఏమిటి?" అంటోంది అమృతం.

స్నఫ్ కలర్ చీర చిందరవందరగా కట్టుకుంది. చీర బిగించిన ముడికీ, చుక్కల జాకెట్టుకీమధ్య కడుపుమడత దీపం వెలుగులో కనబడుతోంది.

అమృతం ఎదిగింది; పెద్ద ఆరిందాలాగుంది. జడంతా వూడి చుట్టలు చుట్టలుగా మెడమీదనుంచి జారింది; మధ్య మధ్య, దుద్దుల రాళ్లు తళుక్కున మెరుస్తున్నాయి.

"నా బంగాళాని నీకెవరు వర్ణించారు?

"ఓయబ్బ మేం ఎంత పల్లెటూళ్ళోవున్నా, మాకన్నీ ఆమాత్రం తెలియవా ఏమిటి? చూశారా, అత్తయ్యా, నేను చెప్తుండేదాన్నే ఆ బావ. చెలుగ్గడలచే మహాయిష్టం."

"అల్లాగా మావాడు సిద్గరకొస్తానంటూ ప్రయాణం కడుతుంటాడు. మంచివాడవు గనక, అపేక్షదేవాడవు గనక పాపం, జ్ఞాపకం వుంచుకొని నువ్వే వొచ్చావు. అల్లా వుండాల నాయనా చుట్టరికాలంటే" అంటూ ఆవిడ దీపంబుడ్డితో ఏదో సవరిస్తూంది.

"నా మనవరాల్ని చూద్దువుగాని ఉట్టారా –"

"ఇల్లారా బావా" అంది అమృతం.

ముగ్గురూ పక్కగదిలోకి నడిచారు. అమృతం దీపంవొత్తి పెద్దది చేసి, తొట్టిలోకి చూపించింది. అందులో చిన్నపిల్ల, అమాయకంగా కళ్లు మూసుగుని పడుకుంది, పిల్ల నల్లగావుంది. మొహాన అకలుముక్క వుంది; వొంకులు తిరిగిన లేత జుట్టు నుదుటిని కప్పేసింది. ఎవరిపోలికో అతనికి తెలీడంలేదు. అత్తగారూ, తనే స్వయంగా కన్నట్లు, గర్వంగా చూసి, పిల్లబుగ్గని తాకి—

"ఒసే, గడుగ్గాయి పిల్లకాయా బాబయ్యొచ్చాడే, వజ్రం దొరికిందే ఆ జమీందారు బాబయ్య నిన్ను చూడాల నొచ్చాడు — బాబయ్యకి వజ్రం దొరికింది. మాకు నువ్వు దొరికావు—"

ఆవిడెల్లా కనుక్కుందో!

"అత్తయ్యా, అచ్చంగా బావ పోలిక కాదూ?"

అతని గుండెలు, దడదడ కొట్టుకుంటున్నాయి. ఇదేమిటి, యిల్లా నిర్భయంగా అనేస్తుంది? అతన్ని కదిపివేసిన మహత్తర అనుభవం-తనకి జరిగనట్లుగానే, ప్రవర్తిస్తుంది అమృతం. వొంకాయల బేరం తెగింపుకాక, కూరల మనిషిని పొమ్మన్నట్లు - అంత చులకన!

"చూడండి దాని కళ్ళు, నోరు అంతా బావ పోలికే" - అన్నది అమృతం అతని కళ్ళల్లోకి వయ్యారంగా చూస్తూ.

"పెద్దయితేగాని పోలికలు బైటపడవు. బాజయ్యగారి పోలికలు రాకుండా పోతాయా మరి", అన్నది అమృతం అత్తగారు.

"ఏవేళైందో భోజనంచేసి వొడ్డించు", అంటూ అత్తగారు, వంటింట్లోకి నడిచింది.

"ఎలా వుంది బావా, నీ కూతురు?" అన్నది అమృతం.

"నిజంగా నా కూతురే?" అని అడగాలిని పించింది తనకి ధైర్యం తెచ్చుగుని. గొంతు సవరించుకున్నాడు. "ఐతే, అమృతం.... నన్నో అనుమానం బాధిస్తోంది-" అని మాటలు వెదుక్కుంటున్నాడు.

"నేనూ, వారూ మీరూ రెందుకు రాలేకనేనా? సరే. మంచివాడివే శే, - మమ్మల్ని రమ్మన్నావా ఏమిటి?" అని లోపలి కెళ్ళి, చెంబుతో నీళ్ళు, తువ్వాలు, సబ్బు పెట్టె తీసుకొచ్చింది.

ఇంతలో కాంతారా వొచ్చాడు. అందరూ భోజనానికి కూర్చున్నారు.

అమృతం స్నానంచేసి పల్చటి తెల్లచీర, తెల్ల జాకెట్టు, తల్లో పూలు-సింగారించుకొని వడ్డన కొచ్చింది. 'బావకి' ఏవేవి యిష్టమో కనుక్కుంటూ జాగ్రత్తగా వొడ్డిస్తోంది.

"అన్నగారు రావడంవల్ల మాకు పండివంటలూ, పెరుగూ తగిలాయి" అన్నాడు కాంతారావు నవ్వుతూ.

"మీది మరీ సోద్యం. ఎప్పుడూ పెరుగు మోహం ఎరగనట్లు చెబుతున్నారు. బావ నిజం అనుకుంటాడు కూడాను", అన్నది అమృతం.

అందరూ నవ్వుకున్నారు. ఇంతలో పిల్ల యేడ్చింది. అమృతం లోపలి కెళ్ళింది. భోజనాలయ్యాయి.

అమృతం తమలపాకులు చిలకలు కట్టి, వక్కలు యాలకులు వొక డబ్బీలో వేసి తీసుకొచ్చింది. విధికి వీధి అరుగుమీద పక్క వేశారు, జగన్నాథం కబుర్లు. అనంతాచార్లుగారి కబుర్లు కాసేపు చెప్పుకున్నారు.

ఇంతలో అమృతం కూడా భోజనం చేసి వొచ్చింది. కాంతా రావు చుట్ట ముట్టించి, నీళ్ళు తీసుకొని, అవతలి కెళ్ళాడు.

''అబ్బ చుట్టకంపు, చస్తాం'' అంది అమృతం పెద్ద యిదిగా. ఇందిర పోయినందుకు విచారం ప్రకటించింది. కాసేపు మౌనంలో వున్నారు, యిద్దరూను.

''ఐతే బావా; కోమలి నీ దగ్గరే వుంటోందిటగా.''

'అవును, నీ కెవరు చెప్పారు?'

''అమృతం తెలీకుండా వుంటుందా, నువ్వు మమ్మల్ని మరచి పోతావేమోగాని—''

''మీ ఆయనకి కూడా తెలుసా?" అన్నాడు.

''తెలీదనుకుంటాను నాతో ఆ విషయం యెప్పుడూ అన్లేదు"

"కోమల్ని పెండ్లి చేసుకుంటావా?''

"నీ సలహా యేమిటి?'' అని అడిగాడు,

''నాకేం తెలుస్తుంది?''

"అసలు నీ కా సందేహం యెందుకు కలిగింది?''

"చిన్నప్పటి స్నేహం-నీ దగ్గరే వుంటోందంటే,-చేసుకుంటా వేమో అనుకున్నాను'' అంది అమృతం, కళ్లు కిందికి దించేసి,

"చేసుకోమంటావా?''

''ఏమో-''

''చేసుకోదగ్గ మనిషేనంటావా?''

"మనుషులు ఎప్పుడూ వొకేలా గుంటారా, ఇప్పు డేమన్నా కుదురుగా వుందేమో."

అతనికి నవ్వొచ్చింది. అమృతం ఆ మాట అనడం, అత్తగారి రాకవల్ల వారి సంభాషణ నిలిచిపోయింది. అమృతం అత్తగారు ఇందిర పుట్టింటి వారి పుట్టుపూర్వోత్తరాలు స్మరించడం మొదలెట్టి- "ఇంతకి చెల్లెలుందిటగా, పెళ్ళికి కొచ్చిన పిల్లట-నువ్వు చేసుకో కూడదు నాయనా'' అన్నది ఆవిడ. "ఇంతకీ ఎవళ్ళెవళ్ళకి రాసుందో" అనుకుంటూ, 'నిద్రొస్తోంది' అని లేచి లోపలి కెళ్ళింది.

''నేను కూడా ఏమన్నా మారానా బావా!'' అంది అమృతం.

"ఏమో నాకేం తెలుస్తుంది-"

"పోదూ, నీదంతా చిత్రం. చెప్పకూడదా యేమిటి? కొంచం లావయ్యాను గదూ" అంటూ తన వొంటికేసి చూసుగుంది.

"మంచినీళ్ళకి మెట్లమీది కూజాకోసం వొంగినప్పుడు జాకెట్టోంచి రొమ్ములు బరువుగా కదలడం కనిపించింది.

"నువ్వనేది శరీరం మార్పా?" అన్నాడు నిధి పెదవి చప్పరిస్తూ.

"ఇంకేరకం మార్పుంటుం దేమిటి? అబ్బో-నువ్వు బలే యిదైనవాడివే నీకు కావాలి ఆ మార్పు లన్నీ."

"అంత కంగారు పడితా వెందుకు అమృతం? ఇంతకీ, నిన్నడగవల్సిన ప్రశ్న మర్చిపోయాను, అసలు నే నందుకే యిక్కడి కొచ్చాను."

"బావా, అడుగు కాని, నువ్వు యేదో కొంపంతా మునిగేటట్లు పెద్ద ప్రమాదంగా మాట్లాడతావు. ఏమిటి బాబూ, ఆ సందేహం?"

"ఐతే మీ అమ్మాయి...."

అతనికి వాక్యం పూర్తిచేసే అవకాశం లేకపోయింది. కాంతా వొచ్చాడు. కాసేపు వజ్రాల కబుర్లు చెప్పుగున్నారు.

"నాకు నిద్రొస్తోంది" అని అమృతం వయ్యారంగా ఆవులించింది.

"నీకు నిద్రొస్తే నువ్వెళ్ళి పడుకో" అన్నాడు కాంతారావు.

"బాపకి నిద్రొస్తూంది—అదిగో కళ్ళు మూసుకు పోతుంటేనే"—అన్నది అమృతం.

పావుగంటలో కాంతారావు, అమృతం లోపలికి వెళ్ళారు. తలుపు గడియ పడింది. దయానిధి పక్క సర్దుకొని పరున్నాడు.

"ఇంకా యేమన్నా కావాలా, బావా?" అంటూ అమృతం గడియ తీసి బైట కొచ్చింది.

"ఏమీ అక్కర్లేదు."

"కావలిస్తే లేపేం" అన్నది. గుమ్మంమీద చూస్తూ నిలబడింది అమృతం.

"చెప్పు, నీ సందేహం ఏమిటో" అని అడిగింది రహస్యంగా.

కాంతారావు యింతలో, "అబ్బ! నిద్ర పట్టడం లేదండీ, లోపల. మరో చుట్ట తగలేస్తాను" అంటూ బైటకొచ్చి, చుట్ట ముట్టించి అరుగు మీద కూర్చున్నాడు.

"నే వెళ్ళి పడుకుంటా — వొచ్చేటప్పుడు తలుపు వెయ్యండి" అని భర్తతో చెప్పి, అమృతం తలుపులు జేరవేసి లోపలి కెళ్ళింది.

నిధికి నిద్ర పట్టేసింది, మళ్ళా అరగంటలో లేచాడు. ఇంటో గడియారం పాడైంది కాబోలు, ఆరు గంటలు కొట్టింది. అమృతం వో రాత్రివేళ బైటికి వస్తుందని అతని నమ్మకం. అరగంటలు. గంటలూ గడిచిపొయ్యాయి. అతనికి నిద్ర పట్టలేదు. అప్రయత్నంగా అతని దృష్టి తలుపు మీదికి వెడుతోంది. అమృతాన్ని భర్త హస్తాలలో వూహించి బాధ పడ్డాడు. తన కెందుకో అంత బాధ! దూరంగా వున్నప్పుడు యెన్ని వూహించుకొన్నా వాటిల్లో బాధ లేదు, దగ్గరగా వున్నప్పుడే! ఆరు గజాల దూరంలో అమృతం తన బిగువైన సౌందర్యాన్ని భర్తకి వప్పగించేసింది, అతని వునికి ఆమెను యే మాత్రమూ కలవరపరిచినట్లు లేదు. స్త్రీలు చిత్రం, వారు లోన వుండే మనోవ్యథలు, అవస్థలు, తికమకలు బైటికి ప్రకటించరు. లేక ఇవన్నీ పురుషుడి ప్రత్యేకమైన జాడ్యాలా? వాళ్ళకి వ్యక్తిత్వం వున్నట్లు లేదు. శరీరాలపైన అభిమానం "యిది నాది. దీన్ని ఫలానా వారికే వప్పగిస్తాను" అన్న పట్టుదల వున్నట్లు కనుపించదు. ఎవరో

వొకరు తమది కోరి అన్వేషించటంలో నేనా వారి తృప్తి వుంట! ఏమిటో, తను యిల్లా అనుకోడానికి అధారా లేమున్నాయి? కోమలి యివన్నీ తప్పని రుజువు చెయ్యడం లేదూ! స్త్రీలకి వ్యక్తిత్వం లేకపోతే, కోమలికి మాత్రం యిల్లా వచ్చింది?"

తలుపు చప్పుడైనట్లనిపించింది. లేచి మంచం మీద కూర్చున్నాడు. ఏమీ లేదు. పక్కింట్లో తలుపులు కాబోలు! కోడి కూసింది. అతను నీరసంతో కళ్ళు మూశాడు. తెల్లారిపోయింది, జనం అటూ యిటూ తిరుగుతున్నారు. పాత్రల సందడి, పాలిమనిషి అలికిడీ, అమృతం అత్తగారు దగ్గుతో మాట్లాడడం, అమృతం యితన్ని లేపడం — అన్నీ జరిగిపోయాయి.

"ఏం బావా, నిద్ర బాగా పట్టిందా?" అని అడిగింది.

"ఆహా—"

"మొహం ఇల్లా బరువుగా వుందే?"

ఆమె మొహంలోకి చూశాడు, కళ్ళకింద నలుపు నిద్రలేని అలసటని చూపింది.

"కొత్తచోటకి వెడితే నిద్రపట్టదు కాదూ?" అంది అమృతం.

అనాడు అమృతం అలిసి మంచం మీద పడున్న దృశ్యం జ్ఞాపకానికి కొచ్చింది, అతనికి నవ్వొచ్చింది. మనుషులు అనుకునేదానికీ, అన్నదానికీ ఎక్కడా సమన్వయం వుండదు. సంభాషణంతా వొక నటన. ఊహిస్తే యిల్లా వుంటుంది.

అమృతం: నీకు నిద్రలేనట్లుంది. చోటు కొత్త. (నన్నుగురించి ఆలోచించడం మూలాన)

అతను: బాగా పట్టింది, (అసలు కళ్ళు మూయందే)

అమృతం: నాకు మొద్దు నిద్రపట్టింది. (తెల్లవార్లు నేనూ, ఆయనా సరసాలు)

అతను: ఓస్, నేను నమ్మను. (నన్ను గురించి ఆలోచిస్తూంది కాబోలు)

అమృతం: ఫో, కొం[illegible]ప్పటికి సాయిరా

అర్థంకాదు) వాళకమంది పనివాళ్ళు యింటి

అల్లా జరుగుతుంది సంభాషణ—లోపల ఒకటీ, బైట ఒకటి. నిజాలకి చోటు లేదు; సత్యానికి వ్యవధి లేదు.

మొహం కడుక్కున్నాడు; కాఫీ తీసుకొచ్చింది. స్నానం అయినతర్వాత నిధి ప్రయాణం కట్టాడు. కాంతారావు అన్నాడు.

"అన్నగారు, నేను సంతకెడుతున్నాను. నా బండిలో రండి. స్టేషన్ దగ్గర దిగబెడతాను."

"పోనీ బావా, ఓ నాలుగురోజులపాటు మా ఇంట్లో వుండకూడదా యేమిటి?—అట్లా నైతే, మేం మీ వూరు రాము—అంతే" అన్నది.

"ఈసారి వచ్చినప్పుడు తప్పకుండా వుంటాను." అన్నాడు.

"మళ్లా మళ్లా మావూరు వస్తావా యేమిటి?—ఏదో పొరపాటుని వచ్చావు కాని."

"పోనీ నువ్వూ, మీ ఆయనా నాతో రాగూడదూ?" అన్నాడు నిధి.

"ఆకుమళ్ళ హడావుడి తగ్గుతుంది నెలరోజుల్లో—అప్పుడొస్తాంలెండి" అన్నాడు కాంతారావు.

"పగలు చూద్దువుగాని అమ్మాయిని, రా" అంది అమృతం. కాంతారావు, నిధి గదిలోకి వెళ్ళారు.

"బావ పోలికంటుంటే కాదంటున్నాడండోయ్," అన్నది అమృతం.

కాంతారావు సరసంగా నవ్వాడు. నిధి పిల్లకేసి పరీక్షగా చూశాడుగాని, ఎవరి పోలికో నిర్ణయించలేకపొయ్యాడు. అమృతం పోలిక తెలుస్తూనే వుంది. మిగతా సగం తనా, కాంతారావా? ఐదారేళ్లు పోతేనేగాని బైటపడదు.

ఎడ్లబండి సిద్ధమైంది. కాంతారావు, దయానిధి అందులో కూర్చున్నారు. అమృతం పసుపపచ్చ పట్టుచీర, పెద్ద కుంకుం బొట్టు, నల్లటిరవికవేసుగుని మెట్లమీద నిలబడింది. నిట్టూర్పుతో ఆమె రొమ్ములు లేచి పడుతున్నాయి. వాటిమధ్య చీర నాలుగు మడతలుపడి, సిండైన ఆకృతి తీర్చిదిద్దింది. "తెలుసు నన్నట్లు'

అమృతం నవ్వింది. అత్తగారు పిల్లని ఎత్తుకొచ్చికోడలిచేతి కిచ్చింది. అమృతం పిల్లని ఎత్తుకుని,—"బాబయ్య వెళ్ళిపోతున్నాడు—గుడ్ మార్నింగ్ పెట్టు-" అని పిల్ల చెయ్యి వూపించింది.

"గుడ్ మార్నింగు కాదు. గుడ్ బై అనాలి" అని కాంతారావు సరిజేశాడు—

"ఏదో వొకటి లెండి—శావకి ఏదన్నా కోపంరాదు—మీరు మరి నేర్పుతున్నారు, మా జగ్గుని చూసి—" అన్నది.

"జగ్గు అంటే, వూరుకున్నా! జగన్నాథం అనాలి" అన్నాడు నిధి అందరూ నవ్వుకున్నారు.

"గుడ్ బై-చైల్డ్ ఆఫ్ క్రియేషన్" అన్నాడు నిధి, చెయ్యి వూగిస్తూ.

"అబ్బో, మా అమ్మాయితో యింగ్లీషు మాట్లాడేస్తున్నావే. నువ్వే తీసుకెళ్ళి దానికి చదువు చెప్పించెయ్యి-"

"సరేలే, ఆ భూతకిని లోపలికి తీసుకెళ్ళుదూ" అని భర్త విసుక్కున్నాడు.

"అదేమిటండీ? - మా దొరసాన్ని పట్టుకుని భూతకంటారూ- చెప్పు బావా ఆయనకి, ఏవనాలో, ఏవనగూడదో -"

బండి కదిలింది.

"ఉత్తరంముక్క రాస్తూండే-" దూరంగా చెయ్యి వూపుతోంది, పిల్లతో కలిసి. "అద్రెసు మా వార్నడుగు-"

తరువాత మాటలు వినబడలేదు. బిందెలతో వెళుతున్న అమ్మలక్కలు అమృతంకేసి వింతగా చూసి వెడుతున్నారు, కడపటి దృశ్యం. బండి మళుపు తిరిగింది.

# 11

## చివరకు మిగిలేది!

దయానిధి యింటికి చేరుకునే టప్పటికి సాయంత్రం ఆరుగంటలైంది. అతని రాక తెలియగానే పాతికమంది పనివాళ్ళు యింటి దగ్గర

అతని చుట్టూ మూగారు. పనివాండ్రు సమ్మెచేసి రెండు రోజుల నుంచి పనిలోకి రావడం మానేశారన్న వార్త చెప్పారు. క్రితంరోజు నే వ్రజకరూర్‌లో పెద్ద సభ చేసి, అందులో సర్కారువారు వారి జిల్లాల్‌కొచ్చి చేస్తున్న అన్యాయాలన్నీ యేకరుపెట్టి, వారికి సహకారం యివ్వకూడదని తీర్మానాలు చేశారు. దాని ఫలితంగా పనివాళ్లు సమ్మెచేశారు. దీనికి కారణం ఎవ్వరూ చెప్పలేకపోతున్నారు. అనంతాచార్లుగారిని కూడా వెలివేసినట్లు చూస్తున్నారుట. కొన్ని కారణాలు తెలుస్తూనే వున్నాయి. నారయ్య రెడ్డికి చేసిన శాస్తి; కోమలి గదమాయించడం; అనంతాచార్లుగారు కోమల్ని వెనకేసుకొచ్చి సమర్థించటం. నిధి అస్పష్టమైన గతం, రాజభూషణం ఆ జిల్లాల అనాగరికతను గురించి చేసిన ప్రచారం - యివి కొన్ని. గనికోసం పెట్టుబడి పెట్టిన ధనికులు, లాభాలు కనబడక పోవటం చూసి, యిదంతా యేదో దగా, ఇంద్రజాలం అని శంకించి, డబ్బు విషయం చికాకు చెయ్యడం జరుగుతునే వుంది. హాస్పిటల్‌కి సంబంధించిన వ్యక్తులు మాత్రం స్నేహభావంతోనే వున్నారు. వీరప్పగారు ధనికుడు. ఆయనకు గనిలో వాటా వుంది. ఆ మధ్య జబ్బుచేసి, నిధి ఆరోగ్యమందిరంలో చేరాడు. అసిస్టెంట్ నాగేంద్రరావు ఇన్‌జెక్షన్లు అవీ యిస్తూనే వున్నాడు. మూడు రోజుల క్రితం వీరప్పగారు చనిపోయారు. ఆయనకి విషం ఎక్కించి చంపారని పుకారుపుట్టి కొంత అల్లరి జరిగింది. వీరప్పకి ఎక్కువగా వుండి కబురంపినప్పుడు, అసిస్టెంట్ వెంటనే రాకుండా నర్సు తాయారమ్మతో కార్లో షికారెళ్ళాడని ఫిర్యాదు చేశారు. అసిస్టెంటు తిరిగి వచ్చే లోపల, వీరప్ప కాలం చేశాడు. సమయానికి అక్కడ లేకపోవడం పెద్ద అపచారం అని కోమలి అసిస్టెంట్ మీద కేకలేసి, నిధితో చెప్పి వుద్యోగం తీయించి వేస్తానని బెదిరించిందట. అసిస్టెంట్ 'నీకేం హక్కుంది, నువ్వెవతవి?' అని చెడా మడా తిట్టేశాట. కోమలి సమీ-చెయ్యలేక యేడుస్తూ కూర్చుందట. ఆ మొన్నాడు అసిస్టెంట్ "ఇదుగో వుండాకోర్ వుద్యోగానికి రాజీనామా" అని కాగితం కోమలి మీద గిరాటెట్టి అడ్డం తగిలిన అనంతాచారిగారిని—"నీ

కూతురి కెంక పెండ్లి కాదులే' అని, వెళ్ళిపోయాడుట. అతను కూడా శత్రు పక్షం చేరి నిధి గణాన్ని గురించి యాగీ చెయ్యడం సాగించాట్ట, ఇన్ని జరిగాయి నిధి వూరెళ్ళిన వారం రోజుల్లోనూ.

నారయ్య గాయాలు నయమైనా నీరసంగా లేవలేని స్థితిలోనే వున్నాడు. అతన్ని చూడగానే అంత్య కాలం సమీపించిందని, నిధికి తెలిసి పోయింది. పనివాళ్లు యిళ్ళకి పొయ్యారు. నిధి స్నానంచేసి హాల్లోకి వచ్చాడు. నారయ్య పక్కన కాత్యాయని రంగను కూర్చుని వున్నారు.

"ఎల్లా వుంది నారయ్యా?-"

"అట్లాగే వుందండి—నాలుగు రోజుల్లోనింపాదిగా వుంటుందండి మరేకి జైలు సరిపడదు. లేచి దుక్కలా తిరగాలి, యీళ్ళ పొగుర్లు అణచాల,"

"ఇంకా నీ జోరు తగ్గలేదు—"

"ఆ రెడ్డిగాణ్ణి అఖరుచెయ్యకపోతే సూడండి— ఏం టీనుకున్నారో నా తడాకా."

"తప్పు నారయ్యా- నువ్వు పెద్దవాడివి, నెమ్మది, ఓర్పు, - నేర్చుకోవాలి, మంచిమీద మనుషుల్ని బాగుచెయ్యాలి కాని, పగ సాధించి కాదు-"

"ఈ నీతులు పశువులకాడ పని సెయ్యవండీ - యీ బుల్లమ్మ వుసురోసు కుంటుండారు, నా యెదం గాళ్ళు—" అంటూ నారయ్య కాత్యాయన్ని చూసి బోసిగా నవ్వాడు.

"పడుకో, పడుకో—"

"మా నాన్న వూర్నుంచి వొచ్చారు" అంది కాత్యాయని,

"రాత్రి భోజనం చేసి వొస్తాను—పొద్దుపోతోంది, నువ్వింటికెళ్లు" అన్నాడు నిధి. కాత్యాయని మొహంలో అమాయకత్వం నిస్సహాయంగా మారింది. అతని కేసి దిగులుగా చూసి వెళ్ళిపోయింది కాత్యాయని చిక్కిపోయింది. ఏదో చెప్పరాని దిగులు—ఎవ్వరికీ అర్థం కాదు.

మేడమీదికి వెళ్ళి వుత్తరాలు చూసుగున్నాడు, అందులో

వొకటి శ్రీనివాసరావు దగ్గర నుంచి, రెండో మహాసంగ్రామం ప్రారంభమైంది. భారత దేశం కూడా ఇంగ్లండుతో చేరి, యుద్ధం ప్రకటించింది. ప్రభుత్వానికి కాంగ్రెసుతో బేరాలాడేటందుకు వ్యవధిలేక కాంగ్రెస్‌ని సంప్రదించకుండానే. దేశాన్ని యుద్ధ మేఘాలతో చీకటి చేశారు. ఏ వుద్యోగం దొరికినా చాలు నా భగ వంతుడా అనుకొనే యువకులు వేలకి వేలుగా యుద్ధంలో చేరిపో తున్నారు. గాంధీగారి మాట వినిపించుకోకుండా, యుద్ధానికి వెళ్ళిన యువకులలో శ్రీనివాసరావొకడు-సిమాటిక్ సినిమా హాల్ మీదికి కత్తి నూరడం, నిజంగా హాస్యాస్పదం. డేరాడూన్‌లో ట్రైనింగు ముగిసింతర్వాత, ఇరాక్ వెడుతున్నాట్ట. పొంగుకుంటూ గంతులేస్తూ కోమలి చక్కా వచ్చింది.

గాలికి కదలిపోయిన చింతచెట్టు లాగున జుట్టంతా రేగింది. స్నాన చేసింతర్వాత, ఆకులనుంచి నీళ్ళబొట్లు కారినట్లు, స్నానం చేసిన తడిచీరని వొంటికి పట్టించింది. నీటి చుక్కలు మెడమీద జడ లోంచి పడుతున్నాయి. సృష్టి రహస్యాన్ని కనుక్కున్న పరిశోధ కుడులా, కళ్ళు సంతోషంతో మెరుస్తున్నాయి. కళ్ళు బహిర్గతం చేసిన ఆనందాన్ని పెదవులు దాచలేక పోతున్నాయి;

"ఏం కోమలి చాలా హుషారుగా వున్నావు"

"ఎందుకో చెప్పుకో-చూశారా నా చొరవ - ఎందుకు చెప్పు కోండి-" అంటూ చూపుడు వేలు పైకెత్తి కదిల్చింది.

"ఏమో!"

"ఓస్, తెలీనట్టు మహా-దొంగ మీరు-" కాసేపు నిదానించి, "'అండి'-'మీరు'-అని గౌరవంగా అనబుద్ధి కాదు, మర్యాదగా పిలిస్తే ప్రేమ లేనట్లు ఏమిటో దూరంగా, ఎవళ్ళనో పరాయి వాళ్ళతో మాట్లాడినట్లుంటుందండీ-ఎందుకో, అవునా దయా మయా—"

"దూరంగా—పరాయివాడనేగా—" అన్నాడు,

"అట్లాగంటే కోపం వస్తుంది-చెంపమీద కొట్టబుద్దేస్తుంది. వుండండీ, కసిగా వుంది, హుషారంతా చంపేస్తున్నారు" అని అతని

దగ్గరగా వొచ్చి, బుగ్గని గట్టిగా నలిపి, ఎడంచేత్తో లెంపకాయ కొట్టి ముక్కు మొన పట్టుకుని వూగించింది.

"ఆకు, అగు—తెగించి, విప్లవం చేస్తున్నావు. హుషారుకి కారణం ఏమిటో—?" అన్నాడు

"కారణమా? నిజంగా చెప్పాలా?"

"ఊఁ"

"ఇదీ!" గట్టిగా అతని నుదుటికి తన పెదవుల్ని తగిలించింది.

"మనం అనుకున్నదంతా [illegible] రోజుల్లో మరిచిపోయావా?"

"లేదు. అదంతా గుండెల్లో వుంది. చూడండి-" అని అతని చేతిని తీసుకుని, ఆమె రొమ్ముల మధ్య అదిమింది.

"ఎప్పుడూ విచారంగా, దిగులుగా వుంటే లాభమేమిటి? - అప్పుడప్పుడు కులాసా, హుషార్ లేకపోతే ఏం బాగుంటుంది?" అని అతని మెడని పెనవేసుకుని, వూపిరి పీల్చకుండా మొహాన్ని రొమ్ములతో కప్పివేసింది అతను దూరంగా నెట్టేశాడు.

"బలాత్కారం, రాక్షసం ప్రారంభించావేమిటి?"

"నాకీ వొక్కరోజూ లైసెన్స్."

"ఏం కథ?"

ఆ ప్రశ్నకి సమాధానం ఏం చెప్పగలదు? ఆకలి ఆమె కళ్లల్లో గుడ్డ లిప్పుగుని గంతులేస్తున్నట్లుంది,

ఆమె పాదాల కింద, అనుభవం యిసికకణాలుగా జారిపోతోంది. శరీరం చేస్తున్న దౌర్జన్యానికి, ఆదర్శం తట్టుకోలేక, తుఫానులో కదిలిపోతున్న గడ్డిపోచలాగై, అతన్ని పట్టుకుంది. అతనికి లంగరి.

"మళ్ళా మనం చచ్చిపోతాం—యీ నాలుగు రోజులేగా-"

స్త్రీలకి జ్ఞాపకాలుండవు కాబోలు - ఎప్పటికప్పుడు కొత్తే" న్నాడు ఏదో స్మరించుకుంటూ.

"నాలా యింకెవ్వరూ వుండరు - మీకే తెలుస్తుంది?"

"మొగాడు జ్ఞాపకాలతో కాలక్షేపం చేస్తాడు - గతం, భవిష్యత్తులేని జీవితం, ఎంత బాగుంటుంది! ఇల్లా, స్నేహితుల మాదిరి

వాంఛలూ, అనుమానాలు, పీడింపులు లేకుండా వుండకూడదూ? ప్రశాంతమైన నీటిని ఎందుకు కెలికవేస్తావు? నీ సౌందర్యాన్ని నా చేత హత్య చేయిస్తావు. తర్వాత నిన్ను త్యజిస్తాను. ఆ విషాద అనుభవం మన కొద్దు—'' అన్నాడు నిధి.

అతని వొళ్లో తలకాయ పెట్టుగుని, ఏడవడం సాగించింది కోమలి. ఆశ, యదార్థం కావడం కోసం సాగిస్తున్న ఏడుపు, అది.

ఈ శరీరాలు, వొకళ్ళని చూసి వొకళ్లు అసహ్యించుకోడానికి వుపయోగిస్తాయి సంపూర్ణమైన యేవగింపు లేకుండా, 'మృత్యువు' అంటూ వుంది. సృష్టిలో మృత్యువు లేకపోతే యీ సంసారాలు, - యీ సంఘజీవితాలు, దేశీయతా వాదాలు, అంతర్జాతీయత వొక క్షణంలో పటాపంచలై పోతాయి. శక్తులు నశించి పోయిన శరీరం, అంత అసహ్యంగా వుంటుంది.— అందరి మనస్సులూ వొకటై, అందరి ఆత్మలు వొకటై, ప్రపంచం ఏకమై పోవాలంటే, శరీరాలని త్యజించి దూరంగా, ఏకాంతంగా వుండాలి—''

"ఎందుకు అసలు ఏకం కావడం? ఆనందంలేని బ్రతుకు, ఎందుకు? మీరు చెప్పింది నిజమైతే అసలు మగా, ఆడా ఎందుకు? - తప్పు, అంతా తప్పు - భ్రమ - '' అంటూ అతని మోకాళ్ళ మీద కోపంతో గుద్దింది! కోమలి శరీరంలో చలిమంట వుంది అందులోకి అతన్ని తోసేస్తోంది, జ్వాలలా ఆమె సౌందర్యం అతన్ని చుట్టుకుంటోంది. తర్కం. జ్ఞానం, ముందు-వెనక చూపు. - ఏదీ ఆ మంటని చల్లార్చలేదు. ఆమె జడని అతని చేతిలో పట్టుగుని మొహాన్ని పైకి లేవతీసి చూశాడు. సూర్యాస్తమయాన పశ్చిమ ఆకాశంలో మేఘంలా కళ్లు ఎఱ్ఱగా అయ్యాయి. కళ్ళకింద నల్లపు చీకటిలా ఎగబ్రాకుతోంది. వొడ్డున పడ్డ చేపలలా, పెదవులు వొణికిపోతున్నాయి.

''నాకు తెలుసు — మీరింకెవర్నో ప్రేమిస్తున్నారు'' అన్నదిం.

"అది నీ ప్రేమకి అంతరాయం కాదుకదా? మన శ్రమవుండక్కర యీ చందమామే వెన్నెల విస్తోందని, చందమామని మెచ్చుకోడం మానం" అన్నాడు.

"అమృతంగారా?''

అతనికి నవ్వొచ్చింది.

"ఇంకా -? వుండు, ఎవరో వచ్చినట్టుంది. - కాత్యాయని కాబోలు" అన్నాడు.

"ఇంకా - కాత్యాయనా?"

నిధి, కోమలిన్ని వొక్క తెలపకాయ కొట్టి, తోసేసి లేచాడు. కాత్యాయని తలుపులు తీసి, వాళ్ళిద్దరూ వున్న దృశ్యాన్ని చూసి, తలుపులు మూసి వెళ్ళిపోయింది. నిధి బైటకి నడిచి మెట్లకింద ఆమెను కలుసుకున్నాడు.

"నారయ్యకు మూల్గు ఎక్కువైంది, మా నాన్నగారు వొచ్చారు."

ఇద్దరూ తొందరగా కిందికి వెళ్ళారు. నారయ్యకి జ్వరం ఎక్కువైంది. బాధపడుతున్నాడు. నిధి ఇంజక్షన్ యిచ్చాడు. నారయ్య చూస్తూ పడుకున్నాడు గాని మాట్లాడలేక పోతున్నాడు. అనంతాచారిగారు నిధిని దూరంగా వరండాలోకి తీసికెళ్ళారు. అతను లేని వారం రోజుల్లోనూ జరిగిన అల్లర్లను గురించి చెబుతున్నాడు, సర్కారు జిల్లాల వారిపై అక్కడవారికి వుండే వైషమ్యాన్ని అరికట్టేందుకు ఏదైనా మార్గం చూడా అన్నారు. ఒక సభ ఏర్పాటు చేసి, వారి వుద్దేశాలు బైటపెట్టి, వాళ్ళని మంచి చేసుకోటానికి నిర్ణయించారు. వారి కోపానికి గురికావటానికి అతను చేసిన తప్పు ఏమిటో నిధికి అర్థంకాలేదు, అతన్ని సర్కారు జిల్లాల వాడని అనడంకూడా న్యాయం కాదు; తను అక్కడ స్థిరపడిపోయ్యాడు గనక, వారిలో వాడిలాగే ఎందుకు భావించరో తెలీడంలేదతనికి. ఈర్ష్య, అసహనం అతని సంపదని చూశా? అతను వారికి చేస్తున్న వుపకారాన్ని చూశా? 'వాడెవడో వొచ్చి మన్ని బాగు చేసేది ఏమిటి' అనా? అనంతాచార్లుగారుగూడా సరియైన కారణం చెప్పలేక పోతున్నారు. స్వార్థం, జాతీయత కింద మారడం కాబోలు అన్నారాయన. ఇతరుల దృష్టిలో, వారి సమానత్వం ఋజువు చేసుకోడమో! ఆచారిగారు చదవమని వో ఉత్తరం యిచ్చారు. నిధి చదువుకున్నాడు.

"...యీ పరిస్థితులలో కాత్యాయనికి వేరే సంబంధం చూసుకోడం మంచిది. మీకు సంబంధాలు వెదుక్కునే అవసరంకూడా లేదనుకుంటాను - మీకు ఆప్తులు, యీ విషయాలతో ఆదుకునే వారు వుండనే వున్నారు. ఇందుచే మీకు కలిగిన చీకాకుకి చింతిస్తున్నాము. క్షమింప ప్రార్థన..."

అది పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా వుంటున్న ప్రభంజన మూర్తి గారు రాసిన లేఖ. మొదట్లో వారి కుర్రాడికి కాత్యాయన్ని చేసుకోడానికి వొప్పుగుని తరవాత వ్రాసిన వుత్తరం అది.

"ఇట్లాంటి పరిస్థితులలో నేనిక్కడ నుంచి మరో చోటికి వెళ్ళిపోవడం మంచిదని అనుకుంటాను" అన్నాడు నిధి.

"తెలీనివాళ్లు అనేకం అనుకుంటారు. మన కర్తవ్యం మనం మానకూడదు, అట్లా భయపడి, యీ లోకంలో ఎంతకాలం బ్రతకగలం? నువ్వెక్కడికీ వెళ్ళడానికి వీల్లేదు" అన్నాడాయన కచ్చితంగా.

"నాతో స్నేహంగా వుండి, నన్ను ఆదరిస్తున్నారు కాబట్టి, నా మీద వుండే కోపమంతా మీ మీదికి తిప్పినట్లు కనిపిస్తోంది. నా మూలంగా మీకే యిబ్బందులు రావడం నా కిష్టం లేదు" అన్నాడు నిధి.

ఇంతలో కోమలి బుజాన తువ్వాలు వేసుకుని గబగబా వారి ముందు నుంచి నడిచి వెళ్ళింది, నిధి ఆమె వెళ్ళడం చూస్తూనే వున్నాడు. అనంతాచారిగారు మళ్ళా ప్రారంభించారు.

"నీకు నేను చెప్పదగ్గవాణ్ణి కాను-అయినా, పెద్దవాణ్ణి గనక ఏదో సలహా ఇవ్వాలనిపిస్తుంది."

"తప్పకుండా"

"భార్య పోయింది-ఇంకా వయస్సులో వున్నవాడవు. బోలెడు కార్యాలు సాధించాలి. నువ్వు మళ్లా వివాహం చేసుకోడం మంచిది" అన్నాడు, ఆచారిగారు.

నిధికి భయం వేసింది. కొంపతీసి, కాత్యాయన్ని చేసుకోమనడు కదా!

"నా కా వుద్దేశం పుట్టలేదు. ఆ అవసరం కూడా కనిపించ లేదు" అన్నాడు నిధి.

"ఇల్లా పెండ్లి లేకుండా, పూర్తిగా కలిసి వుండటం లోకులకి నచ్చదు."

ఆచారిగారు కోమల్ని మనస్సులో పెట్టుగుని అన్నమాటలని నిధికి తెలుస్తూనే వుంది.

"నిర్బంధ స్నేహంలో నాకంత నమ్మకం లేదు."

"కావొచ్చు. కాని సంఘం హర్షించదు. సంఘానికి బహిర్గత చిహ్నాలు కావాలి."

"అల్లాంటి చిహ్నాలు వున్నప్పుడు కూడా నన్ను సంఘం క్షమించింది కాదు. సంఘాన్ని గౌరవించే అవసరం నాకు కనపడ లేదు. మరణించిన వారిని కూడా, సంఘం తిడుతూనే వుంటుంది. ఫలానా జిల్లా వాసివి-అని రాజకీయంగా ద్వేషించింది సంఘం; ఫలానా తల్లి కొడుకువి అని నైతికంగా హింసించింది సంఘం..." అంటూ అప్రయత్నంగా. ఫౌంటన్‌లో అమర్చబడ్డ తల్లి రాతివిగ్ర హం కేసి చూశాడు నిధి.

ఇవన్నీ ఆచారిగారితో చెప్పుకున్నందుకు నిధి విచారించాడు. ఆచార్లుగారు వోదారుస్తూ అతని బుజాన్ని తట్టాడు.

'నారయ్యని చూసొస్తాను' అని ఆచారిగారు లోపలి కెళ్ళారు. నిధి తల్లివిగ్రహం దగ్గరికి వెళ్ళాడు విగ్రహం కుడిచెయ్యి విరిగింది; మొహాన, పైనుంచి కిందవరకూ, పెద్ద పగులుంది. ఎవరో అతని అయువు పట్టుమీద కొట్టిన దెబ్బ అది ఆ పని ఎవరు చేసింది?

గేటుదాటి అవతలకి నడిచాడు. ఎక్కడికో దూరంగా నడిచి వెళ్ళిపోతోంది కోమలి. కోపం వొచ్చింది కాబోలు. మళ్ళా తిరిగి రాదు? ఏదేనా అఘాయిత్యం చేస్తుందా? అటుకేసి నడవటం సాగిం చాడు. ఆకాశం నిర్మలంగా వుంది; చంద్రుడు లేడు; మేఘాలు లేవు; పువ్వుల దుప్పటి కప్పుకున్నట్లుంది భూమి; మందంగా వీస్తోంది గాలి. ఊరు, చెట్లు, పుట్ట అన్నీ దాటాడు. "నీకు ఎవ్వారు లేరు నాకు

ఎవ్వారులేదు." పాట జ్ఞాపకం వొచ్చింది. అవన్నీ తాటిచెట్లు. ఏకాంతాన్ని భంగం చెయ్యకుండా నిశీథి ఏర్పాటుచేసిన ఫారా వాళ్ళల్లా తాటిచెట్లు. ఫర్లాంగు దూరంలో వుంది కోమలి.

"కోమలీ" అని కేక వేశాడు. ఆతని కంఠం తనికే చిత్రంగా తోచింది. కొత్తగా ఎవరి కంఠంలాగో వినిపించింది. 'జాగ్రత్త' అంటూ భయంకరంగా తాటిచెట్ల ఆకులు గర్జించాయి. కీచురాయి. కూత మానింది. అదరినట్లుగా నక్షత్రాలు మినుకు మనడం మానుకున్నాయి. గాలి రాలేక నిట్టూరుస్తోంది. కోమలి వెనక్కి చూడదు; భూమి అనుకుని ఆకాశంలోకి నడుస్తున్నట్లుంది.

తొందరగా నడిచి ఆమె దగ్గరికి చేరుకున్నాడు. మట్టిలో రాళ్ళని తోసేసి, కూలబడిపోయింది కోమలి ఆతను చతికిలబడ్డాడు. ఆతని వొళ్ళో తువ్వాలు కప్పి దానిమీద మొహం ఆనించి ఏడుస్తోంది. చల్లబడిన రక్తపు చుక్కలు.

"ఎందుకు?"

"........."

"కోపమా-?"

"........."

"చూడు మరి."

"నా కోసం ఎందుకొచ్చారు?—మీరు వెళ్ళిపొండి.... నేను రాను—రాను."

"ఉస్-ఊరుకో, నక్షత్రాలు జడుసుకుంటాయి. "నిన్ను యింకెప్పుడూ కొట్టను. క్షమించు" అన్నాడు.

"నేను వొక్కసారి కొడతాను" అని, అతన్ని కోమలి మెత్తగా లెంపమీద కొట్టింది.

'తీరిందా ఆలక! ఏవేవో మనస్సుని బాధిస్తే, అకారణంగా కోపంవొచ్చి, ఆవిధంగా బైట పడుతుంది" అన్నాడు నిధి.

"నన్ను క్షమించండి-కష్టపెట్టే మాటలు అన్నాను-అబద్ధం అని నాకు తెలుసుండి కూడా-"

"నీకూ నాకూ తేడా లేదు. కోమలీ—మరింకెట మనం కలుసుకోలేం; సంఘం మనల్ని విడదీయలేదు."

కోమలి కళ్లు పెద్దవిచేసి, మూసి స్థిరంగా చూసి, అతని జుట్టులో చేతులు పోనిచ్చి, కిందికి నెట్టేసి, అతని కంఠంమీద తన బుగ్గని ఆనించింది.

"ఇల్లాగే వుండి, యిక్కడే చచ్చిపోతాను" అంది కోమలి.

"పొద్దుపోతోంది, లే, వెళదాం. ఆకలెయ్యడం లేదూ?"

"నిన్ను కొరుక్కు తింటాను."

"ఇంకేం మిగల్దు, మళ్ళా ఆకలేస్తే-"

"మళ్ళా వెంటనే బాగుచేసేస్తా—"

"చెడిపోయిన వాస్తువు బాగుపడటం లేదు సృష్టిలో. ఉన్నదానికి విలువ లేదు. అది ఎవ్వరికీ అక్కర్లేదు" అన్నాడు.

"ఎవళ్లకి అక్కర్లేదు? దేవుడికి కూడా?"

"నువ్వు దేవుడివా?"

"ఓ-దేవతని-"

ఆమె శరీరం పొంగిపోయి, రాతిమీద భగ్నమైన కెరటం తుంపరలలాగ విడిపోయింది. మనిషంతా జీర్ణమై, మృత్యువుని వెతుక్కుంటోంది.

"నేనేమీ చెయ్యను, ఊరికే పడుకుంటాను"

గుండెలు కొట్టుకోడం వినిపిస్తోంది అతనికి. రక్తం ప్రాకుతూట తెలుస్తోంది. నాళాలన్నీ శ్యాం చూస్తున్నాడు. నక్షత్రాలు తీవ్రంగా మెరుస్తున్నాయి. తాటిచెట్లు నిద్రపోయించి లేచాయి; కీచురాయి సంగీతం ప్రారంభించింది. ప్రకృతి స్వప్నంలోంచి లేచింది....యథార్థాన్ని చూసి, జడుసుకుని కళ్లుమూసింది.

కోమలి ఆ అనుభవంతో మానసికంగా ఎదిగిపోయింది. జీవితంతో సంపర్కం చాలించుకుని ఏకాంతంలో వార్ధక్యం పొందింది.

"శ్యాం రా-మిమ్మల్ని ఏమీ చెయ్యలేదు. నాకామాత్రం తెలీదా?"

"ఇల్లా వుండగా ఎవరైనా వచ్చి చూస్తే ఏమీ జరగలేదంటే నమ్ముతారా?"

"నమ్మరు. వాళ్లు ఎల్లాగా అనుకోడం మానరు గనక. మనం ఏమీ చెయ్యకుండా వుండడం ఎందుకనిపిస్తుంది నాకు" అన్నది.

"అదే పొరపాటు—నిజమైన ప్రేమకీ, మానవుడు నిర్మించిన నరిహద్దు లుండవు. ఉంటే అది ప్రేమ కాదు."

ఐతే మీరు నన్ను నిజంగా ప్రేమిస్తున్నా రన్నమాటే—నాతో యిన్నిరోజులు ఎందుకు చెప్పలేదు? చెబితే వేధించుకు తినకపోదును కదా—"

"చెబితే మిగలని దీ ప్రేమొక్కటే—"

కాసేపు నిశ్శబ్దంలో వాళ్లు రు-రెండు కెరటాలు కొట్టుకుని, సుడిగుండంలో కలుసుకున్నట్లు—కళ్లల్లోకి చూసుకోడం, వెర్రిగా నవ్వుకోడం—అంతే వారి ప్రేమ. ఎన్నెన్నో కొత్తవి అవగాహన అవుతాయి. గతాల అస్థి పంజరాలు నశిస్తాయి; భవిష్యత్తు ముందుకి సాగి మాయమై పోతుంది. దూరాలు, లోతులు, శిఖరాలు—అన్నింటికీ ప్రతిచోటునుంచి, ప్రతిక్షణంనుంచీ వారే కేంద్రమౌతారు. క్షణం వెలుగుని చూశారు ఉద్రేకానికి, ఊహకీ, ముందు వెనకలకీ స్థలానికీ, కాలానికీ అతీతమైన జీవజ్ఞానం.

లేచి నడడం సాగించారు, చెయ్యీ చెయ్యీ పట్టుగుని—ఆ నడక కాలం చివరికి; స్థలం చివరికీ; పరమావధిలేని అన్వేషణ; గమ్యస్థానం లేని యాత్ర. అవన్నీ భ్రమలు. ఊళ్ళోకి చేరుకున్నారు. నిశీథి నట్టమై తన్ను చూసి జడుసుకుని, నక్షత్రాలని కిందికి దించుకుంది. ఆనాలుగు తాటిచెట్ల మధ్యనిలబడి ఆకాశంకేసి చూస్తున్నారు. కోమలి చెట్టుకి జార్లపడింది, అతని నడుంని తన చేతులతో బిగించి.

"ఆయాసంగా వుందా?"

"నాకేం ఆయాసం? అప్పుడే యింటికొచ్చామని బెంగ," అని నీరసంగా నవ్వింది. 'ఉఁక్' మని ఏదో చప్పుడైంది. నిధి వెనక్కి తిరిగి చూశాడు. తాటిచెట్టుకి వొక కత్తి అతన్ని దూసుకుపోయి, గుచ్చుకుని, వ్రేళ్ళాడుతోంది. అటూ యిటూ చూశాడు. దూరంగా

పొదలు; మరీ దూరంగా గుడిసెలు, మనుషుల అలికిడి లేదు. కత్తిని బైటికిలాగి పరిశీలించాడు. అది కత్తికాదు; పొడుగాటి చాకు— దానిమీద 'ప' అన్న అక్షరం చెక్కబడి వుంది. ఆ చాకు ఎవరిదో అతనికి తెలుసు.

"అదేమిటి?" అన్నది కోమలి, చాకుని తీసుకుని చూసింది. "ఎవళ్ళో పోగరమోతు వచ్చివాళ్ళు—"

"పాపం, ఎవరో మనని మేలుకో మంటున్నారు" అన్నా డతను.

"అరెస్టు చేయాల్సిందే—యింక వూరుకో కూడదు" అన్నది.

"మనుషుల్ని, సంస్థల్ని, దేశాలని, అన్నింటినీ ఎదుర్కోవచ్చు అన్నింటినీ జయించవచ్చు. అన్నిటినీ—వొక్క అకారణ ద్వేషాన్ని తప్ప-" అన్నాడు నిధి.

మళ్లా నడవడం సాగించారు.

"నువ్వు డాక్టర్ని డిస్మిస్ చేశావుటగా?"

"అవును. రోగి మందులేక చస్తావుంటే, వాడికి నర్సుతో షికార్లేమిటి?" అంది.

"అవును, మరి నారయ్య చస్తావుంటే. మనం షికారుకు రాలేదు! అల్లాగే అతనూను" అన్నాడు.

"మీరింత మంచివారు గనకనే, వాళ్లింత నెత్తి తొక్కుతున్నారు."

"స్వచ్ఛంగా 'మంచి' అనేది లేదు. ఎవళ్ళో ఒకళ్ళకంటె 'మంచి' వుండొచ్చు."

నడక తొందరగా సాగించారు. గనుల దగ్గరకి చేరుకున్నారు, కాని గనుల పల్లాలు, తవ్వులు కనిపించడం లేదు. పెద్ద గనులు మూడు రాళ్ళతో, మట్టితో పూడ్చబడి వున్నాయి.

"ఇదేమిటి?" అంది కోమలి.

"ప్రేమ, ఆరునెలలు తీసుకున్న పనిని ద్వేషం రెండు గంటలలో చేసింది."

అతనికి నవ్వాలో ఏడవాలో తెలిసిందికాదు. మానవుడి

ద్వేషం, క్రూరత్వం, పశుత్వం యెట్లా వుంటుందో చూడగలిగాడు. అతను ఆ మానవ జాతికి చెందినవాడే. తనని తాను ఎట్లా ప్రేమించుకోగలడు? తనని తాను ప్రేమించుకోలేనివాడికి యితరులని ప్రేమించే అర్హత ఎట్లా వుంటుంది?

ఇంటికి చేరుకున్నారు. 'అమ్మ' విగ్రహం చెయ్యి వూడిపోయి, పీటతో అట్లాగే వుంది. తలకాయ వూడివుంటుం దనుకున్నాడు, కాని అట్లా లేదు. హాల్లోకి చేరుకునేటప్పటికి రెండు గంట లయింది. అరుగుమీద తువ్వాలుతో దులుపుకుని పడుకున్నాడు. లోపల్నించి నారయ్య మూలుగు వినపడుతోంది. దూరంగా మూల 'చిట్టి' చాప మీద పడుకున్నాడు. దీపం తన్నుకులాడి ఆరిపోయింది. కోమలి నిధి పక్కనే గోడని చేర్లబడి ప్రక్కన వొరిగిపోయింది. ఆ యిద్దరూ తమతమ ఏకాంత భవనాలలో బంధించబడి, వొకర్ని వొకరు నిద్రలో చూసుకుని, దగ్గర్నుండి కలుసుకోలేమే అని నిశ్చలంగా ఏడుస్తున్నారు.

ఆ సూర్యుడే వుదయించాడు. ఆ కిరణాలే వారి నేత్రాలని మాధుర్యంలో మత్తెక్కించి మేలుకొలిపాయి. చుట్టూ జనం పోగడ్డారు, రాత్రి జరిగిన దురంతానికి కారకు లెవరో అంచనాలు వేస్తున్నారు. నేరారోపణ చేస్తున్నారు, జిల్లా మేజిస్ట్రేట్ కూడా వొచ్చాడు. అసలు గనులే లేవనీ, వాటి పేరు చెప్పుకుని, రాయలసీమ ప్రజలని మోసంజేసే, వొక సర్కారు జిల్లా వ్యక్తి. యిష్టం వొచ్చినట్లు ఆమాయకపు ప్రజలపై అధికారం ఛలాయిస్తున్నాడని. మేజిస్ట్రేట్‌కి ఆకాశరామన్న పేరిట పిటిషన్లు వొస్తే వాటి నిజానిజాలు తెలుసుకుందామని, ఆ ప్రభుత్వోద్యోగి చక్కా వచ్చాడు. ప్రణాళికలు పరిశీలించాడు; ఇంజనీర్లని పరామర్శించాడు. గనులు వూడిపోయి వున్నాయి. ఫిర్యాదులు, విచారణ, శిక్షణ—సాక్షులు అంతా పూర్తయి, మేజిస్ట్రేట్ ప్రభుత్వంవారికి పంపడానికి రిపోర్ట్ తయారయ్యేటప్పటికి మధ్యాహ్నం రెండు గంటలైంది. మేజిస్ట్రేట్ అపిటిషన్లలో యథార్థం లేదని, దయానిధి తలపెట్టిన కార్యం న్యాయబద్ధమైందని వ్రాసి పంపించాడు.

ఈ వార్త వజ్రకరూర్ లో పొక్కింది. అక్కడ వొక పెద్ద సభ చేశారు. మేజిస్ట్రేట్ అనంతాచారిగారి స్నేహితులనీ, ఆయన మొహమాటాన ప్రభుత్వంవారు న్యాయంగా విచారణ చేక, సరైన చర్య తీసుకోడం మానివేశారనీ, వారు నిశ్చయించి, సభలో వుపన్యాసాలు చేసి, గవర్నరుగారి దగ్గరకు వో 'డెప్యుటేషన్'ని నిర్ణయం చేసుకున్నారు. వారు గవర్నర్ కి నివేదించుకో దలచిన అంశాలు,

(1) ఆంధ్రరాష్ట్రం విషయంలో సర్కార్ల వారితో యేకీభవించలేము.

(2) తమకి ప్రత్యేక రాష్ట్రం వుండాలి. అది యివ్వలేని పక్షాన, ఆర్థిక జాతీయ సమానత్వం సమకూర్చే అవకాశాలు ప్రభుత్వం వెంటనే కలిగించాలి.

(3) ఇతర జిల్లాల వ్యక్తులకు యీ జిల్లాలలో పారిశ్రామిక సావకాశా లుండగూడదు.

(4) ఉద్యోగాలు కళాశాలల్లో 'సీట్సు'—వీటిల్లో యితర జిల్లాలవారికి ప్రవేశం వుండకూడదు.

ఈ తీర్మానాలు సమగ్రంగా లేవని కొందరు పెద్దలు నిర్ణయించి సమయోచితంగా,—'ప్రధాన స్థానం రాయలసీమ వారికే ఉండాలి. వారు లభించనప్పుడు యితర జిల్లాలవారిని తీసుకోవొచ్చు" అన్న సవరణ చేశారు. కడపలో వొక కాలేజీ వెంటనే పెట్టాలి, దానికి ప్రిన్సిపాల్ గా మళయాళీ కాని, తమిళ సోదరుడు గాని, సర్కార్ జిల్లావ్యక్తిగాని వుండకూడదు అని మరో తీర్మానం. ఆ సభలో అనంతాచారిగారూ, నిధి కూడా వున్నారు.

"ఇంకా నయం, ప్రిన్సిపాల్ గా వుండేవారు కనీసం మనిషై వుండాలని సంకల్పించినందుకు సంతోషించవల్సిందే—" అన్నారు అనంతాచార్లుగారు అక్కడ వుపన్యసిస్తూ. అక్కడ జనానికి యిది వరకు ఆచారిగారిపైన వున్న గౌరవం యిప్పుడు లేదు. ఆయన ప్రసంగం ఎవరూ వినే స్థితిలో లేరు.

సభ ముగిసింది—జనం పల్చబడ్డారు. చీకటి పడుతోంది. నిధి దూరంగా అరుగుమీద కూర్చున్న సరయ్యగారి దగ్గర కెళ్ళాడు.

"ఈ చాకు మీదే ననుకుంటాను. మీ వాళ్లెవళ్ళైనా గనుల దగ్గర పారేసుకున్నటారు" అని చాకు తీసి సరయ్య కిచ్చాడు.

సరయ్య దాని కేసి పరకాయించి చూశాడు.

"అవును నాదే,— మా తమ్ముడు, పారేసుకున్నాడే మో!" అని చాకును తీసుకున్నాడు.

నిధి, ఆచార్లుగారు యింటికి చేరుకున్నారు,

"ఇవాళ అందరం మా యింట్లో వుండగూడదూ?" అన్నారు ఆచార్లుగారు. నిధి సరే నన్నాడు. కాత్యాయన్ని పంపి. కోమల్ని ఆచారిగారింటికి తీసుకు రమ్మన్నారు.

అనంతాచారిగారు వీధిలో మడతమంచం వాల్చుగుని కూర్చున్నారు. సరయ్య, యిద్దరు పాలేసులూ వొచ్చి ఎదురుగా నిలబడ్డారు. తక్షణం ఆచారిగార్ని తీసుకు రమ్మనమని మేజిస్ట్రేట్‌గారి దగ్గర నుంచి 'సమ్మన్స్' వొచ్చింది.

"అంతర్జంటూ? ఉదయం రాకూడదూ?" అని అడిగారు ఆచార్లుగారు.

"ఇప్పుడే రమ్మన్నారు."

ఆచారిగారు, యింట్లో కెళ్ళి, కోటు, కండువా వేసుగుని, కఱ్ఱ తీసుకొని, మళ్ళా ఉదయమే వొస్తానని చెప్పి, కార్లో ఎక్కి వెళ్లిపోయారు.

దయానిధి, ఏమీ పాలుపోక, రోడ్డుమీద నడుస్తూ పోతున్నాడు. దూరంగా వొంతెనమీద కొందరు వ్యక్తులు కూర్చుని మాట్లాడుకోడం వినబడుతోంది అతనికి.

"ఆ నిజలింగప్పగాడి కన్ను దానిమీద పడింది. దాన్నెప్పుడో లెగదీసుకుని కొట్టుక పోతాడు."

"అయ్యవోరి పెళ్ళాం కాదంటగా—"

"ఆరమ్మా యిదే మాదిరిట — బిళ్లకట్టుగుని సంపాదించిన దుడ్డే—"

"అమ్మ బుద్ధులే కొడుక్కి వొచ్చాయా—"

నిధికి ప్రపంచం శ్మశాన భూమిగా కనపడుతోంది ఆ చీకట్లో. ఆ రొదలో.

అక్కడనుంచి వొచ్చేద్దాం అనుకుంటున్నాడు - కాని ఇంకా ఏం చెప్తుగుంటారో నన్న కుతూహలం వొదలలేదు. ప్రపంచంతో నిమిత్తం వొదులుకోలేదు స్వార్థం. ఇళ్ళా కంఠాలు వినిపిస్తున్నాయి.

"సర్కార్లోళ్ళు అందరూ అంతేరా—అళ్ళకి ఆడోళ్ళ భాగోతమే—ఆళ్లు పోతేగాని శని వదలదు. సిటింగులో తీర్మానం అయిందిగా-"

నిధిని స్వార్థం వాళ్ళలోకి నెట్టివేస్తోంది. తను, తన గౌరవం, తన ఆత్మ, తన ఆదర్శాలు, తన జాతి, తన దేశం తన ప్రపంచం—అన్నీ వొక్కసారి ప్రేరేపించి, శక్తిగా గై, రంగంలోకి నెట్టేశాయి. భయం, సిగ్గు, మొగమాటం, ఔదార్యం అన్నీ సమయ్యారెమో!

"నేను నిజంగా మీకు చేసిన అపకార మేమిటో చెబుతారా? బతిమాలుకుంటాను" అన్నాడు గుంపులోకి వెళ్ళి. ఆ వ్యక్తులు తెల్లబోయ్యారు.

"మిమ్మల్నేమన్నాం - మేం వేరే మాట్లాడుకుంటున్నాం" అన్నాడు వాళ్ళల్లో పెద్దమనిషి.

"మీ రనుకునే వన్నీ నాకూ కూడా అన్వయిస్తాయి. వాటిని అబద్ధం అని రుజువు చెయ్యలేను. నా తప్పు నాకు తెలియపరిస్తే మహోపకారం చేసినట్లు" అన్నాడు.

ఎవ్వరూ సమాధానం చెప్పరు

"నేను సర్కారు జిల్లాలవాణ్ననా మీకోపం?"

సమాధానం లేదు.

"మాట్లాడరేం?"

నిశ్శబ్దం.

ఎవరో సకిలించారు.

"అదే ఐతే, రేపు వుదయమే, నేను వెళ్ళిపోతున్నాను-"

నిశ్శబ్దం.

"నాకు పెండ్లి కాలేదనా?-రేపు వుదయమే పెండ్లి చేసుకుంటాను."

ఎవరో నవ్వారు.

"నవ్వులాట కాదు. మీ రెవరో నాకు తెలీదు. అనేకుల మన ఇళ్ళలో వుంటున్న శవాలని ఏరు బైటికి విపులంగా వెళ్ళబుచ్చారు. మీ మధ్య నేను వుంటున్నాను గనుక, మీతో సమాధాన పడడం నా విధి, మీ రేది కోరితే అది చేస్తాను. ఆస్పత్రి, గని, భవనం, స్కూలు, లైబ్రరీ - అన్నీ మీకు వప్పగించేస్తాను."

"రాష్ట్రం?" అన్నా రెవరో.

"నాకు రాష్ట్రం అక్కర్లేదు. మనందరం స్నేహంగా, సుఖంగా వుండటం కావాలి. వొద్దని ప్రచారం చెయ్యమంటే నే చేస్తాను. మాట్లాడరేం?"

అంతా నిశ్శబ్దంగా వుంది.

"ఎవరో మా అమ్మ విషయం ఎత్తారు మీలో. నే నేం చెయ్యను? మా అమ్మ చచ్చిపోయింది. చచ్చినవాళ్ళని నే నేం చెయ్యను?"

ఒక్కసారి కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి; కంఠం పగిలిపోయింది. ఆపుగోలేక, నిధి బిగ్గరగా ఏడుస్తూ, 'చచ్చిపోయింది' అనుకుంటూ, పిచ్చివాడిలా నడిచి వొచ్చేశాడు, దూరంగా ఎవరో ముక్కు చీదుకొని నిట్టూర్చారు.

ఆచారిగారింట్లో దీపం మసగ్గా కనబడుతోంది. అంతా చీకటి. ఇంక అతనికి ఏడుపు రావడంలేదు. కన్నీరంతా ఎండిపోయింది; శ్మశానంలో భూతాలతో ప్రసంగించేసి వొచ్చింతర్వాత, యింక గుండెల మీద భయం తాండవించలేదు, బరువుని సముద్రం మింగేసి, తుంపరల్ని మొహాన కొట్టింది - ఆ బరువు. సముద్రంలోని వుప్పునంతా పీల్చేసింది - కన్నీ రింక వుప్పగా వుండదు.

'రంగ' డొచ్చాడు.

"మరేమోనే: మా అమ్మ ఏమందో చెప్పుకోండి-" అని అతని చెయ్యి పట్టుకని లాగుతున్నాడు.

"ఏమంది?"

"చెబితే ఏమిస్తారు?"

"నే నివాళ చచ్చిపోతా ననుకో — పోయేలోగా నీ కేదేనా కావాలంటే ఏం కోరతావు?"

"ఒక్క రూపాయి.

"ఓస్ అంతేకదా - ఇస్తాలే-"

"ఏమీ లేదు. అమ్మ భోజనానికి రమ్మంది," అన్నాడు రంగడు.

"రూపాయిస్తాను. ఎప్పుడూ ఏడవకేం?" అన్నాడు నిధి.

రంగడు గంతులేస్తున్నాడు.

"అమ్మ చచ్చిపోయినా ఏడవకూడదు" అన్నాడు నిధి.

ఇంటికి చేరుకున్నారు.

కోమలి వొచ్చింది. ఎప్పుడూ లేంది, ఆ రాత్రి నల్లచీర కట్టుకుంది. జాకెట్టు రంగు తెలీడంలేదు. తల్లో గులాబీలు, మల్లెపూలు; దవనం-అన్నీ ఎక్కువగా పెట్టుకుంది, రాణీ అత్తవారింటికెడుతోన్నట్లుంది.

"పొద్దుపోయింది - ఎక్కడ తిరగుతున్నారు?" అన్నది.

"నారయ్య కెల్లా వుంది?"

"అల్లాగే వుంది: మూర్ఛ తగ్గలేదు. గొడవ అన్నీ పొదిలి పోయ్యాయా?"

అతనేమీ మాట్లాడలేదు. భోజనాలు చేశారు. రాజమ్మగారు దిగులుగా వుంది. ఎవ్వళ్లూ ఎక్కువ మాట్లాడకుండానే భోజనాలు కానిచ్చారు.

దయానిధి తువ్వాలు బుజాన వేసుగుని వీధులో కొచ్చాడు.

"కోమలీ-" అని పిలిచాడు.

వొచ్చింది.

"అల్లా నడుద్దామా?"

"ఓ"

రాజమ్మగారితో చెప్పి వొచ్చింది. కాత్యాయని తనూ షికారొస్తానని బయలుదేరింది.

"ఒద్దమ్మా చీకట్లో-మేం షికారెళ్ళడం లేదు" అన్నాడు.

"పోనీలెండి" అంటూ కాత్యాయని కోపం ప్రకటించి లోపలికెళ్ళి పక్కలెయ్యడం మొదలెట్టింది.

"నామీద యింత దయ కలిగిందేం, యివాళ?" అన్నది కోమలి.

"కోమలీ - నాకు మనుషులన్నా, సంఘం అన్నా ఇంతా వరకూ భయంగా వుండేది. ఇవాళతో ఆ భయం పోయింది."

"నే నుండగా మీ కెందుకూ భయం?" అని, అతని చెయ్యి పట్టుగుంది; ధైర్యం సూచిస్తూ కనుబొమ్మలు ఎగరేసింది. "ఏం జరిగిం దేమిటి?" అని అడిగింది.

"నేను వెలుగుని చూశాను, శ్మశానంలో."

"అవేం మాట్లండి,-నాకు భయం పుడతావుంది."

"నమ్ముతావా? మా..నవహృదయంలో ద్వేషం ఎందుకుంటుందో కనుక్కున్నాను."

"మీకు నామీ దెందుకుందో కూడానా?"

"వేళాకోళం కాదు - నిజం."

"ఎ దుకో చెప్పండి."

"చెప్పనా?"

"ఊఁ."

"తన కేం కావాలో తెలీనప్పుడు మానవుడు ద్వేషిస్తాడు."

"అంటే?"

"ఏం కావాలో తెలిస్తే ఆ వాస్తువుని ప్రేమించి, దాన్ని పొందటం కోసం యత్నిస్తాడు. అది తెలీనప్పుడు హృదయంలో మిగిలేది ద్వేషం."

"మీకు నేను కావాలని మీకు తెలిసన్న మాటేగా" అంటూ, తను వేసిన ప్రశ్న తెలివైందని సూచిస్తూ తనే నవ్వుతూ సాగించింది. "కొందరికి ఏమీ అక్కర్లే దనుకోండి, వారి మాటేమిటి?"

"అక్కర్లేదని తెలుసుకుంటే కూడా ద్వేషం వుండదు" అన్నాడు.

రాళ్ల మీద కూర్చున్నారు ఆకాశంలో చంద్రుడు లేడు. గాలి చలికి వొణికిపోతోంది. నిధి తలని కోమలి తన వొళ్ళో పెట్టుకుంది, పసిపాపలై పొయ్యాడతను.

"మీకు వెలుగు కనబడితే, నాకు వెండ్రుక కనబడింది" అన్నది కోమలి.

"అంటే?"

"పెట్లు సర్దుతుంటే, వొక కవరు దొరికింది. దాన్లో చూస్తే వొక నన్నటి పొదుగాటి వెండ్రుక దొరికింది - నన్ను నేను కను క్కున్నాను."

"అదేమిటి?"

"నాదేగా,—తీసి దాచుకున్నారు-మనిషినే వుండంగా, మీ కింకేం కావాలి?"

అది అమృతంవని చెబుదా మనుకున్నాడు. కాని దానివల్ల ఏం ప్రయోజనం? సంతోషం యిచ్చిన భ్రమని తుంచెయ్యటం దేనికి?

'అది నీదనే నమ్మకం ఏమిటో?' అన్నాడు,

"నా కేం కావాలో నాకు తెలుసు. అంతే కాదు, మీ కేం కావాలో కూడా నాకు తెలుసు. అనుమానం వుంటేగా సంచేహానికి - నాలో ద్వేషంలేదు-"

అంటూ అతని తలని గట్టిగా అదిమి, తన పెదవుల్ని తగిల్చింది. ఆనాటి చేప పిల్లలు పెద్దవయి చెఱువులో కదిలినట్లు వింత పరిమళం అతన్ని ఆవరించింది.

"ఇంక లోతుకి దిగొద్దు-మునిగిపోతాం" అన్నాడు నవ్వుతూ,

"పోండి అట్లాగైతే" అని అతన్ని గెంటేసింది-అతని తల మట్టిలో పడింది. చెయ్యి పట్టుగుని లేవబోయ్యాడు. లేవనీకుండా అతన్ని తోసేసింది. లేచి పట్టుగుని కొట్టబోయ్యాడు. చక్కలిగింత లెట్టి, తప్పించుకొని పారిపోయింది, తరుముకొంటూ వెంటపడ్డాడు.

"నన్ను పట్టుకోలేరు—"

పరుగెత్తుకుంటూ యిద్దరూ యింటికి చేరుకున్నారు.

"ఈ వుత్తరాలొచ్చాయట — మీ కిమ్మంది అమ్మ" అని 'రంగడు' రెండుకవర్లు తీసుకొచ్చి యిచ్చాడు. నిధికి నిద్రొస్తోంది. బద్ధకంగా అవులించి కవర్లని దిండుకింద పెట్టుకుని పడుకున్నాడు. అందరూ నిద్రపోతున్నారు. గడియారం పదకొండు కొట్టింది.

ఎన్నడూ లేంది ఆనాడు వారికి వెంటనే నిద్రపట్టేసింది. ఎవరో యింట్లో యేదో సర్దడం, తడపడం, తలుపు తియ్యడం - శబ్దాలు వినబడుతూనే వున్నాయి. మళ్ళా నిశ్శబ్దం. నిధి కేదో చిత్రమైన కల-తను సూర్యగోళంలోకి వెళ్ళిపోతున్నట్టు. సూర్యుడులోంచి పెద్ద పెద్ద మంటల నాలుకలు అతన్ని దగ్ధం చెయ్యడానికి లేస్తున్నట్లు:- ఆ దృశ్యం, భూమిలో వున్న వారు చూసి, 'అయ్యో' అని ఏడ్పులు సాగిస్తున్నట్లు. భయంతో పక్కకి తొంగి చూశాడు. కోమలి జడలో పూలు ఎట్టగా మంటలలా మెరిసిపోతున్నాయి. కళ్ళు తెరిచి చూస్తున్నాడు. అది స్వప్నం కాదు, యదార్థమే-ఎవరో రోదిస్తున్నారు. పిల్లల ఏడ్పులు, మంటలు, చప్పుడు - ఆచారిగారిల్లు కాలిపోతోంది.

ఇల్లు, పాక - అంతా తగులడుతోంది, జనం లోపలికి పోయి, సామాన్లు యివతలికి గిరవాటెడుతున్నారు. ఆ జ్వాలలోకి కోమలి మెఱుపుతీగెలా వెళ్ళిపోయింది. చుట్టుపక్కల జనం పోగయి, నీళ్లు పోసి ఆర్పుతున్నారు. ఆవులు, దూడలూ ఏడుస్తూ పోతున్నాయి. అతనూ లోపలికి వెళ్ళాడు. సామాన్లు బైటికి గిరవాటెడుతున్నారు. పిల్లలందర్నీ బైటికి తీసుకొచ్చారు. అతను మళ్ళా లోపలికెళ్లాడు కోమలి కోసం. అగ్నిజ్వాలలు కోమల్నీ, అతన్నీ చుట్టేశాయి. అతను పిలిచాడు - 'కోమలీ' అని, మంటలు సమాధాన మిచ్చాయి-'నిధీ' అని, మధ్య దూలం విరిగిపడింది.; అతన్ని పక్కనుంచి ఎవరో నెట్టివేశారు; దూలం పడింది; దానికింద తగులడుతున్న చీర, కోమలి చెయ్యి వున్నాయి. ఆ దూలంతో పెనుగులాడి, కోమల్ని యివతలకి లాగి, బైట కొచ్చాడు. కోమలికి నుదిటిమీదా, చేతిమీదా దెబ్బలు తగిలాయి; మాటలేకుండా పడిపోయింది.

జనాన్ని, సామాన్ని నిధి తన భవనంలోకి చేరవేస్తున్నాడు. కోమల్ని స్తంభాని కానించిన బండిలో ఎక్కించి, యిద్దరు సాయం పట్టి, ఆబండిని ఇంటివైపు లాక్కెళ్ళారు, ఆచారిగారి కుటుంబం అందరూ మేడమీదికి చేరుకొన్నారు, కోమలి వున్న బండిని, గేటు దగ్గర నిలిపి, నిధి అటూ యిటూ తిరుగుతున్నాడు. తనకోసం తెప్పించిన యంత్ర పరికరాలు నాశనమై పోయాయి: గనులు

పూడ్చిబెడ్డాయి. వజ్రం మీద వొచ్చిన సిరి, సంపదా, అంతా జావాలిపోయింది. తనకున్న బంధనాలు తెగిపోయాయి; సంకెళ్ళు వూడిపడ్డాయి. తనింక స్వతంత్రుడు.— స్వేచ్ఛాజీవి. గుండె, బరువుతో వగపడటం లేదు. బరువుగా నడచి గేటు దగ్గర కొచ్చాడు.

ఏదో మిగిలింది- అంతా నాశనంగా లేదు. పైకి చూశాడు— తల్లి రాతివిగ్రహం—విరిగి పడిపోయింది—పాదాలు మాత్రం మిగిలాయి. 'అమ్మయ్య' అనుకున్నాడు. ఇప్పుడతనికి సంపూర్ణ స్వతంత్రం, అయ్యో యిది వొక్కటే మిగిలిపోయిందే! అని విచారించక్కర్లేదు.

నారయ్య కిట్టుతో, దీవిస్తో లేవబోయ్యాడు. అతన్ని పడుకోబెట్టి, కోమలికి కట్టుకట్టి చికిత్స చేసి, నెత్తికింద దిండ్లు పెట్టి,-యింతలో యేదో జ్ఞాపకం వొచ్చి గబగబా ఆచారిగారింటికి పరుగెత్తుకు పొయ్యాడు. ఇంటిముందు మంచాలు అల్లాగే వున్నాయి. పక్క దుప్పట్లు యివతలికి లాగాడు— దిండ్లు వూడదీశాడు. వాటికింద, రాత్రి చదవకుండా వొదిలేసిన, రెండు కవర్లు దొరికాయి. మంటల వెలుగు బోలెడుంది. మొదటి కవరు చించి చదివాడు.

"అయ్యా, నేను మీకు జ్ఞాపకం వుండే వుంటాను. వైకుంఠంగారబ్బాయిని. మా నాయనగారు నెల క్రితం పక్షవాతంవల్ల స్వర్గస్థులైనారని వ్రాయుటకు చింతిస్తున్నాను. వారు చనిపోయేముందు, నాకో కవరు వప్పగించి, దానిని మీకు పంపమన్నారు. దుఃఖసముద్రములో మునిగి, నేను యిన్ని రోజులూ ఆలస్యం చేసినందుకు క్షమిస్తారని తలుస్తాను. మా తండ్రి గారి కోర్కెప్రకారం, ఆకవరు యిప్పుడు వేరే పంపుతున్నాను. అందినదీ, లేనిదీ వెంటనే వ్రాయించ కోరతాను.

ఇట్లు

జనార్దనం

ఆ రెండో కవరు చించాడు నిధి. అందులో వొక వుత్తరం, మరొక చిల్లికవరూ వున్నాయి. ఆవుత్తరం చదివాడు.

"దయానిధీ, నువ్వుకొన్ని సంవత్సరాల క్రితం జీవితానికి అర్థం ఏమిటని ప్రశ్నించావు. అప్పుడు నీకు సమాధానం ఇచ్చినానో గుర్తులేదు, ఏదేనా చెప్పివున్నా, అది నిజమైన సమాధానం అయివుండదు. ఇప్పుడు సమాధానం నాకు దొరికింది. నువ్వు నా ప్రియశిష్యుడవైనందున, ఆ రహస్యం నీకు చెప్పివెయ్యడం నా విధి. ఆ ప్రశ్నకు సమాధానం, యిందులో పంపుతున్న చిన్న కవరులో వుంటుంది. అది నువ్వు రుజువు చేసుకున్నదీ, లేనిదీ, తెలుసుకునేటంత వరకూ నేను జీవించి వుండను. దైవకృప అట్టిది.

ఇట్లు

వైకుంఠం

ఆత్రుతతో ఆ చిన్ని కవరు చించి చూశాను. అందులో ఏమీ లేదు— ఉత్త ఖాళీ కవరు—జీవితాని కర్థం లేదన్నమాట!

మంటల అందం చూస్తూ, జనం నిలబడ్డారు. కొందరు ఆర్పడానికి యత్నాలు చేస్తూనే వున్నారు. నిధి తన మేడ పైవైపుకి నడిచి వెళ్ళిపోయ్యాడు, కింద వరండాలో రాజమ్మగారు, పిల్లలు ఏదో చదువుతూ కూర్చున్నారు.

"మీ రందరూ పడుకోండి" అన్నాడు నిధి.

రాజమ్మగారు నిశ్శబ్దంగా పఠనం సాగించింది.

"ఇదంతా నా మూలాన జరిగింది" అన్నాడు.

ఆవిడ ఏమీ మాట్లాడలేదు. అరగంట గడిచింది. రాజమ్మగారు "ఆయన వూళ్ళో లేక పోవడంవల్ల యిల్లా జరిగింది" అంటూ, పిల్లల్ని తీసుకని పైకి నడిచింది.

నిధి, వో ఉత్తరం రాసి కిటికీలో పెట్టి గేటుదగ్గరి బండి దగ్గరి కొచ్చాడు. కోమలి అతన్ని నీరసంగా పిలిచింది, ఆమెను బండి లోంచి దింపారు. చేతికిమాత్రం బలమైన గాయం తగిలింది. ఆ చేతిని తన బుజంమ్మీద వేసుకున్నాడు. నిధీ, కోమలీ, మెల్లిగా నడవడం సాగించారు.

"ఎక్కడికి యీ చీకట్లో?" అంది కోమలి. నవ్వడానికి బాధ పడుతూ.

"ఎక్కడికో తెలిస్తే, యికనేం?-జీవితం నిరంతర యాత్ర-గమ్యస్థానం లేదు. నడవగలవా నువ్వు —?"

"ఓ" అని మూతి సున్నాలా చుట్టి, జుట్టు వెనక్కి తోసుకుని అతని బుజాన్ని బిగించి పట్టుకుని తొందరగా నడవడం సాగించింది. ఇళ్ళు, మనుషులు వెనకపడ్డారు. తాటిచెట్లు నిద్రలో లేచి అవులించి పక్కకి జరిగి మళ్ళా పడుకున్నాయి—కావలా కానేటందుకు ఏమీ లేక.

వెనక్కి తిరిగి చూశాడు. తీరాచేసి వాళ్ళు వొక ఫర్లాంగే నడిచారు. దూరంగా, మేడముందు, గేటుదాటి ఎవరో యివతలి కొచ్చి, తమకేసి నడుస్తున్నారు. వెనక ఎవరో నడిచి, ముందు నడిచేవారిని నిలిపి, - యిద్దరూ మళ్లా వెనక్కి వెళ్ళిపోయిన దృశ్యం చూశాడు నిధి. ఎవరో అతనకి తెలిసింది.

రాళ్ళు, గుట్టలు, పొదలు, కాలిబాట అవతలిగట్టు, పుట్టలు-అన్నీ దాటి కొండల దగ్గిరికి చేరుకున్నారు.

అంతా చీకటి. కాలం ఎంతైందో ఎవరికీ తెలియదు. పైనా, కిందా - అన్నీ నక్షత్రాలే, తన సిరి, సంపదా, 'కాత్యాయని' — అన్నీ కోటివజ్రాలై, ఆకాశాన అలంకరించాయి. - ఎవరికీ అందకుండా - ఎవరూ నిర్మూలం చెయ్యకుండా. వెనకా ముందూ, ఎడమా కుడీ—అంతటా చీకటి, నక్షత్రాలు విశ్వమంతా. వాటిలో వొక చిన్న నక్షత్రం సృష్టిలా వికసించి విశ్వమంతటా వ్యాపించింది. అంతా తమదే - కాని చెయ్యి చాస్తే ఏదీ అందదు. అన్నీ తమరివే-కాని నోరిప్పి పిలిస్తే, ఏదీ పలకదు.

రెండుకొండల మధ్యనుంచి నడిచి, అవతలికి చేరుకున్నారు - అవతలంటూ లేని అవతల నడిచినడిచి; నడిచినడిచి, నడిచినడిచి - మళ్ళా అక్కడికే చేరుకోటమా' అంతేనా విశాల ప్రపంచం. అదేనా అనంత జగత్తు? ఇదా ఎడతెగని జీవిత రహస్యం!

కోమలి గడ్డిలో వాలిపోయింది.

"ఇక నేను నడవలేను బాబు—యిక్కడ పడుకుందాం."

చీరకొంగు వుండకింద చుట్టి తల కింద పెట్టుగుని కోమలి పడుకుంది.

ఎవరో 'నిధిగారు' అని బిగ్గరగా కేక వేసినట్లు వినిపించింది. కొండ మధ్యనుంచి వెనక్కి వొచ్చి చూశాడు. దూరంగా ఎవరో కదులుతున్నట్లు కనిపించింది. 'అయ్యగోరూ' అన్నది ఆ కంఠం. గబగబా వెనక్కి నడిచాడు.

నారయ్య పడిపొయ్యాడు.

"నావన్నై పోయిందండి—మీ కెందుకూ పనికిరాకుండా వున్నాను. మీరు భద్రంగా వుండండి....మీరు...."

నారయ్య మరి కదలడు.

నిధి దూరంగా నడిచి, కొండపక్క పెద్ద దిమ్మమీద పడుకుని ఆకాశంకేసి చూస్తున్నాడు. ఆనాడు కాలవగట్టు. యీనాడు కొండల మధ్య - అదే ఆకాశం. అవే నక్షత్రాలు. అతను ఎంత దూరం వొచ్చినట్లు? ఎంతసేపు ఆయినట్లు? స్థలం, కాలం తనూ - యీ మూడింటిలోనూ, ఏది యథార్థం? ఆ బండి కింద పడివున్నది ఎవరు? చివరికి మిగిలిం దేది?

తన జీవితం పాడు చేసుకున్న వ్యక్తి యితరుల నేనా బాగు చేద్దా మని సంకల్పిస్తే. అన్నీ పేచీలే. తన జీవితం బాగుచేసుకున్న వ్యక్తికి, యితరుల జోలి అక్కర్లేదు. ఇతరులు బాగులేక పోతే నే తను బాగుండటం అనేది జరుగుతోంది. అసలు మంచి చెడ్డల విలువలు నిర్ణయించేది, యితరులు. ఒకరి 'కంటె' ఒకరు మంచి. కాని అసలు 'మంచి' అంటూ ఎక్కడుంది? ఎక్కడో వుండాలి లేకపోతే 'కొంచెం మంచి.' 'యింకా మంచి' ఎల్లా వొస్తాయి? మంచికి కావల్సింది మూడు: ప్రేమా ధనం. కీర్తి. మొదటిది యవ్వనంలో; చివరిది చివరలో: రెండోది ఎప్పుడూ కావల్సింది, రెండోది వుంటే, మొదటిదీ చివరిదీ యిట్టే లభ్యమౌతాయి అనాలి. కాని అతనికేం కావాలో అతనికి తెలీక, ఇవ్వ దతనికి ఏమి అక్కర్లేదు.

ప్రేమా!

నిరసించిన వరాలు, జాతే నుడురూ, ఎండిన నాత్రుకా - దాని కోసం దగాలు, స్నేహాలు, మనస్సులు కలవోసుకోటం, గుండెలు విడిపోటం, కత్రులు, నాటకాలు.

మబ్బు మేఘాలు, కెరటాల తుంపర, పువ్వు వికసించటం; సంధ్య మంచులో నదీ, మేక అఱుపు: పిల్లల ఆట, కుక్క విశ్వాసం. పిల్లల కేకలు, వేసంగి వాన, మొక్క మొలిచిన వయ్యారం, ఎండిన ఆకు వైరాగ్యం; దాహమేస్తే మంచి నీళ్లు త్రాగడం,—ప్రియురాలి తేత పెదవులు-అదా ప్రేమ!

ధనమా!

భవనాలు, కార్లు; బాంక్ పుస్తకాలు; రెండు కళ్ళ మధ్య పరాయి స్త్రీ రొమ్ముల బరువు; వేడిశ్వాస మధ్య వుక్కిరి బిక్కిరి కావడం. అందరి మీదా అధికారం; తనకి తనే దాస్యం, నలుగురు యువకులు, నాలుగు కుక్కలు, పారేసిన విస్తళ్ళ కోసం తన్నుకులాడు తుంటే కారులో కళ్లు మూసుగుని, కూర్చోడం - తన జాగిలాన్ని వాళ్ళ మీదికి యిస్క కలపడం - అదా ధనం!

కీర్తా!

ఏమో, ఉపన్యాస వేదికల మీద మహానుభావుడు - వంటింట్లో మృగం: గ్రంథాలలో గొప్పవాడు; పడగ్గదిలో జంతువు, రోడ్డు మీద ప్రజా సేవకుడు; ఇంట్లో సర్వాధికారి; పదిమందిలోనూ మహా పురుషుడు; ఏకాంతంగా దౌర్భాగ్యుడు.

అతను జయించిన పరదేశా లన్నీ మహారాజ్యా లయ్యాయి; అతని స్వదేశం శ్మశానమైంది. అతన్ని ప్రేమించిన స్త్రీ అందరూ రాణు లయ్యారు; అతను ప్రేమించింది అడుక్కు తింటోంది. గడ్డి పోచ బంగారు కణికయింది; పిచ్చి పువ్వం మణి; మట్టి వెన్నెలయింది; కణికలూ, మణులు, వజ్రాలు, వెన్నెల మంట గలిశాయి. శరీరాన్ని ఎంద రెందరో పంచుకున్నారు: కీర్తిని కాజేశారు. ప్రేమని విషం పోసి హత్య చేశారు. సౌందర్యం జుట్టు విప్పుగునియవ్వనాన్ని కౌగలించుకుని యేడ్చింది. శాంతం 'అహా' విరిచేసి తల వగల

గొట్టుకుంది; దయని పగ పొడిచింది. మతాన్ని విజ్ఞానశాస్త్రంపూర్వే సింది దైవాన్ని దేవాలయంలో బంధించారు. మంచితనం సింహాసనం యొక్క ప్రాణం విడిచింది. మోహం నాగరికత నడుంని సాగేసింది. నాగరికత రోజూ కార్లకిందా, రైళ్ళకిందా,విమానంలోంచి దూకుతూ ఆత్మహత్య చేసుకుంటోంది. 'మనం' ముక్కలై 'నువ్వు' 'నేనూ' అయి ఉత్తర దక్షిణాలకి ప్రయాణం చేసింది. వారూ, వీరూ, ఎవరో కొందరు, వొకరు, మీరూ, ఎందరు! - ఎమో! 'అందరూ' మాత్రం లేరు.

అన్నీ ప్రశ్నలే - సమాధానం లేదు.

ఎందుకు, ఎక్కడ, ఎప్పుడు, ఎట్లా, అందుకా? ఎవరు? ఏది? ఏవి? ఎన్ని?

ఇందుకు, ఇక్కడ, ఇప్పుడు, యిట్లా యిందుకు, వీరు, ఇది, ఇదిగో, ఇన్ని - లేవు, చుట్టూ నవ్వులు, మధ్యలో ఏడ్పు, అంతటా ఆనందం, లోపల కేంద్రంలో బాధ; అంతటా వెలుగు, మధ్య చీకటి. పైనా, కిందా, ఎడమా కుడీ దైవం, మధ్య మృగం. అన్నీపోయాయి; అంతా అయింది; చివరికి మిగిలింది తను.

● ● ●

సంఘాన్ని మార్చలేడు, మనుషుల్ని మార్చలేడు. మారిస్తే బాధ, పగ, యుద్ధం. తనతో తను సమాధాన పడాలి. అది యీనాటికి సాధించాడు. ఒక ప్రశాంతత, పవిత్రమైన మహత్తర ఆనందం అతనిలో వుద్భవించింది. అది బాహ్యప్రపంచంలో లేదు. మంటని చల్లార్చే మంచుకణాల ప్రవాహం అతని హృదయం. పిచ్చి ప్రపంచాన్ని దయతో దూరంగా వుంచే ఔదార్యం. మతాన్ని, దైవాన్ని, మనుషుల్ని తోసేసి సంతృప్తిచెందే ఆధ్యాత్మిక దృష్టి తనలో కదపారి యథార్థం.

తన్ను తాను పరిపూర్ణంగా చూశాడు. ఎంత చిత్రం! ఎంత దగా! ఎంత భ్రమ! తనతో తాను సమాధానపడి, తన్ను తాను స్వీకరించి, కౌగిలించుకని ఏకమయ్యాడు. ఇప్పుడు ప్రపంచాన్ని అంగీకరించొచ్చు, తన్ను తాను తృణీకరించిన వాడు ప్రపంచాన్ని అంగీక